Regd No. M.1118.

12 పేజీలు-2 అణాలు



# ఆంధ్రపత్రిక

317621

Founder: K. NAGESWARA ROW. SUNDAY EDITION.

Vol. 36. ANDHRA PATRIKA, MADRAS. 25th DECEMBER 1949 No. 262



# పాకిస్థాన్‌కు బొగ్గు ఎగుమతి బంద్: భారత ప్రభుత్వ నిర్ణయం

## "నవయుగశాంతి దూత గాంధీజీ ప్రబోధమే ప్రపంచానికి శరణ్యం"

### మహాత్ముని సేవాగ్రామ్ కుటీరంనుంచి రాజెన్‌బాబు రేడియో ప్రసంగం

వార్ధా, డిసెంబరు 24: సేవాగ్రామములో గాంధిమహాత్ముడు నివసించుచుండిన కుటీరమునుండి నేటిదినము అనగా లోకశాంతి ప్రతిష్ఠాపనా ప్రభువైన ఏసుక్రీస్తు జన్మించిన ఈ శుభదినమున ప్రపంచ శాంతికాముల మహాసభ పునస్సమావేశమునకు అధ్యక్షత వహించుచు డాక్టర్ రాజేంద్రప్రసాద్‌గారు అభినవ శాంతిదూత యగు గాంధిమహాత్ముని సందేశమును నేటిరాత్రి రేడియోలో ప్రసంగించుచు లోక శాంతి సౌఖ్యములకు మహాత్ముని దివ్య ప్రబోధాచరణమే శరణ్యమని ఉద్బోధించిరి.

డా॥ రాజెన్‌బాబు ఇట్లుకూడ ప్రసంగించిరి: "సాధారణమానవ మాత్రులకందరకును యీ మహాసభ విన్నవించి ప్రార్థించునది ఏమనగా, తన జీవితము శాంతికి ఆటపట్టుగా నుండునట్లు చేసికొనవలెను. వివిధ దేశాల ప్రజలకు ఈ మహాసభ విన్నవించునది ఏమనగా, ఆయా దేశజాతులవారు తమకుగల నైతికబలమును వస్తుసంపత్తిని అభ్యుదయ నిర్మాణ కార్యములకు ఉపయోగపరచవలెను. గాని, సంహార సాధనముల నిర్మాణమునకు కాదు. ప్రజలకు సంహార హింసనములను నష్టయిచేసి సంహారమే దివ్యమైన మార్గమని బోధింపరాదు.

లోకములో శాంతిని ప్రతిష్ఠించుటకు గాను ప్రచారమునా జనసంచనా అంతరించవలెను. ప్రతివ్యక్తియును నిరాడంబర జీవితమును గడపవలెను. ఇతరులయెడల క్రియాపూర్వకమైన సద్భావమును చూపవలెను.

ప్రతి వ్యక్తియును తన అయిహికభోగములను ఎంతగా తగ్గించుకొనివిసర్జించాలో

(2-వ పేజీ చూడుడు)

### 18 ఏళ్ల పడుచుపిల్ల సహగమనం

#### యు. పి. గ్రామంలో విషాద సంఘటన

సీతాపూర్, డిసెంబర్ 23: సంయుక్తరాష్ట్రములోని సీతాపూర్ జిల్లాలోని ఒక గ్రామంలో 18 ఏళ్ల యువతి మరణించిన భర్తతో చితిమీద సహగమనం చేసినదని ఇక్కడికి ఒక వార్త వచ్చినది.

భర్త చనిపోయినప్పుడు ఆమె ఏడవడంకానీ, కంట తడిపెట్టటంకానీ, మరేవిధంగానైనా దుఃఖాన్ని ప్రకటించటంకానీ చేయ లేదట. తాను రామాయణ పఠనంచేస్తూ ఉన్నంతసేపూ భర్త శరీరాన్ని ఎవరూ ముట్టుకోవద్దనిమాత్రం ఆమె కోరినదట. అది పూర్తి అయినతరవాత భర్త శవంవెంట శ్మశానానికి వెళ్లి, అతని తలను ఒళ్లో పెట్టుకుని చితిలో కాలిపోయినది.

### హైకమిషనర్లకు రాయబార హోదా

#### బ్రిటిష్ ప్రభుత్వానికి భారత ప్రభుత్వ వర్తమానం

లండన్, డిసెంబర్ 23: బ్రిటన్ హైకమిషనర్ హోదాను రాయబారి హోదాకు మార్చుచేసుకోవాలనే అభిలాష యేమైనా ఉన్నదా? అని బ్రిటిష్ కామన్వెల్తు రాజ్యాలు అడుగుతున్నట్లు రూఢిగా తెలియవచ్చింది. బ్రిటిష్ ప్రభుత్వానికి యింతవరకు అందిన సమాధానాలు చూస్తే, కామన్వెల్తు రాజ్యాల అభిప్రాయాలు భిన్నంగా ఉన్నట్టుగూడా తెలుస్తున్నది.

భారత రిపబ్లిక్ అవతరణానంతరం, బ్రిటన్‌లో హైకమిషనర్ స్థానే రాయబారిని నియమించుకొంటామని, భారత ప్రభుత్వం సమాధానం పంపినట్లు తెలిసింది. కొన్ని కామన్వెల్తు రాజ్యాలు యిందుకు సమ్మతించడంలేదట.

లండన్‌లో బ్రిటిష్ అధికారులు ఇప్పటికింకా ఏ వ్యాఖ్యానము చేయలేదు.

## జనపనార రవాణాను అక్రమంగా అటకాయించినందుకు ప్రతీకారచర్య

### అధినివేశ శాసనసభలో వాణిజ్య మంత్రి నియోగిగారి ప్రకటన

**న్యూఢిల్లీ, డిసెంబరు 24: "తాత్కాలికంగా పాకిస్థాన్‌కు బొగ్గు ఎగుమతులను నిలిపివేయుటకు భారత ప్రభుత్వం నిర్ణయించింది. భారతీయ వర్తకులు పాకిస్థానులో కొన్న జనపనార ఇండియాకు రవాణా కాకుండా పాకిస్థాన్ బుద్ధిపూర్వకంగా అటకాయించినందుకిది ప్రతీకారచర్య" అని భారతప్రభుత్వ వాణిజ్యమంత్రి కె. సి. నియోగిగారు యీవేళ పార్లమెంటులో ప్రకటించారు.**

తాము అటకాయించిన జనపనారను రవాణాకు విడుదలచేసి వ్యాపారాన్ని పాకిస్థాన్ మామూలుగా పునఃప్రారంభించగానే, బొగ్గు రవాణా చేస్తామనీ, అంతేకాక, యిప్పుడు కొరతపడ్డ బొగ్గు సప్లయిని భర్తీ చేస్తామనీ, భారతప్రభుత్వం పాకిస్థాన్‌కు తెలియజేసిందనీ నియోగిగారు వెల్లడించారు.

ఈవేళ పార్లమెంటులో, హెచ్. వి. కామత్, వాణిజ్యశాఖా మంత్రిని నియోగిని యీదిగువ స్వల్పకాల వ్యవధి ప్రశ్నలకు సమాధానం మివ్వవలసిందిగా అడిగాడు.

భారత వాణిజ్య సంస్థల తరఫున పాకిస్థాన్‌లో ముడిజనపనారను విశేషంగాకొని నావల కెక్కించి ఇండియాకు రవాణా చేయుటకు ప్రయత్నిస్తుండగా పాకిస్థాన్ అటకాయించినమాట నిజమేనా? అయితే ఎప్పుడు ఎందువల్ల పాకిస్థాన్ అటకాయించింది? భారత యూనియన్ ఒక ప్రాంతంనుండి, పాకిస్థాన్ భూభాగంగుండా, భారత యూనియన్‌లో మరొక ప్రాంతానికి రవాణా అవుతున్న ముడి జనపనారను గూడా పాకిస్థాన్ అటకాయించినమాట వాస్తవమేనా? అయితే ఆ ముడిసార పరిమాణమెంత. యీ అటకాయింపు, ఎప్పుడు, ఎక్కడ జరిగింది. ఏ పరిస్థితుల్లో, ఏకారణాలవల్ల పాకిస్థాన్ యిలా అటకాయించింది.

ఈ విషయంలో భారతప్రభుత్వం యే చర్య తీసుకొన్నది? లేదా తీసుకోదలచింది.

ఈ ప్రశ్నలకు నియోగి సమాధానమిస్తూ యిలా తెలియజేశారు.

ఈ ప్రశ్నలను అవకాశంగా తీసుకొని పాకిస్థాన్‌తో మన వ్యాపారలావాదేవీలలో యిటీవల యేర్పడిన పరిణామాలను కొంత వివరంగా తెలియ జేయదలచాను.

2-వ పేజీ చూడుడు

### ఇండియా-పాకిస్తాను వర్తక సంబంధములు

ఢిల్లీ, డిసెంబరు 24: ఇండియా-పాకిస్తానుల మధ్యనున్న వర్తక సంబంధముల గూర్చి ఇండియా గవర్నమెంటు వివరించుచు ఒక శ్వేతపత్రమును త్వరలో ప్రకటించునని వ్యాపారశాఖామంత్రి కె. సి. నియోగిగారు నేడు ఇండియా పార్లమెంటులో ప్రకటించిరి.

## ఆంధ్ర రాజధాని తిరుపతే!

### తమిళనాయకుల పట్టుదల ఫలితంగా ఆంధ్రనాయకుల నిస్సహాయస్థితి

చెన్నపట్నం, డిసెంబరు 24: విభజన సంఘములోని ఆంధ్ర సభ్యులు రేపు రెండు గంటలకు ఆంధ్ర రాజధాని పేరు చెప్పుటకు తమిళసభ్యులను గడువుకోరినారని తెలియుచున్నది. ఆంధ్రరాజధాని మద్రాసులో ఉండరాదనియు ఆంధ్రమంత్రులు, గవర్నరు, వేరే చోట ప్రమాణము తీసుకోవలెననియు, శాసనసభా సమావేశములు చెన్నపట్నంలో జరుగరాదనియు తమిళులు కోరుచున్నారు. హైకోర్టు అడ్మిషనుజడ్జిని ఆంధ్ర ప్రాంతములో ఉంచుకొని మిగతా జడ్జీలు చెన్నపట్నంలో కొంతకాలం ఉంచుకొనవచ్చునని తమిళులు తెలుపుచున్నారు.

తమిళుల కోర్కె అన్యాయమనియు, ఈ పేచీలో కేంద్ర ప్రభుత్వంవారి మధ్యవర్తిత్వమును అర్థించెదమనియు ఆంధ్ర సభ్యులు తెలిపినారు. అందుకు తమిళ సభ్యులు నిరాకరించినందున రేపు రెండుగంటలకు ఆంధ్ర రాజధానిని తెలుపుటకు ఆంధ్రసభ్యులు అంగీకరించినారు.

నేటి ఉదయం 8-30 గంటలనుంచి 11 గంటలవరకు విభజనసంఘ సమావేశము జరిగెను. రాజధాని విషయమై రేపు పేరు తెల్పుటకు ఆంధ్రసభ్యులు అంగీకరించినందున ఉపసంఘములోని ఇతర విషయములపై చర్చ జరిగెను.

నిన్నరాత్రి విజయవిహారంలో ఆంధ్ర నాయకుల సమావేశం జరిగెను. శ్రీ ప్రకాశం, వెంకట్రావు, గోపాలరెడ్డి, చంద్రమౌళి, సీతారామరెడ్డి, సంజీవరెడ్డి, కాశీశ్వరరావు, విశ్వనాథం సుబ్బారావు, కోటిరెడ్డి ప్రభృతులు హాజరైరి. రాయలసీమ నాయకులు శ్రీబాగ్ ప్యాక్టు ప్రకారం ఈనామమాత్రపు రాజధానిని తమకు ఇవ్వ

(2-వ పేజీ చూడుడు)

## "ఐక్యరాజ్య సంస్కృతీ విద్యా సంస్థ ఉపయుక్తమైనది"

### భారత సమితిలో ఆజాద్ ప్రసంగం

బొంబాయి, డిసెంబరు 23: ఐక్యరాజ్య విద్యాసాంస్కృతిక సంస్కృతీ సంస్థతో సహకరించే భారత జాతీయ సమితియొక్క సంస్కృతీ సమితి తొలిసమావేశం నేడు ఆరంభమై రెండురోజులపాటు జరుగుతున్నది. ఈ సమావేశం భారతీయ విద్యాభవనంలో ఏర్పాటు చేయబడింది దీనికి దేశమంతటినుంచీ 80 మంది ప్రతినిధులు హాజరైనారు. బొంబాయి ప్రధాని, మంత్రులు మొదలైనవారు కూడా సమావేశంలో పాల్గొన్నారు.

ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన భారత ప్రభుత్వ విద్యామంత్రి మౌలానా అబుల్‌కలాం ఆజాద్ మాట్లాడుతూ, ఐక్యరాజ్య సమితి ఇప్పటివరకు చేసిన కృషి ఆశాజనకంగా లేని కారణం చేత దానిని గురించి ఒక నిర్ణయానికి రావడం సాధ్యంకాదనీ, అయినా నిరుత్సాహ కవలసినపని లేదనీ, ప్రపంచశాంతి కనుకూలమైన సాంస్కృతిక వాతావరణం పెంపొందించడానికిగాను విద్యాసాంస్కృతిక సంస్కృతీ సంస్థ నెలకొల్పబడి కొంతవరకు సఫలమయిందని అన్నారు.

ఇప్పుడు సమావేశమైన సంస్కృతీ సమితి అంతర్జాతీయ దృక్పథంతో వ్యవహరించాలనీ, ఐక్యరాజ్యసమితిలో చేరిన దేశాల ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక విషయాలను గురించి ఏటా నాలుగు పుస్తకాలు ప్రచురణకావాలనీ, ఇతరదేశాల ఉత్తమ సాహిత్యం హిందీలోకి, ఉత్తమ హిందీ సాహిత్యం ఇతరదేశభాషలలోకి తర్జుమా కావాలనీ, ఒక పత్రిక కూడా నిర్వహించబడాలనీ మౌలానా ఆజాద్ సూచించారు.

ఆహ్వాన సంఘాధ్యక్షురాలు శ్రీమతి లీలావతి మున్షీ మాట్లాడుతూ ఐక్యరాజ్యసమితి కన్న సంస్కృతీ సంస్థ ఎక్కువ ఉపయుక్తమని వివరించారు.

బొంబాయి ప్రధాని బి. జి. ఖేర్ స్వాగతోపన్యాసం చదువుతూ, ప్రస్తుత పరిస్థితిలో ప్రజలు ప్రాచీన సంస్కృతిని నిరసించే ప్రమాదం కంటె, సంకుచిత దృష్టితో గతాన్ని ఆరాధించే ప్రమాదం హెచ్చుగా ఉన్నదన్నారు.

భారతీయ విద్యాభవనం వారు ఏర్పాటుచేసిన చిత్రకళా ప్రదర్శనాన్ని మౌలానా ఆజాద్ ప్రారంభించారు. ఇందులో ప్రసిద్ధ భారతీయ చిత్రకారుల చిత్రాలలో బాబునుసాక్షాత్కరించిన 28 ప్రెస్కో-నకూనా ప్రదర్శించబడుతున్నవి. వీటిని ఐక్యరాజ్య సంస్కృతీ సంస్థానుంచి భారతీయ సంస్కృతీ సమితికి అందించారు.

## "హైదరాబాదు విభజననే సంస్థాన రాజ్యాంగపరిషత్తు బలపరుస్తుంది"

### రాజాజీ అభిప్రాయంపై ఆచార్య రంగా విమర్శ

విజయవాడ, డిసెంబరు 23: "అసహజంగాను, కృత్రిమంగాను కల్పింపబడిన హైదరాబాదు సంస్థానమును సహజభాషా విభాగాలుగా విభజించటానికి రాబోయే హైదరాబాదు రాజ్యాంగ పరిషత్తు అత్యధిక సంఖ్యాబలంతో నిర్ణయించగలదని నాదృఢవిశ్వాసం" అని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు ఆచార్య ఎన్. జి. రంగా నేడు ఉద్ఘాటించారు.

ఢిల్లీనుండి నేడే తిరిగివచ్చిన రంగాగారు హైదరాబాదులో గవర్నరు జనరలు ఉపన్యాసమును విమర్శిస్తూ పైమాటలు చెప్పారు.

ప్రభుత్వాధిపతులలో భేదాభిప్రాయాలు పెట్టుకోవటం మంచిది కానప్పటికీ, దేశశ్రేయస్సును మనస్సులో ఉంచుకుని తాను అయిష్టంగా ఈ విమర్శచేయవలసి వచ్చిందనీ, గవర్నరు జనరలు కూ సంస్థానంమీద, నిజాంమీద చెప్పినమాటలు చరిత్ర నేర్పిన గుణపాఠాలకు పూర్తిగా విరుద్ధంగా వున్నాయనీ రంగాగారన్నారు.

"గవర్నరు జనరలు వెలిబుచ్చిన అభిప్రాయం ఆయనస్వాభిప్రాయమేననీ భారత ప్రభుత్వ వైఖరి కానే కాదని నేను ఆశిస్తున్నాను. అదే ప్రభుత్వ వైఖరి అయితే పార్లమెంటులో ముఖ్యమైన చర్చలు జరగటానికి అది కారణమవుతుంది.

గతంలో హైదరాబాదు చరిత్రను పరికిస్తేతేలేవిషయం యిది. ప్రథమ భారతస్వాతంత్ర్య సమరంలోను, దానికి ముందు, తరవాత కూడా భారతీయులను ఒకసారి ఫ్రెంచి వారికీ, మరొకసారి ఇంగ్లీషు వారికీ వస్తువులను అమ్మినట్టు అమ్మటం జరిగింది. ఈ విద్రోహ విధానము నవలంబించటంవల్లనే ఒక నిజాము తరవాత మరొక నిజాము తమ సంస్థాన "ఐక్యతను, ప్రత్యేకతను" నిలబెట్టుకోగలిగారు. ఈ ప్రత్యేకత ఏమిటి అంటే, తెలుగు, మహారాష్ట్ర, కన్నడ ప్రజలను అల్పసంఖ్యాకుల నియంతృత్వం క్రింద, అరబ్బీ నాగరికతాసూత్రాల క్రింద అణగద్రొక్కి వుంచి, వారి అభివృద్ధిని నిరోధించటమే."

### జాతీయ చైనా దిగ్బంధన విధానం

#### తమ నౌకలకు అమెరికా హెచ్చరిక

వాషింగ్టన్, డిసెంబరు 23: చైనా జాతీయవాదులు కొనసాగిస్తున్న దిగ్బంధన విధానానికి వ్యతిరేకంగా అమెరికా నౌకలు షాంగైకి పోవడానికి ప్రయత్నించిన పక్షంలో ఆ నౌకల లైసెన్సులు రద్దు చేయగలమని అమెరికన్ విదేశాంగశాఖ ప్రకటించింది.

అమెరికన్ విదేశాంగశాఖ ఆ దేశాన్ని దక్షిణకొరియాలోవున్న ఆమెరికన్ రాయబారి కార్యాలయం చైనా ప్రాంతంలో వున్న అన్ని అమెరికన్ ఓడలకు అందజేసింది.

### కాశ్మీర్ సమస్యపై చర్చ

లేక్‌సక్సెస్, డిసెంబర్ 23: కాశ్మీర్ సమస్యపై చర్చకొనసాగించేందుకు, భద్రతామండలి, డిసెంబర్ 27 తే మధ్యాహ్నం తిరిగి, సమావేశమవుతున్నది.

### ఇండియా గవర్నరు జనరల్

#### అజంతాగుహల సందర్శనం

ఔరంగాబాద్, డిసెంబరు 23: ఇండియా గవర్నరుజనరల్ రాజగోపాలాచారిగారు నేటి ఉదయం తన కుమార్తె నామగిరి, కుమారుడు నరసింహంతో కలసి అజంతాగుహలను సందర్శించారు.

హైదరాబాద్ ప్రధానమంత్రి ఎం. కె. వెల్లోడీ, నవాబ్ జైన్ యార్‌జంగ్ బహదూర్, రాజాధోండీరాజ్, తదితర స్థానిక ప్రముఖులుకూడా గవర్నరుజనరల్ వెంటఉన్నారు.

## ప.గో. జిల్లా కాంగ్రెస్ వ్యవహారాలను ఖండిస్తూ తాలూకా సంఘాల తీర్మానం

### రాష్ట్ర కాంగ్రెసుతో ఏకాయెకి సంబంధాలు పెట్టుకొనడానికి నిశ్చయం

ఏలూరు, డిసెంబరు 23: పశ్చిమగోదావరి జిల్లాలోని వివిధ తాలూకా కాంగ్రెస్ సంఘముల అధ్యక్ష కార్యదర్శుల సమావేశం నిన్న సాయంకాలం ఏలూరు తాలూకా కాంగ్రెసు సంఘ కార్యాలయంలో నరసాపురం తాలూకా కాంగ్రెసు అధ్యక్షులు ఇందుకూరి సత్యనారాయణరాజుగారి అధ్యక్షతను జరిగినది.

సమావేశానికి భీమవరం, ఏలూరు, కొవ్వూరు, చింతలపూడి, నరసాపురం తాలూకా కాంగ్రెసు సంఘముల అధ్యక్ష కార్యదర్శులు హాజరయ్యారు. ప్రత్యేకాహ్వానితులు కూడా కొందరు సమావేశంలో పాల్గొన్నారు. సమావేశంలో ఈ క్రింది తీర్మానాలు ఏకగ్రీవంగా ఆమోదించబడినవి.

I. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం వారికి వ్యతిరేకంగా సర్వస్వతంత్ర సంస్థగా వ్యవహరించుచున్న పశ్చిమ గోదావరిజిల్లా కాంగ్రెసువారి చర్యలను అఖిలభారత కాంగ్రెసు సంఘంవారికి తెలియజేసే నిమిత్తం ఒక సంయుక్త విజ్ఞాపన పంపుటకేకగ్రీవముగా నిర్ణయించనైనది.

2. గోదావరి జి. బోర్డు అధ్యక్ష ఎన్నిక సందర్భంలోను, ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేటు సభ్యత్వ ఎన్నిక సందర్భంలోనూ, అర్జాలా సభ్యత్వపత్రాల పంపకంలోను, రాష్ట్రసంఘంవారి కార్యకలాపముల ఖండించడంలోను, రాష్ట్ర కాంగ్రెసు సంఘంవారి ఆదేశములను తృణీకరిస్తూ వ్యవహరిస్తున్న పశ్చిమ గోదావరి జిల్లా కాంగ్రెసు సంఘము, నానాటికి ప్రజలకునూ, అధీన కాంగ్రెసు సంఘములకునూ దూరమౌతున్నందున, ఆ సంఘము వారి అనుచిత కార్యకలాపములకు దూరముగా యుండుటకున్నూ, క్రమశిక్షణ ఏర్పడి, శాంతి చేకూరువరకూ, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారితోనే నేరుగా వ్యవహారములను జరుపుటకును నిశ్చయించుచూ తీర్మానించనైనది.

3. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమువారి క్రమశిక్షణచర్యకు పాల్పడిన శ్రీయుతులు అల్లూరి సత్యనారాయణరాజు, మాగంటి బాపినీడు, దంతులూరి నారాయణరాజు, మూల్పూరి రంగయ్య, వడ్లపట్ల గంగరాజు, నడింపల్లి తిరుపతిరాజు,

2-వ పేజీ చూడుడు

## గంటల పంచాంగం

విరోధి సం॥ పుష్య శు॥ షష్ఠి

1949సం॥ డిసెంబరు 25 ఆదివారం

ఆ॥ షష్ఠి రా 8-48 శత ప 4.9 వర్జ్యం రా 11-11 ల 12-57 వ.

శు॥ సప్తమి డిసెం॥ 26 సోమవారం

సో॥ సప్తమి రా 10-50 పూ.భా. సా 6-32 వర్జ్యం తె 5-16 ల.


# ఆంధ్రపత్రిక

విరోధి సం॥ పుష్య శు॥ షష్ఠి

ఆదివారం


## రాజధానీ సమస్య: నాయకుల బాధ్యత

విభజనసంఘమునందలి ఆంధ్ర సభ్యులు ఆంధ్రరాష్ట్ర రాజధాని స్థలమును ముందుగ నిర్ణయించి తెలిపినగాని, ఏవిషయముపైనను సమాధానమునకు వచ్చుట సాధ్యముగాదని తమిళ ప్రతినిధులు పట్టుబట్టుటవలన విభజనసంఘ కార్యకలాపమున ప్రతిష్టంభన మేర్పడినదను వార్త 1950 జనవరి 26 లోపున ఆంధ్రరాష్ట్ర నిర్మాణము పూర్తి కాగలదా యను విషయమునకేగాక, రాజధానీ స్థల నిర్ణయవిషయములో ఇంత అన్యావధిగ నాయకులుచేయు తీర్మానము సర్వజన సమ్మతముగ నుండునా యను విషయమునగూడ సందేహములు కలుగుటకవకాశము. నిన్నటి పత్రిక యందు 'ఒక ఆంధ్రుడు' వెల్లడించినట్లు నాయకులు ప్రస్తుత అవసరములనుబట్టి నిర్ణయించు రాజధానీ నగరము హైదరాబాద్ సమస్య పరిష్కార మగువరకు తాత్కాలికమే యగును. తమిళ నాయకులు తిరిగి మాట తప్పకున్న, ఆంధ్రరాష్ట్ర శాశ్వతరాజధాని ఏర్పడి ప్రభుత్వ కార్యాలయములు అచటికి మారువరకు వ్యవహార రాజధాని చెన్నపట్టణ మగనే యుండును.

అట్లుగాక ఆంధ్రరాష్ట్ర రాజధాని నిర్ణయమైనది గనుక ఆంధ్ర ప్రభుత్వ కార్యస్థానములు అచటికి మారవలెనని వారు పట్టుబట్టిన అందుకు కూడ మన నాయకులు సమ్మతింపవలసిన "అవసరము" కలుగును. ఆంధ్రుల యవసరములను తమిళులు తమ లక్ష్యసిద్ధికి సాధనలుగ వినియోగించుకొనుచుండిరి. కనుక తమిళుల కోరికప్రకారము ఆంధ్రనాయకులు 'తాత్కాలిక' రాజధానీ నగరమని ఏ పేరు సూచించుట జరిగినను, అవసరమేర్పడిన—ప్రస్తుత పరిస్థితులను పరిశీలించిన అట్టి యవసరము ఏర్పడుననియే తోచుచున్నది— ప్రభుత్వకార్యాలయములను అచ్చట ఏర్పరచుకొనుటకు గల యవకాశములను సైతము విచారించి రాజధానీ స్థల నిర్ణయమును చేయవలసియుండును.

ఇట్టి సందర్భమున యావదాంధ్రభవిష్యత్తుకు సంబంధించిన ఇంతటి ప్రధాన విషయముపై ఏ కొందరో సమావేశమై నిర్ణయముచేయుట సబబుగాదు. వీరి తొందరపాటు నిర్ణయ ఫలితమును తరతరాలవరకు అనుభవింపవలసి యుండును. కనుక తాత్కాలిక రాజధానియైనను రాష్ట్రమంతటికిని కేంద్రముగ నుండుట యవసరము. విశ్వకళాపరిషత్తు విశాఖపట్నమునకు వెళ్లినను కారణమున ఇంతకాలము ఆంధ్ర విశ్వవిద్యాలయములో చేరనిరాకరించినవారు ఈనాడు ప్రభుత్వ కేంద్రము తమ ప్రాంతముననున్న ఇతర ప్రాంతములుకూడ అట్టివైఖరిని అనుసరించవచ్చునని గ్రహింపవలసియుండును. విశ్వకళాపరిషత్తును కూడ కేంద్రముగ నుండు స్థానమునకు మార్చుటకు ప్రయత్నించి యావదాంధ్రమునకు అన్ని సంస్థలు అందుబాటులో నుండునట్లు చూడవలసియున్నది. అట్లుగాక స్వీయ ప్రయోజనములకు ప్రాధాన్యమిచ్చి, రాష్ట్రమును శీఘ్రముగ పొందవలెనను ప్రజల ఆతురతను అవకాశముగ తీసుకొని స్వకీయ ప్రయోజనముల సాధనకు కృషిచేసిన, ఈ నాయకత్వమునకు ప్రమాదకరము కాగల పరిస్థితులు ఏర్పడగలవు. నాయకులు ఈ విషయమును గ్రహింపవలసియుండును. నాయకులు నేడెట్టి నిర్ణయము చేసినను, అది ఉచితముగ నున్ననే, ప్రజల సమ్మతిని పొందగలరు. తొందరపాటు నిర్ణయమువలన రాగల దుష్ఫలితములు, దారుణ ప్రమాదములను వీరు గ్రహించినట్లు కన్పింపదు. రాష్ట్రనిర్మాణమున కని, రాష్ట్ర భవిష్యత్తునే బలియిచ్చుట రాజనీతిజ్ఞత కాజాలదు.

తమిళనాయకులు దాదాపు ఒకమాసమురోజులుగ "ఆంధ్ర ప్రభుత్వస్థానము చెన్నపట్టణమునందొక్క-క్షణమైనను ఉండరాదు," అని ఆంధ్రనాయకులను హెచ్చరించుటె గాక కేంద్రప్రభుత్వము వద్దకు రాయబారము వెళ్లి ఇదే విషయమును నివేదించియుండిరి. భారతప్రభుత్వ హోంశాఖాకార్యదర్శి శ్రీ హెచ్. వి. ఆర్. అయ్యంగారు నవంబరు 25 వ తేదీ చెన్నరాష్ట్ర ప్రభుత్వమునకు వ్రాసిన లేఖయందీ రాయబార విజ్ఞాపనను ప్రస్తావించి, ఈ విషయమును ఆంధ్రనాయకులు విచారించి యుందురని కూడ తెలిపెను. ఆంధ్ర నాయకులు ఈ విషయమును తగినంత శ్రద్ధతో విచారింపలేదనీ, రాష్ట్రనిర్మాణ ఉత్తరువు జారీ అయిన ఉత్తరక్షణమున చెన్ననగరమును వదలి పోవలసిన పరిస్థితులు ఏర్పడగలవని ఆంధ్ర నాయకులూహింపలేదని ఈ వారపు సంఘటనలు స్పష్టము చేయుచున్నవి.

రాజధాని స్థలనిర్ణయము విషయమున, రాష్ట్ర సంపాదనకొరకు చెన్ననగరమును వదులుకొనకలిగిన, ఆంధ్రనాయకులు ఏకాభిప్రాయమునకు రాగలరనే విశ్వసింపవచ్చును. ఆ నిర్ణయమునకు వచ్చుటలో ఇందుకు సంబంధించిన యావత్తు విషయములను ఉన్న వ్యవధిలోనే సావధానముగ, శ్రద్ధగ ఉద్రేకములకు తావివ్వక నిర్ణయింపవలెను. ఏమైనను, రాష్ట్రనిర్మాణము వాయిదావసుటకు వీలుగాదు. పరిపాలనయందు అనిర్ణయస్థితి ఏర్పడుట ప్రమాదకరము. ఇప్పటికే అట్టిస్థితి ఏర్పడిన సూచనలు కన్పించుచున్నవి. ఈ పరిస్థితులు స్థిరపడకుండ చూడవలసిన బాధ్యత చెన్నరాష్ట్ర ప్రభుత్వముపైనను, ఆంధ్రనాయకులపైనను సమముగ గలదు. ఉభయులు సమాధానమార్గమును అనుసరించి సత్వర రాష్ట్రనిర్మాణమునకు దోహదము చేయగల నిర్ణయములను చేయుటద్వారానే ఉభయులు ఈ బాధ్యతను నిర్వహింపగలరు.

## రాజన్‌బాబు ప్రసంగం

(1వ పేజీ తరువాయి)

అంత ఎక్కువగా, తాను యీ ప్రపంచములో సుఖపడునదే విషయమును గ్రహింపగల్గినయెడల, మానవసంఘము లోకాభ్యుదయ కరమైన కార్యములకు పూనుకొనునట్లు చేయగలదు. నిరాడంబర భోగవర్జిత జీవితము వల్ల ద్వేషమును ప్రేమగా మార్చవచ్చును. భయమును నమ్మకముగా మార్చవచ్చును. హక్కు-స్వాతంత్ర్యములనవిధ్యుక్తధర్మములుగాను, బాధ్యతలుగాను మార్చవచ్చును. జనపీడనములను మానవసేవగా మార్చవచ్చును. ప్రపంచశాంతికాములు సుమారు వందమంది భారతదేశములో సమావేశమై ప్రపంచశాంతికి తగిన సాధన విధానముల గూర్చి ఆలోచించుచున్నారు. 34 దేశాలనుండి యీ ప్రముఖులు విచ్చేసిరి. వీరు ఆయా రాజ్యాలకు ప్రతినిధులుకారు. వీరు లోకశాంతికాములు. శాంతి అనగా యుద్ధములఅభావముకాదు కాని, మానవుల యందు పరస్పర విశ్వాసమును, అభిమానమును ప్రత్యక్షముగా పెంపొందించుట శాంతి ప్రతిష్ఠాపనయగును. యుద్ధములను రేకెత్తించునట్టి మూల కారణము లేవో వాటిని గ్రహించి తొలగించవలెను. ఈ మూలకారణములు మానవుల నిజజీవిత వాంఛల యందే వేరుపారియున్నవి. మానవుల పేరాశలే కారణములు.

వ్యక్తులంతిపసుద్ధజీవులైనచో వివిధజాతులు శాంతి నిర్మాణమునకు పూనుకొనగలవు. ఈ యుగంలో మానవుడు ప్రకృతిలోని వివిధ శక్తులను జయించి యంత్రములను నిర్మించిన కొలదీ మానవులకు భోగలాలసత్వం అయిహిక కాంక్షలు ఎక్కువగుచున్నవి. ఈ భోగలాల సత్వమును అగ్నికి ఆజ్యము పోసినట్లుచున్నది. ప్రతితరమువారును యుద్ధాలను రూపుమట్టించవలెనని ప్రయత్నించుచు చిట్టచివరకు వైరభావములను ద్వేషములను పెంపొందించుచునే యున్నారు. బురదను బురదతో కడిగివేయుట సాధ్యంకాదని గాంధిమహాత్ముడు గ్రహించెను. యుద్ధమును యుద్ధాలతో నివారింపజాలము. అంతకంతకు ఎక్కువ ఘోరమారణాస్త్రములను నిర్మించి ప్రజల నందరిని పటాలముల క్రింద తర్ఫీయదు చేయుటవల్ల యుద్ధభయం తొలగిపోజాలదు. వ్యక్తిగత జీవితమే విశుద్ధము కావలెననియు తద్వారా ప్రపంచములో శాంతి ఏర్పడవలెననియు మహాత్ముడు గ్రహించెను. అందుకొరకై మనజీవితముల పద్ధతులను మార్చుకోవలెను. అటువంటి నిరాడంబర జీవిత వాతావరణములోనే శాంతిప్రతిష్ఠాపన ఉద్భవింపగలదు.

నూతన జీవితపరిస్థితులను మానవుడు కృతసంకల్పుడై తనకుతాను పరికల్పించుకొనవచ్చును. అట్టి స్వచ్ఛందజీవితమునే మన ప్రాచీనఋషులుబోధించిరి. అహింసా పరమోధర్మః అను ఉపదేశమును ఏసుక్రీస్తు తన పర్వత ప్రసంగంలో బోధించెను. ఆ దివ్యబోధలను మానవుడు తన జీవితములో అనుష్ఠించవలెను. భోగవివర్జితుడైనవాడే అట్టి ధర్మముల ననుష్ఠించగలడు. నిరాడంబరత్వము సాధకం చేయుటకు పరాశ్రయజీవనమును తగ్గించి ఆత్మాశ్రితుడై స్వయం సమర్థుడు కావలెను. ఇతరుల యెడల క్రియారూపకమైన అభిమానానురాగము, మానవసేవ చేయుటవల్లనే సాధ్యమగును. ప్రత్యేకవ్యక్తుల జీవితములు మార్గదర్శకములై యితరులకు ప్రబోధమును కలిగించగలవు.

నిరాడంబర జీవితమనగా జీవితావసరములను తగ్గించుకొనుట కాదు. కాని, ఆయా అయిహిక వాంఛలకు మానవులు దాసులు కారాదు. ఒక వర్గమువారు ఇంకొకవర్గములోని జనులను పీడించి పంచేయించుకొనుటకు కారణమేమనగా, యీ జనపీడన చేయుచున్న వర్గమువారు అధిక భోగలాలసులగుటవల్లనే దినదినాభివృద్ధిపొందుచున్నవారి జీవితభోగములకు అంతులేకుండా ఉంది. ఈజనవంచనను యీజనపీడనమే యుద్ధములకు దారితీయుచున్నది. రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మత విషయక ప్రజాపీడనములుపోవలెను. ఆసియాలో, ఆఫ్రికాలో, యూరపులో, అమెరికాలో ఇవి అంతరించవలెను. మానవుడు తన ను తాను స్వయంకృషినల్ల స్వయంసమర్థుడై పరపీడన లేకుండా జీవింపగల్గినయెడల, నిరాడంబర జీవితము సాధకం చేసిన యెడల శాంతిస్థాపనకు అట్టి వ్యక్తులజీవితములు సాధన భూతములగును.

ఇదియే నవయుగ శాంతిమార్గ సందేశము. ఆయన నిన్నమొన్నటివరకు యీ భూస్థలిపై సంచరించి యీ ఉపదేశములో నవనవించి కోట్లకొలది ప్రజాహృదయములను తన జీవిత విధానముచే ప్రబోధించెను.

## ఆంధ్ర రాజధాని తిరుపతే

(1-వ పేజీ తరువాయి)

వలెననియు, సర్కారు రాయలసీమనాయకులు కలసి హైదరాబాద్ రాజధానిగా చేసుకొనవచ్చునని తెలుపుచున్నారు.

అనంతపురం రాజధానిగా పెట్టుకోవలెనని అనంతపురం మండలంవారు వాదించుచున్నారు. తిరుపతిఅయినచో సత్రములు ఉన్నవనియు, నీటివసతి సమృద్ధిగానుండుననియు గనుక అన్నివిధములా తిరుపతియే బాగుండుననియు చిత్తూరు మండలవాసులు వాదించుచున్నారు.

ఆంధ్రనాయకులు శ్రీబాగ్ ప్యాక్టును మన్నించుటకు సిద్ధముగా ఉన్నారు. ఐతే శ్రీ కాళేశంవారి కష్టసుఖములు గూడా గమనించి ఆంధ్రదేశ మధ్యస్థమైన విజయవాడ చెప్పరాదా అని కోరగా ఇది నామ మాత్రం రాజధానేగనుక, హైదరాబాద్‌ను కృషి చేసుకొనవచ్చుగనుక, విజయవాడ వల్లకాదని రాయలసీమ నాయకులు వాదించుచున్నారు.

తిరుపతిలో వెంకటేశ్వర పావనసన్నిధిన ఆంధ్రప్రభుత్వ గవర్నరు, మంత్రులు ప్రమాణముగై కొనవచ్చునని కొందరు ఆంధ్ర నాయకులు తలచుచున్నారు. హైకోర్టును సంబంధించిన అడ్మిరల్‌జడ్జిలూడా చిత్తూరులో ఉండవచ్చుననియు, మదనపల్లిలో కొన్ని భవనములలో కొన్ని ఆఫీసులు ఉండవచ్చుననియు తెలుపుచున్నారు. నేటిఉదయం 7 గంటలకు శ్రీ గోపాలరెడ్డిగారి ఆఫీసుగదిలో శ్రీ ప్రకాశం, వెంకట్రావు, సంజీవరెడ్డి, గోపాలరెడ్డిగారలు సమావేశమై తమిళులకు రేపు పేరు ఇచ్చుటకు తీర్మానించిరి. రేపు ఉదయం 9 గంటలకు పేరు నిర్ణయం చేయుటకు ఆంధ్రనాయకులు సమావేశ మయ్యెదరు.

మద్రాసులో అవమానకరమైన పరతులకు లోబడి ఆంధ్రమంత్రులు ఉండుటకు బదులు, ఇక్కడనుంచి ఎంత త్వరగా వెడలిపోతే అంతమంచిదని ఆంధ్రనాయకులు అభిప్రాయపడుచున్నారు. ఒరిస్సా శాసనసభ తేరాలో జరుపుచున్నట్లు డేరాలువేసి అయినా ఆంధ్రప్రాంతంలోనే ఆంధ్ర శాసనసభ జరుపవలెనని కొందరు ఆంధ్రనాయకులు వాదించుచున్నారు.

రాయలసీమకే నామమాత్ర రాజధాని నిర్ణయించుకొను హక్కు ఇచ్చుటకుఆంధ్ర నాయకులు తీర్మానించినారు. అనంతపురమైతే భవనములు దండిగా ఉండునని అనంతపురంవారు అనుచుండగా తిరుపతి అయినచో, భవనములు, సమృద్ధిఅయిన నీరు, చెన్నపట్నమునకు సమీపము అయిఉండునని చిత్తూరు, కడప మండలములవారు వాదించుచున్నారు.

## పాకిస్థాన్‌కు బొగ్గు ఎగుమతి బంద్

1-వ పేజీ తరువాయి

ఈవ్యాపార లావాదేవీలు, కొన్ని వాణిజ్య ఒడంబడికల ననుసరించి జరుగుచున్నవని, వీటిలో కడపటి ఒడంబడిక 1949 జూన్ నెలలో జరిగిందని సభవారికి విదితమే. ఒకరి అవసరాలను ఒకరు తీర్చుకొంటూ, ఒకరికి కావలసిన వస్తువులను ఒకరు సప్లయి చేసుకుంటూ ఉండే ఏర్పాట్లను కొనసాగించడం అవసరమని, ఉభయ ప్రభుత్వాలు గుర్తించినవి. దీనిని ప్రాతిపదికగా పెట్టుకొనే వాణిజ్య ఒడంబడికలను కుదుర్చుకోవడం జరిగింది. 1949 జూన్ ఒడంబడిక ఒక సంవత్సరంపాటు, అనగా 1950 జూన్ వరకూ అమలులో ఉండుటకు ఉభయ ప్రభుత్వాలు సమ్మతించాయి. ఈ ఒడంబడిక షరతుల ప్రకారం, 40 లక్షల బేళ్ళ ముడి జనపనారను, 450000 బేళ్ళ ప్రత్తిని భారత దేశానికి సప్లయిచేయుటకు పాకిస్థాన్ ఒడంబడినది. 150000 బేళ్ళ వస్త్రాలను, 80000 టన్నుల ఉక్కును, 20 లక్షల టన్నుల బొగ్గును, పాకిస్థానుకు ఎగుమతి చేయుటకు భారత ప్రభుత్వం అంగీకరించింది. ఉభయ ప్రభుత్వాలు పరస్పరం ఎగుమతి చేసుకోనంగీకరించిన వస్తువులలో అతి ముఖ్యమైన వాటినే నేనిప్పుడు ప్రస్తావించాను. ఈ సందర్భంలో మరొక విషయం చెప్పదలచాను. భారతదేశం, తనకు కావలసిన ఉక్కును విశేషంగా డాలర్ ప్రాంతాలనుండి దిగుమతి చేసుకోవలసి ఉన్నది. అయినప్పటికీ, వర్తకసంప్రదాయం చెడిపోకుండా నిలబెట్టుకొనేందుకుగాను, పాకిస్థానుకు ఉక్కును ఎగుమతి చేయుటకు భారతప్రభుత్వం సమ్మతించింది.

1949 జూన్ వాణిజ్య ఒడంబడికపై సంతకాలు జరిగిన మరుక్షణమే పాకిస్థాన్‌కు, యీ ఒడంబడిక అమలుజరపాలనే ఉద్దేశ్యం యేమాత్రమూ లేనట్లే స్పష్టమైంది. ఉదాహరణకు చూడండి, భారతీయ వస్త్రాల దిగుమతులను ప్రోత్సహించకపోవడం అటుంచి, అసలు భారతదేశంతో వస్త్ర వ్యాపారాలపై నిష్పంధాలు ప్రయోగించుటకుగూడా చర్యలు తీసుకొన్నది. భారతి వస్త్రాలు పాకిస్థానులో దిగుమతికాగానే వాటిని అమ్మకానికి విడుదలగాకుండా స్తంభింపచేసింది. మిగతాదేశాల నుండి దిగుమతిఅయిన వస్త్రాలను స్వేచ్ఛగా అమ్మకానికి విడుదలచేసింది. దీన్ని బట్టిచూస్తే, భారతీయ వస్త్రాల యెడ పాకిస్థాన్ ద్వేషబుద్ధి ఉన్నట్లు స్పష్టమౌతుంది. ఈ విషయంలో భారతప్రభుత్వం ఎన్నిసార్లు వర్తమానం పంపినా లాభంలేకపోయింది.

భారతదేశంనుంచి, అనేక వస్తువులను వస్త్రాలు సహా—దిగుమతి చేసుకొనడం తాత్కాలికంగా నిలిపివేస్తామని సెప్టెంబర్ మాసాంతంలో పాకిస్థాన్ అకస్మికంగా భారతప్రభుత్వానికి కబురుపంపింది. అనంతరం, అన్ని దేశాలనుంచి, ఇండియాతో సహా—లైసెన్సులేకుండా వస్త్రాలు దిగుమతికాకుండా నిషేధ తరువ్ జారీ చేసింది. మనంపంపిన అభ్యంతరములను నిర్లక్ష్యం చేయడమేగాదు, మరొకఅడుగు ముందువేసి, ఏ యే దేశాలనుంచి వస్త్రాలను దిగుమతిచేసుకో దలచలేదో ఆయా దేశాల పేర్లను, నవంబర్ 12 న ప్రకటించింది. ఈ జాబితాలో భారతదేశం పేరు గూడా ఉన్నది. చేనేతబట్టల ఎగుమతి దిగుమతులు ఉభయరాజ్యాల మధ్య యథేచ్ఛగా జరగాలనే ఒడంబడిక షరతును, పాకిస్థాన్ యేనాడు పాటించలేదు. అయినా మనమీనాటికి తూర్పు పాకిస్థాన్ నుంచి, చేనేతబట్టలను దిగుమతి చేసుకొంటునే ఉన్నాము.

బట్టల విషయంలో చిక్కులు కొన్ని వచ్చినప్పటికీ, జనపనారమాత్రం భారతదేశం యథాప్రకారం కొంటూ వచ్చింది. జనపనార కొనుగోళ్ల విషయంలో పాకిస్థాన్ మొదట్లో ఏమీ ఇబ్బంది పెట్టలేదు. భారతదేశంలో జనపనార కావలసినవారు పాకిస్థాన్‌నుంచి ఏజెంట్లద్వారా నారకొని తెప్పించుకోవడం పరిపాటిగా వస్తున్నది.

ఈవిధంగా ఏజెంట్లద్వారా సెప్టెంబరు 15 వ తేదీ వరకి భారతీయ వ్యాపారస్థులు 12 లక్షల బేళ్ల ముడి నార పాకిస్థాన్ వర్తకులవద్ద కొన్నారు. కాని ఆతర్వాత పాకిస్థాన్ జనపనార ధరలు పెరగడంవల్ల పాకిస్థాన్‌లో నార కొనడం మన వ్యాపారస్థులకు దుష్కరం అయింది. ఈలోగా పాకిస్థాన్ ప్రభుత్వం ముందుకొన్న నారలుకూడా ఇండియాకు రవాణా కానివ్వకుండా అటంకపెట్ట జొచ్చింది. పాకిస్థాన్ జనపనార కంట్రోలుబోర్డు స్థాపనతో ఈ చిక్కులు ఇనుమిక్కిలి అయినవి. జనపనార కనిష్ఠ ధరలను నిర్ణయించడమేగాక, రూపాయి విలువ తగ్గింపుకు పూర్వంకొన్న నారను కూడా ఇండియాకు ఎగుమతివ్వకుండా బోర్డు అటకాయించ జొచ్చింది. లోగడ కొన్న 12 లక్షల బేళ్ళలోను 5 లక్షల బేళ్ళను బోర్డు ఈ విధంగా బిగపట్టి ఉంచింది. ఈ జనపనార ఇండియా సొమ్మే అయినప్పటికీ, ఎగుమతి సుంకాలుకూడా చెల్లించి పడవలలోకి పట్టించినవారిని కూడా వారు అటకాయించారు. ఇది చాల న్యాయవిరుద్ధమైన పని అని శిక్షకే చెప్ప నవసరంలేదు. భారతీయ వ్యాపారస్థులు జనపనారబోర్డు వద్దకు అనేక పర్యాయాలు ప్రతినిధులనుపంపి రాయబారాలు జరిపారుగాని ప్రయోజనంలేక పోయింది. రూపాయి విలువ మార్చడానికి పూర్వం కొన్న సరుకని దాఖలాలు చూపిస్తేనేగాని సరుకు విడుదలచేయమనీ, ఒకవేళ అదివరకైనా ఋజువుపరిస్తే మరేదో అభ్యంతరం చెప్పి పాకిస్థాన్ జనుముబోర్డు వర్తకులను, వారి ఏజెంట్లను ఏదో సాకులుచెప్పి తిప్పి పంపివేయడం మొదలుపెట్టింది. కొన్ని కోట్లు ఖరీదుచేసే జనుము ఈ కాలహరణం వల్ల కుళ్ళిపోయి ఎందుకూ కాకుండా చెడిపోతూఉన్నది. భారత ప్రభుత్వం చివరకి కలుగజేసుకొనక తప్పిందికాదు. అటకాయించిన జనుమును వెంటనే విడుదల చేయవలసిందనీ, వివాదాస్పదమైన అంశాలను మధ్యవర్తి పరిష్కారానికి విడిచిపెడదామనీ, భారతప్రభుత్వం పాకిస్థాన్‌కు సూచించింది. కాని పాకిస్థాన్ ఏమని సమాధానం ఇచ్చిందంటే, మధ్యవర్తి తగవుకు ఇంకా సమయం రాలేదని, భారతీయ వర్తకులు సరిగా దాఖలాలు చూపించడందానే జనుము విడుదలచేయమంటున్నారనీ, తాము సూచించిన విధానం ఏమాత్రమూ జటిలమైనదికాదనీ చెప్పింది. ఈ సంజాయిషీ ఎంతమాత్రమూ నమ్మదగ్గదిగా కన్పించడంలేదు. ఎందుచేతనంటే, కోటకొలది రూపాయలుపెట్టి కొన్న సరుకును చేతులారా ఎవరూ పాడుచేసికోరు. ఏదో మిష పెట్టి సరుకును అటకాయించడమే వారి ఉద్దేశ్యంగా కనిపిస్తున్నది.

ఇట్లా ఏరు పాకిస్థాన్‌లో పండి ఇండియాచేత కొనబడిన జనపనారను ఆపడంతో ఆగిపోవడంలేదు. అస్సాంలోపండి, పాకిస్థాన్‌గుండా వస్తున్న జనపనారను గూడా ఆపివేస్తున్నారు. యీ విధంగా కావలసినంత ఇండియా జనపనార పాకిస్థాన్ అటకాయింపబడింది. నారాయణగంజ్ దాకా వచ్చిన పడవలను వాళ్లు ఆపివేశారు.

పాకిస్థాన్‌లో మనం కొన్న జనపనారతోపాటు, అస్సాంలో పండి పాకిస్థాన్ గుండా ఇండియాకు చేరుతున్న జనపనారనుగూడా ఆపడంచూస్తే, భారతదేశంలో జనపనార పరిశ్రమను స్తంభింపజేయాలనే ఉద్దేశంతో వ్యవహరిస్తున్నట్లు స్పష్టంగా వ్యక్తమౌతున్నది.

ఒక్క జనపనారనే కాకుండా ఇతర సామానులను గూడా పాకిస్థానీలు ఇట్లా ఆపిరువాడలు చాలా వున్నాయి. ఇందులో ముఖ్యంగా రైల్వే స్టోరు విషయం చెప్పుకోదగ్గది. అస్సాంను తక్కిన భూభాగంలో కలిపేందుకు వేస్తున్న రైలురోడ్డు యత్నం కొనసాగకుండా ఈ యత్నాలు చేయబడినాయి.

ఇది అంతా ఇట్లావుండగా పాకిస్థాన్‌వారు కొన్ని సందర్భాలలో జనపనారను ఎత్తించుకొన్న స్టీమర్లను పాకిస్థాన్‌లోనే ఖాళీచేయవలసిందని ఆ కంపెనీలకు ఉత్తరువు చేశారు. ఇట్లా స్టీమర్లను అటకాయించడం, నదులమీద రవాణా సాగకుండా చేయడం వీటి అన్నింటివల్ల ఆ స్టీమరు కంపెనీలకుగూడా మంచి నష్టం వాటిల్లుతున్నది.

ఇండియా పాకిస్థాన్‌లు చేసుకొన్న వర్తక ఒడంబడికలో ఇండియా పాకిస్థాన్‌కు బొగ్గు పంపడం, పాకిస్థాన్ ఇండియాకు జనపనారను పంపడం ముఖ్యమైన విషయాలు. ఈ ఒప్పందాన్ని పురస్కరించుకొని ఇంతవరకు ఇండియా పాకిస్థానుకు బొగ్గు సరఫరా చేస్తూనేవుంది కాని పాకిస్థాన్‌మాత్రం జనపనారను సరఫరా చేయడంలేదు సరిగదా, పునః పూర్వకంగా దాన్ని ఇండియాకు రాకుండా అటకాయిస్తున్నది. కొన్ని నెలలక్రిందట మాత్రమే జరిగిన ఒడంబడికను పాకిస్థాన్ గౌరవిస్తున్న పద్ధతి అంతా ఇది.

దీనినంతా పరిశీలించి కొన్ని రోజుల క్రిందట మేము పాకిస్థానుకు ఒక వర్తమానం పంపుతూ, ఈ ఒడంబడికను ఇరువర్గాలవారు సమంగా గౌరవించని పక్షంలో ఈ ఒడంబడికను ఇండియా తిరిగి పరిశీలించవలసి వస్తుందని వివరించివున్నాము. తాము ఆ ఒప్పందాన్ని గౌరవించడం లేదంటే అందుకు కారణం తమ రూపాయిరేటును ఇండియా గుర్తించకపోవడమేనని పాకిస్థాన్‌వారు తమ ప్రత్యుత్తరంలో తెలియజేశారు. ఇది తలబద్దలు కొట్టుకున్నా అర్థం కాకుండా వుంది. పాకిస్థాన్ ఒక విశిష్టమైన మారకం రేటును అనుసరించ దలచుకున్న పక్షంలో ఆ రేటుప్రకారం అమ్మటం, కొనడం ఈ రెండు చూసుకోవలసింది తానే గాని, ఇంకో దేశం ఎంతమాత్రం కాదు. అదీ కాకుండా పాకిస్థాన్ బ్యాంకు ఇండియారూపాయిలను కొననూ కొనదు, అమ్మనూ అమ్మదు.

ఇంకా ఏబ్యాంకులన్నా, లేకపోతే ఏవ్యక్తులన్నా, అట్లా చేస్తామంటే, తాము నిర్ణయించిన మారకంరేటు ప్రకారమే కొనాలి గాని, ఇతరవిధంగా అయితేవద్దని పాకిస్థాన్ శాసించింది అందువల్ల ఈ షరతులమీద వ్యాపారంచేయడం ఎవరికి సరిపడదు.

పాకిస్థాన్ తన రూపాయి మారకంరేటును ప్రకటించిన తరువాత కొద్దికాలంపాటు ఇండియా పాకిస్థాన్‌ల మధ్య వర్తకం సాఫీగా జరిగిన విషయం సభ్యులకు తెలియని విషయంకాదు. ఈ వ్యాపారములో పాకిస్థాన్ రూపాయి ఒక్కొక్క సమయం ఇండియారూపాయికన్న తక్కువధర పలికిన సమయాలు అనేకంవున్నాయి. మొత్తంమీద ఈ వర్తకంలో పాకిస్థాన్ రూపాయి ఆ ప్రభుత్వం నిర్ణయించిన రేటుకు మాత్రం మార్కెట్టులో చెల్లుబడి కాలేదు. దానితో పాకిస్థానుకు వెన్నుపుట్టి తన పాలనలోవున్న బ్యాంకులేవీ ఇండియా రూపాయిని కొనకూడదని, అమ్మకూడదని ఒకశాసనం జారీ చేసింది. అందువల్ల ఇండియా పాకిస్థాన్‌ల మధ్య వర్తకాది సంబంధాలలో ప్రతిష్టంభన ఏర్పడిందంటే, అందుకుగూడా పాకిస్థానమే కారణంగాని ఇండియా ఎన్నటికీకాదు. ఇండియాలో బ్యాంకులు పాకిస్థాన్ రూపాయిని కొననూ కొంటున్నాయి అమ్మనూ అమ్ముతున్నాయి. ఇందుకు ఇక్కడ అవరోధాలేమీ లేవు.

పాకిస్థానుకు ఇండియాకు కస్టమ్సు యూనియన్‌గాని, అందుకు సంబంధించిన ఇతరమైన ఏర్పాట్లుగాని చేసుకోవడం అవసరమని అనేక సార్లు వారికి మేము సూచించివున్నాముకాని నోరు మెదిపినపాపానపోలేదు. అయున్న నేను స్వయంగా, పాకిస్థాన్ ఆర్థికమంత్రితో సంప్రదించగా ఇరుదేశాలమధ్య అనుసరణీయులైన ఎగుమతి దిగుమతి నిబంధనలగూర్చి ఒక సమావేశం జరిపి, సమాలోచించాలన్న ఒప్పందం కుదిరిందిగాని, ఇంతవరకు అటువంటి సమావేశం ఏమీ జరగలేదు. ఆసమావేశం జరగకుండా చూడడానికి పాకిస్థాన్ తేదిను, స్థలము, ఏదో ఒక కారణం చూపుతూ వస్తున్నది.

ఈ లోపల ఇండియామాత్రం వారికి ఒడంబడికను అక్షరాలా పాలిస్తూనే వస్తున్నది. ఈ ఒడంబడికవల్ల ఇండియా పాకిస్థాన్‌కు ఒక్క బొగ్గుమాత్రం ఎగుమతి చేయవలసివుంది. ఇంతకుమినహా వేరే వర్తకమేమీ రెండుదేశాలమధ్య జరగడం లేదు.

మనం ఇట్లా ప్రవర్తిస్తూవుంటే పాకిస్థాన్ చెయ్యాలని మనకు రావలసిన జనపనార రాకుండా చేస్తున్నది. ఇంకోవిశేషమేమిటంటే ఈ జనపనారనంతా మన వర్తకులు ఇంతకుపూర్వమే కొని డబ్బు దస్కం అంతా చెల్లించివున్నారు. ఈవిధంగా పరిస్థితి దీర్ఘకాలం కొనసాగడానికి వీలులేదు. ఆవిషయంలో ప్రభుత్వం ఒక నిశ్చయానికి వచ్చింది. అందువల్ల ఇండియా ప్రభుత్వం పాకిస్థానుకు డిశంబరు 20 వ తేదీనాడు ఒక టెలిగ్రాం పంపిస్తూ, ఈ తగాదాను మధ్యవర్తిత్వానికి పెడదామని సూచించింది. నిన్న ప్రొద్దున వంకూ వారిదగ్గరనుంచి జవాబులేదు. ఆకారణంవల్ల ఇండియానుంచి పాకిస్థానుకు పోతున్న బొగ్గు ఎగుమతులను తాత్కాలికంగానైనా ఆపివేయించవలసిన స్థితి ఏర్పడింది. నిన్నటి నుంచే ఆ ఎగుమతులను ఆపివేయిస్తూ, ఇట్లా చేస్తున్నామని పాకిస్థాన్ ప్రభుత్వానికి తెలియజేశాము.

ఇంతేకాకుండా పాకిస్థాన్ మనకు రావలసిన ముడినారనంతా పంపే ఏర్పాట్లు చేస్తూ మనతో వర్తకానికి దిగినట్లయితే, బొగ్గును వారికి అందజేయడమేకాకుండా, అందులో కరువు ఆ దేశ వారికి ఏర్పడకుండా గూడా చూస్తామని హామీ ఇచ్చాను.

నేను తెలియజేసిన వివరాలన్నింటిని అవగాహన చేసుకున్న మీరు, ప్రభుత్వం తీసుకున్న ఈ చర్యను సమర్థించ గలరని భావిస్తున్నాను.

నియోగి ప్రకటనను పార్లమెంటు హర్షించింది. ఆయన ఈ ప్రకటన చేసి కూర్చోగానే సభ్యులు కరతాళ ధ్వనాలు చేశారు.

కొందరు సభ్యులు ప్రశ్నలు వేయాలన్న కుతూహలాన్ని వెల్లడించారు. కాని అధ్యక్షులు అందుకు ఆమోదించలేదు. మంత్రిగారి ప్రకటన సర్వత్రా విశదంగానే వున్నది. గనుక, ప్రశ్నలు అనవసరమని ఆయన భావించారు.

## దొడ్లపాలెం హరిజన గూడెంపై పోలీసుదాడి

### సైక్లోస్టయిలు యంత్రం తుపాకులు స్వాధీనం

మచిలీపట్నం, డిసెంబరు 23: డెప్యూటీ పోలీసు సూపరింటెంటు ఎం. వి. రామారావుగారు నేడు దొడ్లపాలెం గ్రామానికి చెందిన హరిజనవాడ గూడెంపై దాడిచేసి ఒక స్టెన్ తుపాకి 5 స్టెన్ తుపాకితోటాలు ఒక సైక్లోస్టయిలుయంత్రము, మూడుపెట్టెల కమ్యూనిస్టు సారస్వతము స్వాధీనపరచుకొన్నారు. గూడెమును సోదా చెయ్యటం యింకా జరుగుతున్నది. దొడ్లపాలెం గ్రామం మచిలీపట్నానికి దగ్గరగానున్నది.

(స్వ. వి.)

## చిపాక్‌హౌస్ ప్రభుత్వ అతిథి గృహము

చెన్నపట్నం, డిసెంబర్ 23: మౌంటురోడు ప్రభుత్వభవనం ఎస్టేటులోనున్న చిపాక్ భవనమును మొదటితరగతి అతిథి గృహముగా మార్చుటకు ప్రభుత్వముత్తరువు చేసియున్నది. అందుకు, కావలసిన సర్వము చురుకుగా సాగుచున్నవి జనవరి 1 తేదీనాటికి మదరాసుకువచ్చే డా॥ రాజేంద్రప్రసాద్ గారు యీ భవనములో ప్రథమ ప్రభుత్వఅతిథిగా బసచేయుదురు.

కార్పొరేషనువారు చిప్పలాకీలు కొనుటకు ప్రభుత్వంవారు రూ. 50,000 బుణం మొసంగిరి.

## పశ్చిమగోదావరి కాంగ్రెసు వ్యవహారాలు

1-వ పేజీ తరువాయి

శీర్ల బ్రహ్మయ్య వగైరా జిల్లా కాంగ్రెసు కార్యవర్గ సభ్యుల సేవలనీ, వారిపై క్రమశిక్షణ పర్యవసానము తేలువరకూ, కాంగ్రెసు సంస్థలోని బాధ్యతగల ఏ పదవులకు నియమించరాదని, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘమును అఖిలభారత కాంగ్రెసుసంఘమును ఈ సమావేశమువారు కోరుచున్నారు.

4 పశ్చిమగోదావరిజిల్లాలో, అర్హతా సభ్యులను, కార్యకర్తలను చేర్పించుటలో స్వప్రయోజనముల కొరకు అనర్హులను బాధ్యతగల కాంగ్రెసువాదులు చేర్పించుచుండుట చాలా విచారకరమనీ, ఇకముందైనా అట్టి చర్యలు విరమించి, కాంగ్రెసు గౌరవం కాపాడవలసినదనీ జిల్లాలోని కాంగ్రెసు ప్రముఖులను హెచ్చరించుచున్నాము.

సమావేశానంతరం అతిథులకు శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణ వరప్రసాదరావుగారు తేనీటి విందొసంగిరి. సమావేశకర్త శ్రీ కారుమల్లి పట్టాభిరామయ్యగారి వందన సమర్పణతో సమావేశము ముగిసెను.

(స్వ. వి.)

## ఆగ్నేయ ఆశియాకు కమ్యూనిస్టు ముప్పు

### కామన్వెల్తు సభలో చర్చకువచ్చే సూచన

న్యూఢిల్లీ, డిసెంబరు 23: ఆగ్నేయ ఆశియాఖండంలో ముఖ్యంగా బర్మా, ఇండోచైనా, ఇండోనీషియా మొదలైన రాజ్యాలలో, ఆర్థికంగా ప్రస్తుతమేర్పడిన క్లిష్టపరిస్థితులను అవకాశంగా తీసుకొని, తమ ప్రాబల్యాన్ని విస్తరింప చేసుకొనుటకు ప్రయత్నిస్తున్న కమ్యూనిస్టులను నిరోధించమెలాగ అన్న సమస్య, జనవరి 9 వ తేదీన కొలంబోలో ప్రారంభమవ బోయే కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశమందు చర్చకురాగలదని తెలుస్తున్నది.

ఆగ్నేయ ఆశియాలోని యీ దేశాల ఆర్థిక స్థితిగతులను పరిశీలించి, వాటి ఆర్థికావసరాలను లెక్కకట్టి ఎంతసహాయం చేయవలసి ఉంటుందో తెలుసుకొనుటకు విదేశాంగ మంత్రుల సమావేశంలో ప్రయత్నం జరగవచ్చునని ఢిల్లీలో అనుకొంటున్నారు. రాజకీయ పరిస్థితులనుబట్టి, యీ దేశాలకు కామన్వెల్తు రాజ్యాలు ఎంత వరకు సహాయంచేయగలవు అన్నవిషయం అందరికీ స్పష్టంగా తెలిసివచ్చింది. బ్రిటన్ ఒకవంక తన ఆర్థిక పరిస్థితుల చక్కబరచుకొంటూ, మరొకవంక యీ దేశాలకు కావలసిన యంత్రసామగ్రిని సాంకేతిక సహాయాన్ని అందచేయగలగడం అసాధ్యం. ప్రస్తుతస్థితిని బట్టి చూస్తే, ఆగ్నేయ ఆశియాకు మార్షల్ ప్రణాళిక వంటి ప్రణాళికను తయారుచేసి తద్వారా సహాయపడటంగాని లేదా, బ్రిటన్ యివ్వ వలసిన స్టర్లింగ్ బాకీలనుకొంత తన సెత్తిన వేసుకొని తీర్చడంగాని అమెరికాకు తప్పనిసరి అయేటట్లున్నది.

### ద్రవ్యమారకపు విలువల తగ్గింపు ఫలితాలపై చర్చ

పౌనుతో పాటు ఆయాదేశములు తమ స్వంత ద్రవ్య మారకపు విలువలను తగ్గించుకోవడం మూలంగా యేర్పడిన అనంతర పరిస్థితిని, కామన్వెల్తు వ్యాపార లావాదేవీలపైనా ఆర్థిక వ్యవహారాలపైన, ద్రవ్యమారకపువిలువల తగ్గింపు వల్ల యేర్పడిన ప్రాబల్యము వీటన్నింటిని గురించి విదేశాంగ మంత్రులు చర్చించవచ్చు. లండన్ ఆర్థికమంత్రుల సమావేశ నిర్ణయాలను, వాషింగ్టన్ త్రైపక్ష (బ్రిటన్ కెనడా అమెరికా) సమావేశ నిర్ణయాలను కామన్వెల్తు దేశాలు ఎంత వరకు అమలుజరిపాయన్న విషయాలు గూడా పరిశీలనకు రావచ్చు. ఎజెండాలో చేర్చబడకపోయినప్పటికీ, ద్రవ్యమారకపు విలువ తగ్గింపు ఫలితంగా, ఇండియా పాకీస్థానులమధ్య యేర్పడిన ప్రతిష్టంభన విషయంగూడా చర్చింపబడవచ్చును.

### వివిధ ప్రతినిధి వర్గాలు

కొలంబో కామన్వెల్తు సభకు, ఆయా కామన్వెల్తు దేశాల నుంచి వచ్చే ప్రతినిధి వర్గాల పేర్లను, భారత విదేశాంగ వ్యవహార శాఖ వారు, యీ కింద ప్రకటించారు. కామన్వెల్తు సమావేశం జనవరి 9 వ తేదీన ప్రారంభమై 10రోజులు జరుగ వచ్చును. అంతర్జాతీయ స్థితి గతులకు సంబంధించి, కామన్వెల్తు రాజ్యాలు, యీ సమావేశంలో, తను తమ అభిప్రాయాలను పరస్పరం తెలియపర్చుకో గలవని, యీప్రకటనలో కల్లడించబడింది. కామన్వెల్తు రాజ్యాలకు సంబంధించి సాధారణ ఆర్థిక వ్యవహారాల పరిశీలనగూడా జరుగుతుంది.

భారత ప్రతినిధివర్గం: పండిట్ జవహర్లాల్ నెహ్రూ (ప్రతినిధివర్గ నాయకుడు) సిలోన్‌లో ఇండియన్ హైకమీషనర్ వి. వి. గిరి, సలహాదార్లు: విదేశాంగ శాఖా సహాయ కార్యదర్శి యస్. దత్తు, ఆర్థికశాఖా కార్యదర్శి అంబె గోకర్, డిప్యూటీ కార్యదర్శి కీరోరాయ్, విదేశాంగశాఖ డిప్యూటీ కార్యదర్శి బహుమర్‌సింగ్ వాణిజ్యశాఖా సహాయ కార్యదర్శి గోస్వామి, రిజర్వుబ్యాంక్ డిప్యూటీ కంట్రోలర్ జీభాయ్.

బ్రిటన్: ఎర్నెస్ట్ బెవిన్ (ప్రతినిధి వర్గ నాయకుడు) కామన్వెల్తు సంబంధాలశాఖా కార్యదర్శి ఫిలిప్‌నోయల్ బేకర్ ఆగ్నేయ ఆశియా కమీషనర్ జనరల్ మాల్కం మాక్డొనాల్డ్, కామన్వెల్తు సంబంధాలశాఖా సహాయ కార్యదర్శి సర్ పెర్సీ లెకో‌పీస్సేక్.

కెనడా: లెస్టర్ పియర్సన్ (విదేశాంగ మంత్రి) ఆర్. డబ్ల్యు. మెహూర్.

ఆస్ట్రేలియా: టి. సి. స్పెండర్ (విదేశాంగమంత్రి) ఇండియాలోని ఆస్ట్రేలియన్ హైకమీషనర్ గొల్లాన్.

న్యూజిలాండ్: విదేశాంగమంత్రి, విదేశాంగ కార్యదర్శి.

ద. ఆఫ్రికా: రవాణామంత్రి పాల్ సావర్, ఫౌర్నీ విదేశాంగ కార్యదర్శి.

పాకిస్థాన్: సర్. మహమ్మద్ జఫ్రుల్లాఖాన్ (విదేశాంగమంత్రి) విదేశాంగ శాఖా కార్యదర్శి ఇక్రముల్లాఖాన్, ఆర్థికశాఖా కార్యదర్శి, హామ్సేన్, వాణిజ్యశాఖా కార్యదర్శి హస్నే.

# "అఖండభారత స్థాపన లక్ష్యంతో రాజకీయాలలో మహాసభ పునః ప్రవేశం"

## కలకత్తాలో 28-వ వార్షికసమావేశం: డా॥ ఎస్. బి. ఖరే అధ్యక్షోపన్యాసం

### 'హైద్రాబాదునవాబునుయథాప్రకారంవుంచడం ఏవిధంగానూ సమర్థనీయం కాదు'

కలకత్తా, డిశంబరు 24: "భారత జాతీయ సాంస్కృతిక రాజ్య స్థాపన జరగాలి అనే నినాదంతో, హిందూమహాసభ తిరిగి యీనాడు రాజకీయాలలో ప్రవేశించుతున్నది. లౌకికరాజ్యం, అంటే మత పాక్షికాలకు తావులేని రాజ్యాంగం కావాలని హిందూ మహాసభ పట్టుదల. ఏ మతానికి సంబంధించినా ప్రజలందరకూ, సమానమైన న్యాయధర్మాలు లభించగల ప్రభుత్వం కావాలి. సర్వులకూ సమానావకాశాలుండాలి. అఖండ భారత పునరుద్ధరణ మా సిద్ధాంతం; అందుచేత, పాకిస్థాన్ అస్తిత్వాన్ని హిందూమహాసభ గుర్తించదు," అని, నేడు ఇక్కడ ప్రారంభమైన 28వ హిందూ మహాసభ వార్షిక సమావేశానికి అధ్యక్షతవహించిన డా॥ యన్. బి. ఖరే గారు ప్రసంగించారు.

'మహాసభ, యించుమించు సోషలిస్టు సిద్ధాంతాలను అనుసరించుతున్నది. అయితే ఇది భారతీయ సంస్కృతిని ఆధారం చేసుకుని పెంపొందిన సోషలిజంగా వుంటుంది. ఆర్థికంగా ప్రజలలో వున్న భయంకరమైన యీ మిట్టపల్లాలు సమానస్థాయికి రావాలంటే జాతీయ సంపద ప్రజలందరిమధ్యనూ పరిసమానంగా పంపకం జరగాలి,' అన్నారు.

డాక్టర్ ఖరే లోగడ కాంగ్రెస్ తరఫున మస్థ్త పరగణా ప్రధానిగా పని చేశారు.

'హిందూ మహాసభకు ప్రభుత్వంపట్ల యెట్టి ద్వేషమూ లేదు. కాని ఆశయాలలో వారికీ హిందూమహాసభకూ చాలా తీవ్రమైన విభేదాలున్నయ్. అయినప్పటికీ, బయటినుంచి యేవత్తిడి వచ్చినా, అంతరంగికంగా యే కల్లోలం చెలరేగినా, ప్రభుత్వానికి బలమైన అండగా హిందూ మహాసభ నిలబడుతుంది.'

'రిపబ్లిక్‌గా అవతరించిన మరుక్షణం నుంచీ, (1950 జనవరి 26) మన ప్రభుత్వం కామన్వెల్తుతో ఎట్టి సంబంధాలు పెట్టకున్నా, అవి, లోగడ కాంగ్రెస్ చేసిన నినాదాల కన్నిటినీ విసర్జించటమే గాక, ముందు ముందు భారతజాతి సహాభివృద్ధికీ, అభ్యుదయానికీ అంతరాయమౌతుంది.'

'పాకిస్థాన్ అక్కడున్న భారతజాతిని యావత్తూ తుడిచి పెట్టివేయటానికి ప్రయత్నించుతున్నది వారితో యింకా మనం సంప్రదింపులు సాగిస్తూనే వున్నాం. చేసుకున్న ఒడంబడిక నొక్కదాన్ని వారు అసలు జరపటంలేదని గోల పెడుతూనే వున్నాం. పశ్చిమ పాకిస్థాన్‌లో హిందువులనూ శిక్కులనూ మిగల్చలేదు. అక్కడక్కడ చెదురుగా మిగిలివున్న వారిమీద అనంతమైన హింసాకాండ జరుగుతున్నది. వారంతాకూడా కాందిశీకులై, దళాలుదళాలుగా భారతదేశానికి వచ్చివేస్తున్నారు. తూర్పు పాకిస్థాన్ కూడా ఇదే హింసావిధానాన్ని అవలంబించుతున్నది. హిందువుల ధనమానాలకు అక్కడ రక్షణలేదు. తూర్పు బెంగాలులో యేయేపరిస్థితులు యేర్పడటానికి సావకాశాలుంటాయో, పశ్చిమ బెంగాలులో కూడా ఆయాపరిస్థితులన్నీ యేర్పడటానికిఅవకాశం వుంది ఈ విషయాన్ని గమనించి,తూర్పు పాకిస్థాన్, తన స్వక్షేమం కోసం, పశ్చిమ బెంగాలు, ప్రభుత్వంతో పొత్తుకుదుర్చ తగిన విధానాలను అమలు జరుపుకోవలసి వుంటుంది. అలా దిగిరాని పక్షంలో, ప. బెంగాలు ప్రభుత్వం యీ హిందూ, శిక్కు కాందిశీకుల పునరావాసనిమిత్తం సరిహద్దునవున్న కొన్ని జిల్లాలను ఖాళీ చేయవలసిందిగా తూర్పు పాకిస్థాన్ ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయవలసివుంటుంది.

'కాందిశీకుల ఆస్తివ్యవహారాల విషయంలో భారత ప్రభుత్వం తన దృక్పథాన్ని మార్చుకొని తగిన విధానాలు అమలు జరుపకపోయినట్లయితే, దాని దుష్ఫలితాలను మనం తరతరాలుగా అనుభవించవలసి వస్తుంది.

'హైదరాబాదునవాబును, యథాప్రకారం, ప్రభుత్వాధ్యక్షుణ్ణిగా కూర్చోబెట్టాలనే ప్రయత్నం, యేవిధంగానూ సమర్థనీయంగాదు. సంస్థానాన్ని మూడుభాషా ప్రాంతాలుగాను విడదీసి ఆయారాష్ట్రాలలో కలిపివేయాలి.

'భాషారాష్ట్ర సూత్రాన్ని అంగీకరించినట్లయితే, ఆ సూత్రాన్ని అన్ని ప్రాంతాలకూ ఒకేదఫా అమలుజరపాలి. ఆంధ్ర, తమిళ, కర్నాటక, కేరళ, మహారాష్ట్ర, గుజరాత్ రాష్ట్రాలన్నిటినీ ఒకే దఫా నిర్మాణం చెయ్యాలి. అంతేగాని ఆంధ్రరాష్ట్ర విషయంలో చూపినట్లుగా పక్షపాతం చూపకూడదు. ఈ పక్షపాత విధానాలతోనూ, ఈ ఊగిసలాట విధానాలతోనూ మన జాతీయ సమైక్యత యావత్తూ విచ్ఛిన్నమౌతున్నది.

'హిందూ ధర్మ క్రోడీకరణ చట్టం మొత్తంగా అంగీకారమనటానికిగాని వీల్లేదు. "నిర్లిప్త లౌకికప్రభుత్వం" అని చెప్పుకుంటున్నారుగదా, అలాంటప్పుడు మహమ్మదీయ మత ధర్మాలనూ, క్రైస్తవ మత ధర్మాలనూకూడా సంస్కరించటానికి యెందుకు పూనుకోలేదు. హిందూ ధర్మ క్రోడీకరణ చట్టంలో కొంతమంచీ కొంత చెడూకూడావుంది. దీనిమీద మహమ్మదీయులనూ, క్రైస్తవులనూ వోటుచేయనీయడంమాత్రం పొరపాటు.

'భారతదేశంలో వుండటానికి కాశ్మీర్ ప్రజాపరిషత్తు లోగడనే తీర్మానించింది. "ప్రజాభిప్రాయ స్వీకరణ" జరగటంకూడా మంచిదే. ఏదియేమైనా భారత ప్రజలకు కూడా యీ విషయంలో తమ అభిప్రాయం చెప్పటానికీ వోటు చేయటానికీ సావకాశం వుండాలి.

'ఆర్. యస్. యస్. సంఘమూ, హిందూమహాసభకూ, వ్యవస్థా నిర్మాణ విషయంలో యెట్టి సంబంధము లేదనటంలో యెట్టి సందేహమూ లేదు. కాని రెండు సంస్థల ఆదర్శాలకూ అవినాభావం వుంది. ఈ రెండు సంస్థలూ కూడా భారతజాతీయసంస్కృతిని ప్రధానాదర్శంగా పెట్టుకుని కృషి చేస్తున్నవే.'

'కాంగ్రెస్ సంస్థ ముస్లిములపట్ల చూపిస్తున్న పక్షపాతాన్ని హిందూమహాసభ మొదటినుంచీ ప్రతిఘటిస్తూనే వచ్చింది. కాని పాకిస్థాన్ నిర్మాణాన్ని అరికట్టలేక పోయింది. కాని యిందువల్ల కొంత ప్రయోజనం కలగకపోలేదు, ప్రత్యేక నియోజకవర్గాలూ, ప్రతినిధిస్థానాల కేటాయింపులూ, యీ తతంగమంతా అగిపోయింది.'

'సంస్కృతలిపితో హిందీని జాతీయ భాషగా అంగీకరించాలి.'

'భూమినంతా జాతీయం చేయాలి. కీలకపరిశ్రమల నన్నింటినీ జాతీయం చేయాలి. కార్మికులకు పరిశ్రమలలో యాజమాన్యపు హక్కు లుండాలి. ఇందుకు హిందూమహాసభ ఒక ప్రత్యేక ఆర్థిక ప్రణాళికను తయారుచేసింది.'

'గాంధీ జాతీయనిధిని కాందిశీకుల సహాయార్థం ఖర్చు చెయ్యాలి.'

'హిందూమహాసభకు కోటి రూపాయల నిధికి సొమ్ము చెయ్యాలి. లక్షమంది వాలంటీర్లను చేర్చాలి. వెనుకబడిన తెగలను, పైకి తీసుకురావటానికీ, కుల విభేదాలు తొలగించటానికీ, ఇక్కడ మిగిలివున్న రెడ్డి కోట్ల ముస్లిములనూ, వారిలో దేశభక్తి కలిగేలాగు జాతీయులుగా మార్చటానికీ, ఈవ్యవహారమంతా మోయటానికి, హిందూమహాసభలో ఒక ప్రత్యేక సోషలిస్టు శాఖను యేర్పాటుచేయాలి.

'హిందూ మహాసభలో హిందువులూ, శిక్కులూ సర్వులూ చేరవచ్చు. ఈ సంస్థ ఆశయాలలో నమ్మకమున్న తక్కిన విభాగములు కూడా చేరవచ్చు. పార్లమెంటరీ శాఖనుకూడా యేర్పాటుచేస్తాం' అన్నారు.

'గాంధీజీనిర్యాణానికి నేనెంతో పరితపించుచున్నాను. ఆయన ఒక రాజకీయ హంతకుని దుష్కృతికి గురి అయినారు. గాడ్సే చేసినది చాలా కిరాతకకృత్యం. అందుకు తగిన శిక్షననుభవించాడు.

గాంధీమహాత్ముడు; నిర్దాణమై యున్న జాతినంతా మేల్కొల్పిన మహాపురుషుడు. కాని జాతీయపితగా ఆయన్ను నేను ఆరాధించలేను—జాతిని ఛిన్నభిన్నంగా ముక్కలు చేయటం, విధ్వంసం చెయ్యటం, ఇవి పిత్రుత్వ లక్షణాలుకావు. గాంధీజీ హత్యానంతరం జరిగిన దుర్ఘటనలన్నింటినీ మనం ముక్కోపకల క్రింద మరచిపోవాలి.

'నిర్లిప్త లౌకిక ప్రభుత్వమనేది ఒక పిచ్చి. అలాంటిది ఈ ప్రపంచంలో యింతవరకు యెక్కడా లేదు. అల్లాంటి అభిప్రాయాన్ని ముస్లింబుర్రలోకి మీరు యెప్పుడూ యెక్కించలేరు. దీనివల్ల హిందువులూ, తద్వారా భారత ప్రభుత్వం బలహీనం కావటం మినహా మరో ప్రయోజనం వుండదు. అన్నారు. ప్రభుత్వం, ఎన్నికల తరుణంలో యిచ్చిన వాగ్దానాలకు వ్యతిరేకంగా, దేశంలోని తక్కిన రాజకీయ పక్షాలన్నిటిమీదా మితిమీరిన ద్వేషాన్ని ప్రదర్శించుతున్నారన్నారు.

"ప్రభుత్వం ఇంతవరకు ప్రజలకు అవసరమైన ఒక్క సమస్యనుకూడా సాధించలేక పోయింది. దొంగ మార్కెట్లూ, ధరలూ విపరీతంగా పెరిగిపోయాయి. విదేశీ రాయబారాల క్రిందా, పరిపాలనా యంత్రంక్రిందా మాత్రం అర్థంలేని దుర్వ్యయమంతా చేస్తున్నారు. లంచగొండి తనం వగైరా దుర్నీతులన్నీ ప్రజల్లో విచ్చలవిడిగా వ్యాపించినై.

'ఈ దేశంలోవున్న జనాభాలో నూటికి తొంభైమంది భారతీయులు భారతీయ సంస్కృతిని ఆధారం చేసుకున్న జాతీయ ప్రభుత్వం కావాలన్నారు. హిందూరాష్ట్రమంటే అదే. ప్రభుత్వం హిందూ సామ్రాజ్యం యేర్పడనీయమన్నారు. హిందూ సామ్రాజ్యం కావాలని యెవ్వరూ అనలేదు. హిందూ జాతీయ ప్రభుత్వం కావాలన్నాం. అది యేర్పడ్డది. ప్రపంచంలో వున్న యేశక్తీ దాన్నిక నిర్మూలించలేదు" అన్నారు.

# "సర్వమానవ సౌభ్రాతృత్వం ప్రస్తుత కష్టాలను తరించగలదు"

## క్రిస్మస్‌పండుగ సందర్భంలో పోప్ సందేశం

వాటికాన్ సిటీ, డిసెంబరు 23: నేటి రాత్రి నూతన సంవత్సరం ఆరంభ మయిందని తెలియజేస్తూ రోములోని చర్చిల గంటలు మ్రోగినవి. రోమన్ కాథలిక్ చర్చివారి 25 వ (జూబిలీ) పవిత్ర సంవత్సరం ఆరంభమయింది. దీని ప్రారంభోత్సవాన్ని పోపు పన్నెండవ పయస్ రేపు సెయింట్ పీటర్ చర్చిలో జరుపుతారు.

ఈ సందర్భంలో నేటిరాత్రి పోపు ప్రపంచవాసు లందరికీ, రోమన్ కాథలిక్కులకూ, నాస్తికులకూ, క్రైస్తవేతరులకూ భగవంతుణ్ణి అన్వేషించమని ప్రబోధం ఇస్తూ 45 నిమిషాలు ప్రసంగం ప్రసారం చేశారు. రాగల సంవత్సరం యొక్క ప్రభావం అర్థశతాబ్దం వరకు ఉంటుందని ఆయన సూచించారు.

రోమునగరానికి రైళ్ళమీదా, విమానాలమీదా యాత్రికులు చేరుతున్న ఆఖరు క్షణంలో పోపు తనస్వంత ఆలయానికి వెళ్లి నూతన సంవత్సరవిజయం నిమిత్తం ప్రార్థనలు చేశారు.

### పోపు ప్రసంగం

నేటిరాత్రి పోపువాటి కాన్ రేడియోలో ప్రసంగిస్తూ, ప్రపంచ ప్రజల మధ్య సౌభ్రాతృత్వం పెరగాలనీ, గతపాతిక సంవత్సరాల కాలంలో క్రైస్తవమతం స్వీకరించినవారి సంఖ్య రెట్టింపయిందనీ, దూరస్థమైన ఆఫ్రికాప్రాంతాలకు "మతం" బలంచే కూర్చిందనీ,ఆసియాలోనూ చైనాలోనూ కొన్నిప్రాంతాలు శ్మశానాలుగా పరిణమించినవనీ అన్నారు. "దారి తప్పిన" వారు ఈ జూబిలీ సంవత్సరంలో తిరిగి రావాలని ఆయన హెచ్చరించారు ప్రపంచంలోని నిర్మల హృదయులనందరినీ ఆశీర్వదిస్తూ ఆయన ప్రసంగం పూర్తిచేశారు.

ఈక్రిస్మస్ ప్రసంగం రేపు జరగవలసింది కాని రేపు జూబిలీ సంవత్సర ఉత్సవాలుంటవి. కనుక పోపు నేడే ప్రసంగం ముగించారు.

### కమ్యూనిస్టు ప్రదర్శనలు

రేపు నూతన సంవత్సరారంభోత్సవాల సందర్భంలో కమ్యూనిస్టులు ప్రదర్శనలు జరుపుతారనే భయంతో రోము పోలీసులు ముఖ్యమైన చర్చిలన్నిటిచుట్టూ రక్షణదళాలు అధికంగా ఏర్పాటు చేశారు.

పెద్దపెద్ద జమీలను రైతులకు పంచి ఇవ్వనందుకు ప్రభుత్వానికి నిరసనంగా కొలీషియం చౌకులో ప్రదర్శనాలుసాగించవలసిందని పల్లెటూర్లలోని పేదరైతులకు కమ్యూనిస్టులు నిర్వహించే వ్యవసాయ సంఘాలవారు పిలుపిచ్చారు. పోలీసులీ ప్రదర్శనలను నిషేధించారు. అందుచేత వ్యవసాయ సంఘాలవారు తమ కార్యాలయంలోనే సభ యేర్పాటు చేశారు. సభలో పాల్గొనేవారు కార్యాలయంలో పట్టికలోనులలో నిలబడవలసివస్తుందని పోలీసులు ఈసభనుకూడా నిషేధించారు.

ప్రదర్శనలు రద్దు చెయ్యడం ఇప్పుడు సాధ్యంకాదనీ, ఎక్కడో ఒకచోట సమావేశం జరుగనివ్వకపోతే రైతులు తమంతట తామే కొలీషియం చౌకులో గుమికూడుతారనీ రైతుసంఘాలవారన్నారు.

## హంగరీతో వ్యాపార చర్చలనిలుపుదల

### బ్రిటిషు వర్తకుని అరెస్టుకు ప్రతీకారం

లండను, డిసెంబరు 23: ఎడ్గార్ సాండర్స్ అనే బ్రిటిషు వ్యాపారస్తుడు హంగరీలో అరెస్టు చేయబడినందుకు ప్రతీకారంగా బ్రిటను హంగరీతో వ్యాపార చర్చలు నిలిపివేసింది. ఈ చర్చలు జయప్రదంగా సాగుతున్నట్టు ఇంతకు క్రితం తెలియవచ్చింది. ఇవి విదేశాంగ కార్యాలయం వారి ఉత్తరువు పై నిలిపివేయబడినవి.

ఇంటర్నేషనల్ స్టాండర్డ్ ఎలక్ట్రికల్ కంపెనీలో పనిచేసే ఎడ్గార్ సాండర్స్ రహస్య చర్యలు చేశాడన్న ఆరోపణపై ఒక మాసం నుంచి హంగరీలో నిర్బంధించబడి ఉన్నాడు. అతనిని చూడడానికి హంగరీ అధికార్లు అనుమతినివ్వలేదు. హంగరీలో మళ్లీ పెద్ద ఎత్తున విచారణలు జరగుతవనీ ఈ సారి పశ్చిమ రాజ్యాలకు చెందిన వారు ముద్దాయిలుగా ఉంటారనీ ఊహించబడుతున్నది.

హంగరీ వ్యాపార ప్రతినిధి వర్గం వారు వారారంభంలోనే బ్రిటను వదలి వెళ్లిపోయినారట.

మాసం క్రితం హంగరీలో సాండర్సు వెంట రాబర్టు వోగెలర్ అనే అమెరికా వాడు కూడా నిర్బంధించబడ్డాడు.

నాగరిక దేశాలలో అమలులో ఉన్న ఆచారాలకు హంగరీ వారు సాండర్సును చూడనివ్వక పోవడం విరుద్ధంగా ఉన్నదనీ అందుచేతనే చర్చలు నిలిపి వేయవలసివచ్చినదనీ విదేశాంగ కార్యాలయోద్యోగి ఒకరన్నారు. హంగరీలోకి తన పౌరులు పోరాదని నిషేధించిన అమెరికా పట్ల కూడా ఇటువంటి చర్య తీసుకొంటారా అని అడుగగా ఆయన, ప్రస్తుతం లేదన్నారు.

# కాశ్మీర్ సమస్యపై మెక్‌నాటన్ పరిష్కార సూచనలు ఇండియా పాకిస్థాన్ ప్రతినిధులకు అందినవి

న్యూయార్క్, డిసెంబర్ 23: కాశ్మీర్ సమస్య పరిష్కారానికి ప్రాతిపదికగా ఉండగలందులకు భద్రతామండలి అధ్యక్షుడు జనరల్ మెక్‌నాటన్ కొన్ని సూచనలు తయారుచేసి ఇండియా పాకిస్థాను ప్రతినిధివర్గాలకు అందజేసినట్లు తెలుస్తున్నది. భద్రతామండలివారు 17 తే చేసిన నిర్ణయాన్ని పురస్కరించుకొని జనరల్ మెక్‌నాటన్ ఉభయ ప్రతినిధివర్గాలతోనూ జరిపిన చర్చలఫలితంగా ఈసూచనలు చేయబడినవి.

ఉభయ ప్రతినిధివర్గాలవారున్నూ ఈ సూచనలను తమతమ ప్రభుత్వాలకు అందజేసి, వారు తమ అభిప్రాయాలనూ, ఆదేశాలనూ తెలిపేలోగా ప్రతినిధివర్గాలవారు ఈసూచనల అంతర్యాన్ని పరిశీలిస్తున్నారట.

డిసెంబర్ 27 మంగళవారంనాడు తిరిగి భద్రతామండలి సమావేశమయే లోగా, సాధ్యమైతే విభేదాలను రద్దుచేయాలని జనరల్ మెక్‌నాటన్ యత్నం.

ప్రస్తుతం ఈయన చేసిన సూచనలు అతి రహస్యంగా ఉంచబడుతున్నవి.

## ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షా ఫలితాలు

### ఆంధ్ర కళాపరిషత్ ప్రాంతంలో ఉత్తీర్ణులు

చెన్నపట్నం, డిశంబరు. 24: ఈ సంవత్సరం అక్టోబరులో జరిగిన ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలలో, ఆంధ్రవిశ్వ కళాపరిషత్ ప్రాంతంలో, ఈ దిగువ నెంబర్ల విద్యార్థులు మోడరేషన్ లేకుండా ఉత్తీర్ణులయారు. మోడరేషన్‌తో ఉత్తీర్ణులయిన వారి ఫలితాలు దరిమిలాను ప్రకటితమవుతాయని సెకండరీ ఎడ్యుకేషన్ బోర్డు కార్యదర్శి వ్రాశారు.

1 15 18 21 27 32 36 37 48 72 82 95 96 98, 120 25 26 73 94, 206 17 24 39 42 50 51 54 83 85 90 93 94, 310 19 22 26 30 33 36 37 38 40 44 54 59 69 71 75 79 84 85 95 96, 408 09 15 23 24 31 34 41 48 72 93, 512 16 41 51 56 70 78 89 90, 621 22 25 26 35 37 38 43 44 47 51 53 55 59 62 69 73 75 86 88 94 97, 721. 23 31 57 71 73 86 97, 800 11 13 14 19 21 22 25 26 27 36 38 43 45 49 66 77 83 95. 937 39 88 97 1001 25 94, 1102 16 25 26 56 58 65 68 70 84, 1217 26 32 38 44 59 61 69 71 77 89 92 1304 7 11 31 65 72 74 76 95 95 1401 7 8 10 13 15 18 19 22 27-ఎ 30 37 46 నుండి 49 54 57 51 65 67 85 86 88 94 99 1500 1500-ఎ 3 7 8 10 11 12 15 39 33 44 45 48 51 53 58 59 65 71 1619 25 68 79 93 96 98 1715 33 38 40 45 48 52 60 63 77 82 84 98 1801 5 7 9 12 21 22 27 31 33 38 45 54 61 73 78 79 80 93 94 1902 10 15 నుండి 18 24 27 28 37 39 41 42 52 55 నుండి 59 62 69 70 74 76 78 95 2000 3 14 16 19 28 38 39 41 97 2126 30 31 34 39 53 62 87 2215 31 33 37 2262-ఎ 2272 77 2279-ఎ 2291 2303

14253-ఎ 265 302 305 306 322 351 390 392-ఎ 402 424 429 435 452 462 నుండి 465.

# తిరువూరు తాలూకా గ్రామాలపై కమ్యూనిస్టులదాడి వివరాలు

## పరిస్థితుల విచారణకు కృష్ణాజిల్లా కలెక్టర్ జె. పారేగారి ప్రయాణం

విజయవాడ, డిసెంబర్ 23: గత బుధవారం రాత్రి తిరువూరు తాలూకాలోని 10 గ్రామాలపై కమ్యూనిస్టులు జరిపిన దాడులవివరాలు యిప్పుడు అధికారవర్గాల ద్వారా తెలిసినవి. దాడి చేయబడిన గ్రామాల వివరాలు. కోడూరు గ్రామం. యిక్కడ డి. సుబ్బయ్య అను భూస్వామి హత్య చేయబడెను. రెండు తుపాకులను, 4 వేల రూపాయల విలువగల నగలను దాడిదార్లు ఎత్తుకొనిపోయారు. కంభంపాడు గ్రామం. ఇక్కడ దాడిదార్లు ఒక తుపాకీ ఎత్తుకొనిపోయారు. అట్ల ప్రగడగ్రామం. ఇక్కడ పిరారెడ్డి అనునతడు హత్యచేయబడెను. 400 రూపాయల ఆస్తి దోపిడీ చేయబడెను. గొల్లమండల గ్రామం. అప్పలరాజు అనునతడు హత్యచేయబడెను. ముష్టికుంట గ్రామం. బసవయ్య అనునతడు హత్యచేయబడెను. కొంత ఆస్తి దోపిడీ చేయబడింది. మానవగాపిపాడ గ్రామం. చంద్రయ్య అనే భూస్వామి అతని నౌకరు మల్లయ్య హత్యచేయబడినారు. కొంత ఆస్తి దోపిడీచేయబడింది. చిట్టేల గ్రామంలో గ్రామస్థులు కమ్యూనిస్టుల నెదుర్కొని తరిమివేశారు. మానవరంగ్రామం; ఇక్కడ మాధవరావు అనునతడు హత్యచేయబడెను. ముచ్చివపల్లిగ్రామం. ఇక్కడ కొంతఆస్తి దోపిడీ జరిగింది. శ్రీ రామపురం గ్రామం. ఇక్కడ ఒక తుపాకీని దాడిదార్లు ఎత్తుకొనిపోయారు.

కృష్ణాజిల్లా మాజిస్ట్రేటు జె పారే గారు మచిలీపట్నంనుండి నిన్న దాడికి గురిఅయిన గ్రామాలకు వెళ్ళారు.

దాడిదార్లు బుధవారంరాత్రి 7 గం. 10 గం ల మధ్య ముందుగా ప్లాను వేసుకొని గ్రామాలన్నిటిమీద దాడిచేశారని తెలుస్తున్నది దాడిఅనంతరం దోచుకొన్న ఆస్తితో హైద్రాబాద్ సంస్థానానికి పారిపోయారట. ఈ దాడిదార్లు మంగపతి దళానికి చెందినవారనికూడ తెలుస్తున్నది. ఈదళం ప్రస్తుతం వరంగల్ జిల్లా మధిర ప్రాంతంలో చరిస్తున్నది. దాడిదార్లను గాలించటానికిగాను అదనపు పోలీసు బలాలు ఆ ప్రాంతాలకు పంపబడినవి.

గతరాత్రి శవపరీక్ష నిమిత్తం 7 శవాలు తిరువూరుకు కొనిరాబడినవి. (స్వ వి.)

## చన్నపురి ఆంధ్ర మహాసభ నాటకాలు

చన్నపురి ఆంధ్ర మహాసభవారి 2 వ వార్షిక కళారాధనోత్సవము రేపు వి. పి. హాలులో ప్రారంభమగును. ప్రధాని పి. ఎస్. కుమారస్వామిరాజాగారి సమక్షమున 25 తే. సా. 5-30 గ. తారాశశాంకం నాటకం ప్రదర్శింపబడును. సూరిబాబు, రాజేశ్వరి మున్నగువారు నటింతురు. తరువాత వరుసగ పాదుకపట్టాభిషేకము, అప్పాజీ, భీమవిలాపంలో భామకలాపం, విప్రనారాయణ, కృష్ణతులాభారం. నాటకములు 31 తే. వరకు ప్రదర్శింతురు కమలాదేవి, బాలామణి, కస్తూరి, పూర్ణిమ, వంకర, సుభద్రమ్మ, వసుంధర, సుశీల, అన్నపూర్ణ దేవి మున్నగువారు నటింతురు.

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 24:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతోసహా రు. 76 8-0 పెట్లా బంగారు తులం 115-4-0 సూపబంగారు 118-0-0 సీమవెండి తులం 130 కి (రెడి 172-0-0 వెండి తులం 1-కి 1-12 0





# కార్మికులకు కనీస వేతనాలు

## మార్చి నుంచి చట్టాన్ని అమలుచేయడానికి ప్రభుత్వాలోచన

న్యూఢిల్లీ, డిశంబరు 22: కార్మికులకు కనీస వేతనాన్ని నిశ్చయించేందుకు అనువుగా ఒకచట్టాన్ని భారత ప్రభుత్వం మార్చి నెలనుంచి అమలులో పెట్టడానికి ప్రయత్నం చేస్తున్నట్లు తెలుస్తున్నది.

ఏ పరిశ్రమలో కార్మికులు చెమట ఊడ్చి పనిచేయవలసి వుంటుందో, ఏ పరిశ్రమలలో కార్మికులు అధికంగా కష్టపడవలసి వుంటుందో అచ్చట ఈ చట్టాన్ని కేంద్ర ప్రభుత్వం అనువర్తింప జేస్తుందనిగూడా తెలుస్తున్నది.

ఈచట్టం షెడ్యూలులో పేర్కొనబడి వున్న పరిశ్రమల్లో పనిచేసే కార్మికులకు కనీసవేతనం నిధిగా ఇంత వుండాలని రాష్ట్రప్రభుత్వంగాని, కేంద్రప్రభుత్వంగాని నిశ్చయించవచ్చునని ఈబిల్లు ఆదేశిస్తున్నది.

షెడ్యూలులో పేర్కొన్న పరిశ్రమలలో ఉన్నితివాసీల పరిశ్రమ, చేతపరిశ్రమ, బియ్యం, పిండి, పప్పుమరలు, పొగాకు మిల్లులు, తోటలు, నూనెమిల్లులు రోడ్డుమూలీలు, గృహనిర్మాణం, రాళ్లు కొట్టడం, లక్కపరిశ్రమ, మైకాగనులు, ప్రభుత్వం నడిపే మోటార్లు, తోళ్ళపరిశ్రమ, వ్యవసాయం మొదలైనవి వున్నాయి.

ఈ బిల్లుప్రకారం కనీస వేతనాన్ని నిశ్చయించడంలో ఆయా ప్రభుత్వాలు ఇదివేతనం, ఇదిభత్యం అనిగాని, లేకపోతే అంతా కలిసి వేతనంగానే గాని నిశ్చయించవచ్చును.

కనీసవేతనాలను నిశ్చయించడంలో కేంద్రప్రభుత్వానికి, రాష్ట్రప్రభుత్వాలకు సలహాలిచ్చే నిమిత్తం కేంద్రకనీస వేతన సంఘం ఒకటి ఉంటుంది. దీన్ని గూర్చిన ఏర్పాట్లన్నీ అప్పుడేపూర్తి అయినాయని, జనవరి మధ్యలో ఈసంఘం సమావేశం అవుతుందనిగూడా అనుకుంటున్నారు.

కేంద్రప్రభుత్వం యొక్కగాని, కేంద్ర పాలిత ప్రదేశాలయొక్కగాని అజ్మాయిషీలోకి వచ్చే పరిశ్రమలలో పని చేసే వారి జీవితవ్యయం యెంతదాకా ఉంటున్నదీ నిశ్చయించేసే అధికారం లేబర్ బ్యూరో డైరక్టరుకు ఈచట్టం ఇస్తున్నది. ప్రభుత్వం అప్పుడే ఆ డైరక్టర్‌ను నియమించారు.

రాష్ట్ర ప్రభుత్వాలు గూడా అటువంటి ఉద్యోగుల నియమించాలని కేంద్ర ప్రభుత్వంవారికి ఆదేశాలు పంపింది.

ఇట్లా వివిధ రాష్ట్ర ప్రభుత్వాలు యేర్పాటుచేసిన అధికారులుగూడా త్వరలోనే సమావేశం కానున్నారు. వీరు కార్మికుల జీవితవ్యయాన్ని గూర్చి లెక్కలన్నింటిని తనిఖీచేసి అన్నిచోట్ల అది ఈపని ఒకేవిధంగా ఉంటేటట్లు చూస్తారు.

మొత్తం యీ సమస్యను గూర్చి డిసెంబర్ 26 తేదినాడు ఢిల్లీలో సమావేశమై వివిధరాష్ట్రాల కార్మిక మంత్రులు చర్చిస్తారని గూడా తెలుస్తున్నది.

# దేశ ఆర్థిక స్థితి

## చక్కచేయవలసిన బాధ్యత అందరిపై నాడింది

### సర్ చంద్రవర్కారు విజ్ఞప్తి

బొంబాయి, డిసెంబరు 21: దేశాన్ని ఆర్థిక ఉపద్రవంనుంచి రక్షించవలసిన బాధ్యత అటు పారిశ్రామికుల మీదా ఇటు శ్రామికులమీదాగూడా వున్నదని, అందుకు ఈ ఇరువర్గాలవారు కృషిచేయాలని సర్ వినాయక్ చంద్రావర్కార్ నేడొక విజ్ఞప్తి చేశాడు.

సర్ చంద్రావర్కార్ భారత యజమానుల ఫెడరేషన్‌కు ఈ సంవత్సరం అధ్యక్షులుగా ఎన్నిక అయినారు.

నేడు బొంబాయిలో జరిగిన పై ఫెడరేషన్ వార్షిక సమావేశములో అధ్యక్షోపన్యాసం ఇస్తూ అయన ఇలా అన్నారు.

దేశంలో ఎవరి ఆశయమైనా జాతి సౌభాగ్యాన్ని పెంపొందించడం, సామాన్యులస్థితి బాగుపడేటట్లు చేయడమే. అందుకు ప్రతివ్యక్తి కష్టపడాలి. ఇందులో మనం పొందగల విజయం అంతా శ్రామికులమీద ఆధారపడి వుంది. వారు తమ బాధ్యతను నిర్వహించలేదన్న మాట రాకూడదు.

ప్రస్తుతం దేశంలో వ్యాపారం స్తంభించిపోయింది పెట్టుబడి బిగిసికూర్చున్నది. ఇందుకు కారణం పన్నుల భారమే అని చెప్పవలసి వుంటుంది అయినా వర్తక ప్రముఖులు పరిశ్రమల అభివృద్ధికి తోడ్పడాలి.

ప్రస్తుతం ప్రభుత్వం పరిశ్రమలను, వ్యవసాయాన్ని ఒక ఎత్తులోకి తీసుకురావాలని ప్రయత్నిస్తున్నది. అది ఇప్పుడు పెద్ద సమస్యగా వుంది. ప్రభుత్వం ముందు వ్యవసాయక సమస్యలను పరిష్కరించాలి. ప్రజల కొనుగోలు శక్తికి దీటుగా వుండేటట్లు పంటల అభివృద్ధి ఆ ర్యే మార్గాల వెతుకుతూ, రైతుకు సహాయం చేయాలి.

పారిశ్రామికమైన తగాదాలను అడ్జూడికేషన్‌కు పెట్టాలన్న నిర్ణయం కార్మికుల శక్తిని, ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని గూడా చంపివేసింది. కార్మికుడు పని చేయవలసిన రోజులు తగ్గడంతోపాటు ఆతని నైపుణ్యం గూడా తగ్గిపోయి, ఉత్పత్తి కుంటుపడిపోయింది. దీనికితోడు వారిలో క్రమశిక్షణ గూడా లేకుండా పోయింది. ప్రభుత్వం ఇందుకు తగిన ప్రతీకారాన్ని గూర్చి ఆలోచించవలసి వుంది.



# సయాంలో ఆందోళన స్థితి

## చైనా కమ్యూనిస్టులు దాడిచేసే భయం

బాంగ్‌కాక్, డిసెంబరు 22: సయాం ఉత్తర సరిహద్దు వెలపలఉన్న చైనా సేనలు సరిహద్దులోగల 40 లక్షలమంది చైనీయులతో కలవడానికి ప్రయత్నిస్తారనే భయం సయాంలో తీవ్రంగా ఉండడంవల్ల నేను అటువంటి ప్రయత్నాన్ని అడ్డుకొనే చర్యలు ఆరంభించబడినవి.

సయాముకు బయటనుంచీ లోపలనుంచీ కూడా ప్రమాదం ఎదుర్కొంటున్నది. చైనా కమ్యూనిస్టు సేనలకూ సయామునకూ మధ్య కొన్ని సంస్థానాలు మాత్రమే అడ్డున్నవి. సయాములోని సైనికశాఖలు చైనీయులచేత రాజకీయంగానూ, ఆర్థికంగానూ బలపరచబడి, తిరుగుబాటుచేసే భయం ఉన్నది. ఈ తిరుగుబాటుగాని, ప్రభుత్వంవారి ప్రతి చర్యగాని జరుగుతుందని ప్రజలు ఊహిస్తున్నారు.

ప్రభుత్వ ప్రతిచర్యకు ఉదాహరణగా రాయల్ సయామీ విమాన శాఖానాయకుడున్నూ, సైనిక ప్రాంతీయశాఖయొక్క డైరక్టరు జనరలున్నూ బర్తరఫు చేయబడ్డారు. ఈ వార్త పత్రికలలో ప్రాముఖ్యం ఇచ్చి ప్రచురించబడింది.

పై ఉద్యోగుల బర్తరఫుకు కారణం "వృద్ధాప్యం" అని ప్రభుత్వ ప్రతినిధులు అన్నప్పటికీ, సయాము ప్రధాని మార్షల్ పిబుల్ సంగ్రాం సయాముకు బయటినుంచీ, లోపలినుంచీ రాగల ప్రమాదాలను బలంగా ఎదుర్కొనగలందులకు అనుమానాస్పదులైన సైనికనాయకులను తొలగిస్తున్నారని పత్రికలు వ్యాఖ్యానించినవి.

సాయుధపోలీసుదళాలవారు, కొత్తగా చేరిన సైనికుల సహాయంతో ప్రతిరాత్రీ గస్తీచేస్తూ విమానకేంద్రానికీ, సైనిక స్థావరాలకూ పోయే బాంగ్‌కాక్ రహదారులను రక్షిస్తున్నారు.

తీవ్రమైన కమ్యూనిస్టు వ్యతిరేక విధానం ప్రకటించినట్లయితే అసలేక్లిష్టంగా ఉన్న పరిస్థితి మరింత తీవ్రం కావచ్చునని ప్రభుత్వం జంకుతున్నది. పార్లమెంటుకు కమ్యూనిస్టులను ప్రతిఘటించాలనే ఉన్నదని అధికారులు చెబుతున్నారుగాని, పార్లమెంటు నాయకులూ, రక్షణాధికారులూ చెప్పేదానిని బట్టి, అజ్ఞాత కమ్యూనిస్టుల ఒత్తిడిని దీర్ఘకాలం నిరోధించడం గురించి సయాము నాయకులకు సందేహం ఉన్నట్లు తెలుస్తున్నది.

అదీకాక రెండునెలలుగా సయాము ప్రభుత్వం పశ్చిమరాజ్యాలపట్ల ఉదాసీనవైఖరి కనబరుస్తున్నది సయాము సరిహద్దు రక్షణలకు తగినంత ఆయుధబలంలేదు. ఈ లోటును అమెరికా బ్రిటనులు తీర్చే ఆశ అనేకమంది రాజకీయనాయకులకు లేదు. మరి మూడుమాసాలలో చైనా కమ్యూనిస్టులతో సాధ్యమైనంత సత్సంబంధాలు ఏర్పరచుకోవడం జరగడానికి అవకాశం ఉందనికూడా చాలామంది భావిస్తున్నారు.

ఒక నెలరోజులనుంచీ సయాంప్రభుత్వం యుద్ధపూర్వ విధానాన్ని అనుసరించి, జాతీయవాదాన్ని, బౌద్ధమతాన్ని, రాజభక్తినీ, జాత్యభిమానాన్ని ప్రోత్సహిస్తూ, దాడి జరిగేపక్షంలో నిరోధించడానికి ఇవి ప్రజలకు అండగా ఉండగలవని భావిస్తున్నారు. యుద్ధానంతరం నిషేధించబడిన యువజనోద్యమాలు (మార్షల్ పిబుల్ సంగ్రాం ఆరంభించినవి) ఇటీవల పునరుజ్జీవించబడినవి.

ఇవి బౌద్ధదేవాలయ తిరునాళ్ళసమయం కావడంవల్ల పైకి ప్రజలు ఉత్సాహంగా ఉన్నట్లు కనిపిస్తున్నారుగాని వారి హృదయాలలో ఆరాటం జాస్తిగా ఉన్నది. జపానువారు యుద్ధకాలంలో సయామును ఆక్రమించక పూర్వం ఉన్నట్లుగానే ఇప్పుడూ ఉన్నదనుకొంటున్నారు.

కమ్యూనిస్టుల తిరుగుబాటు జరుగుతుందన్న వదంతులు ప్రజలను బలంగా ఆకర్షిస్తున్నవి. సయాములోని పత్రికలుకూడా అశాంతినిసూచించి, ముఖ్యంగా సైనికశాఖలోని అశాంతినిసురించి, పుకార్లు విరివిగా మూడువారాలనుంచి ప్రచురిస్తున్నవి.

కమ్యూనిజముపైసయామువారికి గల ద్వేషానికి చైనా కమ్యూనిస్టు సేనలబలము చైనాకు సయాముపై అనాదిగాగల ఆశా భావము దీనికితోడుగా పనిచేస్తున్నవి.

## మాగ్గొనాల్డు: భద్రత: సయాం ప్రధానితో

ప్రస్తుతం సయాం (తాయిలాండు)కు వచ్చి ఉన్న ఆగ్నేయాసియా బ్రిటిషు కమిషనరు జనరలు మాల్కొం మాగ్డొనాల్డు భద్రతను గూర్చి మార్షల్ పిబుల్ సంగ్రాంగట్టికట్టుదిట్టాలు చేశారు.

గతవారాంతంలో ఇక్కడి సైనికశాఖలలో చెలరేగిన అశాంతివల్ల ఏర్పడిన వాతావరణం బ్రిటిషుఅధికారులకు విచారకారణమయింది. మాగ్డొనాల్డు వచ్చినప్పటినుంచి బాంగ్‌కాక్‌లోని బ్రిటిషు రాయబారకేంద్రంవద్ద రక్షకుల సంఖ్య మూడింతలు చేయబడింది. ఆయనవెంట అసంఖ్యాకులైన సాయుధ పోలీసులు జీపులలో వెంబడిస్తున్నారు.

డిసెంబరు 20 నుంచి రోజూ అనేక గంటలసేపు మాగ్డొనాల్డు, బాంగ్‌కాక్‌లోని బ్రిటిషు రాయబారి సయాంమంత్రివర్గంవారితో సంప్రతింపుజరుపుతున్నారు.

నేడు మాగ్డొనాల్డు పత్రికా ప్రతినిధులతో ప్రసంగిస్తూ, ఈ సంభాషణలు స్నేహపూర్వకంగా ఉన్నవనీ, బ్రిటను తాయిలాండుల ఉన్నతాధికారులు నేరుగా సంప్రతించడం చాలాఉపకరించిందనీ, మలయా తాయిలాండు సరిహద్దుపై ఉభయపోలీసుశాఖలు సహకరించి పని చేయడంవల్ల ఉభయ దేశాలలో నూ కమ్యూనిస్టు దుష్కృత్యాలు అణచబడినవని తాను తాయిప్రభుత్వానికి చెప్పాననీ, బావోదాయి ప్రభుత్వాన్ని ఇండో చైనా జాతీయవాదులు క్రమంగా బలపరుస్తున్నారని మార్షల్ పిబుల్‌కు చెప్పాననీ, ఆగ్నేయాసియాపై కమ్యూనిస్టులు దాడి చెయ్యకుండా చెయ్యడం ఇప్పటికీ సాధ్యమే గాని ప్రజాస్వామిక దేశాలన్నీ వెంటనే సహకరించి పనిచేయాలనీ అన్నారు.

## సయాం బియ్యం కొనుగోలుకై బ్రిటిష్ తాపత్రయం

### కమీషనర్ జనరల్ ప్రకటన

బాంకాక్, డిసెంబరు 22: 1950 లో విశేషంగా సయాం బియ్యం కొనుక్కొనేందుకై సయాం ప్రభుత్వంతో తక్షణమే సంప్రదింపులు ప్రారంభించాలని బ్రిటన్ తాపత్రయ పడుతున్నదని ఆగ్నేయ ఆశియా బ్రిటిష్ కమీషనర్ జనరల్ మాల్కొంమాగ్డొనాల్డు వెల్లడించాడు.

మాల్కొం మాగ్డొనాల్డ్ మూడురోజులనుండీ, ప్రధాని ఫీబుల్ సంగ్రాంతోనూ తదితర మంత్రులతోనూ, ఆగ్నేయఆశియా ఉమ్మడి సమస్యలను గురించి చర్చించాడు. ఈ సందర్భంలో సయాం బియ్యం కొనుగోలు విషయంగూడా మాగ్డొనాల్డుముఖ్యంగా చర్చించినట్లు తెలుస్తున్నది.

## భారతదేశంలో చక్కెర పరిస్థితి

### పార్లమెంటులోని కాంగ్రెస్ పార్టీ చర్చ

న్యూఢిల్లీ, డిసెంబరు 22: ఈ వేళ అసెంబ్లీలోని కాంగ్రెసుపక్షంసమావేశమై దేశంలోని పంచదార పరిస్థితిని గురించి చర్చించింది.

ఈ సమావేశంలో రేపు 24 వ తేదీని పార్లమెంటులో జరగబోయే పంచదార చర్చనుగురించి ఆలోచించారని తెలుస్తున్నది. ఈవేళ జరిపిన చర్చ ఇంకా పూర్తికాలేదనీ, ఇది రేపటికికూడా వాయిదా పడగలదనీ తెలుస్తున్నది.

కాంగ్రెసుపక్షంలో కొందరు కంట్రోలు పోవాలని అన్నారట. మరికొందరు పంచదారఉత్పత్తి అభివృద్ధి చెయ్యడంవల్లనే పంచదార కాటకం తగ్గగలదని అన్నారట.

అనుకున్నంత స్థాయిలో పంచదార ఖరీదు తగ్గకపోతే పైదేశాలనించి పంచదార దిగుమతి చెయ్యాలనీ, దానివల్ల ఖరీదులు యథాస్థితికి రాగలవనీ కొందరు అన్నారట. చాలా ప్రదేశాలలో మణుగు పంచదారఖరీదు 11రూపాయలైతే బెంగాలు ప్రదేశంలో పంచదార ఖరీదు 16 రూపాయలదాకా ఉన్నదట. అయితే ఇండియాలోకంట్రోలుధరే 28-0-0రూపాయలదాకా ఉన్నదట, నల్లబజారులో దీని ఖరీదు 40 రూపాయలు మొదలుకొని 100 రూపాయలదాకా ఉన్నదట.

# భారత జాతీయ గీతం సమస్య

## రాజ్యాంగపరిషత్తులో తీర్మాన ప్రతిపాదన జరుగగలదని ప్రధాని నెహ్రూ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 23: భారత జాతీయ గీతము విషయమై రాజ్యాంగ పరిషత్తులో ఒక తీర్మానమును ప్రతిపాదింతెదరని ప్రధాని పండిత నెహ్రూగారు నేడు భారత శాసన సభలో సూచించిరి. ఒక ప్రశ్నకు సమాధాన మొసంగుచు పండిత నెహ్రూ గారిట్లు చెప్పిరి. భారత దేశములోను, ఇతర దేశములలోను మిలిటరీ బాండ్లు ఆర్కెస్ట్రాలు విశేషముగా 'జనగణమన' గీతమును వాడుచున్నవి. ఈ రాజ్యాంగ పరిషత్తు నిర్ణయము గావించు వరకు ఈ గీతమునే వాడవలెనని ఇండియా ప్రభుత్వము వారు నిర్ణయించి యుండిరి. రాజ్యాంగ పరిషదధ్యక్షుని కోర్కెపై జాతీయ గీతము విషయమై ఆలోచించుటకు గత నవంబరులో పార్లమెంట్ సంఘ సభ యొకటి జరిగెను. ఈ విషయములో శ్రద్ధ గల యితరులు గూడ ఆ సభలో నుండిరి. ఈ విషయము రాజ్యాంగ విధానములో చేర్చ దగినది కాదని, రాజ్యాంగ పరిషత్తు వారు ఒక తీర్మానము ద్వారా ఈ విషయమును నిర్ణయించ వలెనని సభ వారు అభిప్రాయపడిరి. కనుక రాజ్యాంగపరిషత్తు అధ్యక్షు ఎన్నికకై సమావేశము సమయమున యిందు విషయమై ఒక తీర్మానమును ప్రతిపాదింప సంకల్పించు చున్నాము. ఇది యిట్లుండ 'జనగణమన' గీతమునకు స్వరము, లయ విషయమై ప్రసిద్ధవాగ్గేయకారులను సంప్రదించియుంటిమి. 'జనగణమన' గీతమునువివిధములుగా వాడునప్పుడు వినవలెనని అ. భా. రేడియో వారు రాజ్యాంగ పరిషత్ సభ్యులను చాలామందిని ఆహ్వానించి యుండెను. చాలామంది వెళ్లి వినిరిగూడను.

వందేమాతరం గీతమును స్వరయుక్తముగాను ఆర్కెస్ట్రా పైనను పాడించుటకు భారత ప్రభుత్వమువారు యేమైనాచర్యలు గైకొని యుండిరాయని పండిత లక్ష్మీకాంతమైత్రాగారు అడుగగా అట్టి ప్రయత్నములుకొంతవరకుజరిగెనని పండితనెహ్రూగారు చెప్పిరి. వందేమాతరం గీతమును పాడుట తమకు చాలాకష్టముగా నుండెనని, అది తమకు తగినది కాదని చాలా బ్యాండ్లవారు చెప్పిరని పండితు డనెను.

## జనవరి 26 న ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సమస్య

### మద్రాసు నాయకత్వంమీదే ఆధారపడి ఉందని రంగాగారి ప్రకటన

విజయవాడ, డిసెంబరు 23: గ్రాండు ట్రంకు ఎక్సుప్రెస్‌లో నేడు ఢిల్లీనుండి యిక్కడకు వచ్చిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు ఎన్. జి. రంగాగారు, ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి కేంద్రప్రభుత్వమేమీ ఆటంకం కలిగించటంలేదని ఒక ఇంటర్వ్యూలో అన్నారు. నూతన రాష్ట్రానికి వచ్చేలోటును గురించి మాత్రం అది పరిశీలన జరుపుచున్నదని అన్నారు. ఆంధ్రరాష్ట్రానికి వచ్చేలోటు కొన్ని లక్షలు మాత్రమేనని తెలియటంచేత, ఇక రాష్ట్ర నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వానికి సంబంధించినంతవరకు ఆటంకమేమీ ఉండబోదని విశ్వసిస్తున్నానని రంగాగారన్నారు.

భారత రిపబ్లిక్ అవతరణతోపాటు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరిగేట్లు చూసే బాధ్యత కేవలం మద్రాసు నాయకత్వం మీదే ఆధారపడి ఉన్నదన్నారు. రాజధానీ నగరం విషయంపై నిర్ణయం చెయ్యటానికి ఆంధ్రశాసన సభ్యులను, రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులను ఒకచోట సమావేశపరచాలని చేయబడిన సూచనను గురించి ప్రస్తావించి, యీ విషయంపై వివిధజన సంఘ సభ్యులతోను, ఇతర నాయకులను సంప్రదించనిదే ముందుగా తానేమీ చెప్పలేనని రంగాగారన్నారు.

## ఉద్యోగ వార్తలు

చెన్నపట్నం, డిసెంబరు 23: శ్రీ యస్. హనుమంతరావుగారు బళ్లారిలోని రాయలసీమ పాలిటెక్నిక్ ప్రిన్సిపాలుగా నియమింపబడిరి.

శ్రీ డి. కొండాడిగారు అనంతపూరు ఇంజనీరింగ్ కాలేజిలో తాత్కాలిక సర్వే ఇన్‌స్ట్రక్టరుగా నియమింపబడిరి.

మదరాసు వాకఫ్ బిల్లు (ముస్లిం ధర్మాదాయము) సెలక్టు కమిటీని సమావేశమునకు సాక్ష్యము తెలుపదలచిన వారంతా జనవరి 4 వ తేదీలోగా, శాసన సభా కార్యదర్శికి పంపాలని ప్రకటించిరి.

# మదరాసు కౌన్సిల్ సమావేశం

చెన్నపట్నం, డిసెంబరు 23: మదరాసు కౌన్సిలుసభ యీవాళ శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి అధ్యక్షతను సమావేశమైనపుడు ప్రశ్నోత్తరముల అనంతరం అధ్యక్షులు శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారు తాను బీహారుకు వెళ్లినపుడు అచ్చటి కౌన్సిలు అసెంబ్లీ సభలు తమకు స్వాగత మొసగుచూ శాసన సభలో తీర్మానము గావించి గౌరవించిన సంగతిని సభవారికి తెలియజేస్తూ బీహారు శాసనసభల వారు తనకు చూపిన గౌరవము సభవారికే యగుకు గావున మదరాసు కౌన్సిల్ సభవారు బీహారు శాసనసభలకు కృతజ్ఞత తెలిపే తీర్మానము గావించి పంపడం మంచిదని సూచించిరి.

సభానాయకుడు డా॥ రాజన్ గారు కౌన్సిలు అధ్యక్షులకు బీహారు శాసనసభలు గౌరవ పురస్సరముగా ఆహ్వానించి సుహృద్భావము సూచించినందుకు సభవారు వారికి కృతజ్ఞులై యున్నారనే అభిప్రాయమును వెలిబుచ్చుచూ తీర్మానమును ప్రతిపాదించిరి. తీర్మానమును అధ్యక్షులవారు బీహారు శాసనసభలకు అందజేయవలెనని కోరిరి ప్రతిపక్షము తరఫున అబ్దుల్ లతీఫ్ ఫరూకీగారు తీర్మానంయెడల తన పక్షము యొక్క సంపూర్ణ ఆదరమును తెలుపుచూ కౌన్సిలు అధ్యక్షులకు జరిగిన గౌరవము కౌన్సిలునకు జరిగినట్లుగా భావించవలెననిరి. అంతట సభవారు తీర్మానమును ఏకగ్రీవముగా ఆమోదించిరి.

## విలీనమైన సంస్థానములకు శాసనములవర్తింపుబిల్లు ఆమోదం

ఆపైని న్యాయశాఖామంత్రి శ్రీ మాధవ మీనన్‌గారు ఇండియన్ యూనియన్‌లో కొత్తగా విలీనమైన పుదుకోట్ట, బంగనపల్లి సాండూరు సంస్థానములకు రాష్ట్రీయ ప్రభుత్వ శాసనములను వర్తింపచేయు బిల్లును సభవారి ఆలోచనకు ప్రతిపాదించుచూ కేంద్ర శాసనములను భారత ప్రభుత్వము యిదివరకే యీ సంస్థానములకు వర్తింపచేస్తూ శాసనము చేసినవనియు రాష్ట్ర శాసనములుకూడా ఆ సంస్థానములకు వర్తింపచేయుటయే యీ బిల్లు ఉద్దేశ్యమనియు పలికిరి. బిల్లునుగూర్చి ఎట్టి చర్చలేకుండనే 10 నిమిషములలో బిల్లు యావత్తు శాసనముగా ఆమోదింపబడెను.

ఆటుతరువాత అధ్యక్షులవారు సభను జనవరి 19 వ తేదీ ఉ. 11 గంటలకు వాయిదా వేసిరి.

# హైదరాబాదు మజ్దూర్ సంఘంవారి సమ్మెకు జయప్రకాశ్ ఆశీర్వాదం

## సోషలిస్టునాయకునికి హైదరాబాదులో సన్మానం

హైదరాబాదు, డిసెంబరు 22: హైదరాబాదు మజ్దూర్ సంఘమునకు చెందిన 80 ట్రేడ్‌యూనియన్ల కార్మిక సభ్యులు వచ్చే జనవరి 11వ తేదీన ప్రారంభింపబోతున్న సమ్మెను సోషలిస్టు నాయకుడు జయప్రకాశ్ నారాయణ "జయప్రదమగుగాక" అని నేడు ఆశీర్వదించారు.

సమ్మె చేయవలెనన్న నిర్ణయం ఇతర పరిష్కార మార్గాలన్నీ విఫలమైన తర్వాత ఇతరమార్గాంతరం లేకనే చేయబడిందనీ, ఈ నిర్ణయం అనాలోచితంగా చేయబడింది కాదని, తనకు తెలిసిన సమాచారాన్ని బట్టి తాను విశ్వసిస్తున్నానని జయప్రకాశ్ చెప్పారు.

సెంట్రల్ సెక్రటేరియట్ భవనముల వద్ద జరిగిన బ్రహ్మాండమైన కార్మికసమావేశంలో ప్రసంగిస్తూ, కార్మికుల తరఫున పోరాడుతున్న సోషలిస్టుపార్టీ ఈ సమ్మెను పూర్తిగా బలపరుస్తుందని జయప్రకాశ్ అన్నారు.

ఈ సమ్మె విషయంలో ఏ పార్టీ ప్రసక్తి లేదు. కేవలం ప్రమాదావస్థలో ఉన్న కార్మికుల హక్కులను రక్షించటానికే ఈ సమ్మె ఉద్దేశింపబడింది. సమ్మెవల్ల కొంతకాలంపాటు ప్రజలకు, ముఖ్యంగా విద్యుచ్ఛక్తి కార్మికుల సమ్మెవల్ల ఇబ్బంది కలగవచ్చు. అయితే ఇది కార్మికుల చావుబ్రతుకులలో చెలగాటాలాడుతున్న సమస్యఅనీ, వారు తమకు న్యాయమైనజీతాలు రావాలనే ఈ సమ్మె సంకల్పించారనీ ప్రజలు సహృదయతతో అర్థం చేసుకోవలసి వుంటుంది. ఈ కార్మికుల పోరాటాన్ని ప్రజలు సమర్థిస్తారనే నేను ఆశిస్తున్నాను. కార్మికులు తాత్కాలిక కరువు భత్యములకోసం, తమను అధికారులు తొలగించరాదనే కోరికకోసం ఒత్తిడి చేస్తున్నారు. మరి వేరే దురుద్దేశ్యమేముంటుంది వారికి?"

తరువాత ఇండియాలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని గూర్చి వివరంగా చెబుతూ, ఇండియాలో కల్లా కార్మికుల శ్రేయస్సుకోసం నిష్పక్షపాతంగా పోరాడేది ఒక్క హింద్ మజ్దూర్ సంఘమేననీ, ఈ సంఘముపై ఏ పార్టీ ప్రాబల్యమూ లేదని జయప్రకాశ్ చెప్పారు. "అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, కమ్యూనిస్టుపార్టీ చేతి కీలుబొమ్మ. ఆ పార్టీ లక్ష్యమల్లా ఒకటే; హింసామార్గాన దేశాన్ని పరశురామప్రీతి చేయటం. ఇక భారతజాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు ఉన్నది. ఇది అధికారంలో ఉన్న కాంగ్రెసు పార్టీ చేతి కీలుబొమ్మ. కార్మికులు ఏ రాజకీయ పక్షానికి తల ఒగ్గరాదని నా ఉద్దేశ్య" అని జయప్రకాశ్ చెప్పారు.

## హైదరాబాదులో పౌరసన్మానం

వరంగల్, కరీంనగర్, బీదర్, ఔరంగాబాదు, గుల్బర్గా జిల్లాలలో 8 రోజులపాటు సంచారంచేసి తిరిగివచ్చిన జయప్రకాశ్‌కు నేడు హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషనువారు పౌరసన్మానం చేశారు. సన్మానపత్రం చదువుతూ వి. కె. భాగే జయప్రకాశ్ నారాయణచేసిన దేశసేవను ప్రస్తుతించాడు. హైదరాబాదు సమస్యలలో ఆయనకు గల గాఢాసక్తిని కూడా అభినందించారు.

సన్మాన పత్రమునకు సమాధానమిస్తూ, ప్రజాస్వామిక వ్యవస్థలో స్థానిక స్వపరిపాలనా సంస్థల ప్రాధాన్యతను జయప్రకాశ్ ఉద్ఘాటించారు. నగరపాలకులు మీద ప్రజల అభివృద్ధికోసం సర్వదా ప్రయత్నించాలనీ, వారికి సాధ్యమైనన్ని సౌకర్యాలు సమకూర్చాలని, జయప్రకాశ్ చెప్పారు.

సోషలిస్టుపార్టీ ఆదర్శాలనుగూర్చి వివరిస్తూ, తమ ముఖ్యోద్దేశ్యం పరిశ్రమలను జాతీయం చేయటమే అయినప్పటికీ, ప్రస్తుతానికి వాటి నిర్వహణాధికారాన్ని వికేంద్రీకరించాలనే తాము వాదిస్తున్నామనీ, ఆర్థికాధికారమంతా ఒకేచోట కేంద్రీకృతమైతే నియంతృత్వమేర్పడే ప్రమాదమున్నదనీ, కొన్ని పరిశ్రమలను రాష్ట్రాలలోని స్థానికసంస్థల, సహకారసంఘాల యాజమాన్యమునకు అప్పగించాలనీ జయప్రకాశ్ అన్నారు. ప్రజాస్వామిక సామ్యవాది అయినవాడు ప్రజాస్వామ్యాన్ని, సోషలిజమును రెంటినీ కొనసాగించాలని అభిలషిస్తాడు. అందుచేత ఈ అభిలాష నెరవేరటానికి మునిసిపల్ పరిశ్రమలకంటే ఉత్తమ సాధనాలు లేవు.

సంస్థానాలలో ప్రజాప్రతినిధి మంత్రివర్గాలేర్పడాలని సోషలిస్టుపార్టీ మొదటినుండీ వాదిస్తున్నది. ప్రస్తుతం పనిచేసే మంత్రివర్గాలు భారతప్రభుత్వ సంస్థానశాఖవారి యిష్టాయిష్టాలవల్ల ఏర్పడినవేగాని ప్రజాభీష్టానుసారం ఏర్పడినవి కావు. ఈ బాధ్యతను ప్రజలకే వదలిపెడితే వారు మొదట్లో ఏవైనా పొరబాట్లుచేసినా, ఆపొరబాట్లను దిద్దుకుని అభివృద్ధి కాగలుగుతారు. హైదరాబాదులో త్వరలో ప్రజాప్రభుత్వమేర్పడుతుందని ఆశిస్తున్నాను. నిజాము నామమాత్రాధిపతిగా వున్నప్పటికీ వెనకటి దోపిడీదారులు విజృంభించటానికి, భూస్వామిక విధానం కొనసాగటానికి సంపూర్ణావకాశం వుంటుంది. మన సరిహద్దుల కావల జరుగుతున్న మహత్తర సంఘటనలను చూస్తే సాంఘిక విప్లవానికి గల శక్తిఅర్థమౌతుంది. చారిత్రక పరిణామాలకు అనుకూలంగావుండే విధానాన్ని ప్రతీపశక్తులు అనుసరించవలసిన సమయమాసన్నమైనది. అలాపరిస్థితుల కనుగుణంగా మారకపోతే ఫలితాలు వారికే తెలిసివస్తాయి (స్వ.వి.)

## పాత కొత్త ఢిల్లీల నూతన పరిపాలన

### పార్లమెంటులో ఢిల్లీ ప్రతినిధి విమర్శ

న్యూఢిల్లీ, డిసెంబర్ 22: కొత్త ఢిల్లీ పాతఢిల్లీల పరిపాలనను విడివిడిగా ఉంచాలన్న ప్రభుత్వనిర్ణయానికి పార్లమెంటులో ఢిల్లీ ప్రతినిధి లాలా దేశ్ బంధు గుప్తాగారు నేడు అసంతృప్తిని వెల్లడించారు. ఆవిషయమై పండిత నెహ్రూ పార్లమెంటులో ప్రకటనచేస్తూ వెల్లడించిన వైఖరిని ఆయన విమర్శించాడు.

"కొత్త రాజ్యాంగం అమలుజరిగే లోపునా ఢిల్లీకి ఒకవిధమైన బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడగలదని ప్రధాని నెహ్రూ లోగడ జరిగిన ఢిల్లీ రాష్ట్ర రాజకీయ సభలో హామీ ఇచ్చాడు. అక్టోబర్, నవంబరులలో ఢిల్లీకి కేంద్రశాసనసభలో ప్రత్యేక సభ్యత్వమిస్తూ పార్లమెంటులో ఒక బిల్లును ప్రతిపాదిస్తామని కూడా ఆయన హామీ ఇచ్చాడు. కాని చివరకు ఈ విధంగా జరిగింది.

రాజ్యాంగ పరిషత్తు యేర్పరచిన ప్రత్యేక సంఘం ఢిల్లీ విషయమై పరిశీలించి దానిని లెఫ్టినెంట్ గవర్నర్ పాలన కింద ఒక రాష్ట్రంగా చేసి, దానికి శాసనసభనూ, మంత్రివర్గాన్నీ నెలకొల్పవలసినదిగా సూచించి ఉన్నది. ప్రస్తుత నిర్ణయాన్ని గురించి పండిత నెహ్రూ, ఢిల్లీ ప్రజలు తమకు తామే ఆలోచించుకోవచ్చును అని ఆయన అన్నాడు.

## అమెరికను నూనె ఇండియా కొనదు

న్యూయార్కు, డిసెంబరు 22: పై సంవత్సరారంభంనుంచి అమెరికను నూనె వర్తకులు ఇండియాలో "డాలరు" నూనె సరుకు అమ్మరాదని ఇండియా ప్రభుత్వం తెలిపినట్లు నేషనల్ అమెరికను వాణిజ్య పత్రిక వ్రాసింది. ఈ విషయం తెలియబరుస్తూ ఇండియా ప్రభుత్వంవారు అమెరికను నూనె కంపెనీలకు డిసెంబరు 19న పంపిన లేఖలో ఇండియా సరిహద్దులలో వాడకమునకే నూనెకుమాత్రమే వర్తిస్తుందనీ "స్టెర్లింగు" నూనె లభిస్తున్నది కనుక ఇండియా దానిని వాడకంచేసి డాలర్లు ఆదా చేసుకోంటుందనీ తెలుపబడింది.

ఇండియా సరిహద్దులలో వాడకం నిమిత్తం అమెరికను నూనెకంపెనీలు రోజుకు 3600 పీపాలనూనె అమ్ముతున్నవనీ, జనవరి 1 నుంచి ఈ అమ్మకం నిలచిపోతుందనీ పై వాణిజ్యపత్రిక అన్నది.

## ఇండియనుపైను అర్థ్రు సంఘం

పై సంఘంయొక్క గాయకసభ, పాట కచ్చేరీలు 24వ తేదీ శనివారం ఉ. 8.45 గ. గోఖలేహాలులో కె. వాసుదేవశాస్త్రిగారి అధ్యక్షతను జరుగును. సర్. సి. పి. రామస్వామయ్యరుగారు ప్రారంభోత్సవం జరిపెదరు.

## ఎన్. జి. ఓలు

మదరాసు కేంద్రం నానగజెటెడ్ ఆఫీసరులసంఘం జిల్లాసభ 24 తేది ఎం. ఎ. రామకృష్ణంరాజుగారి అధ్యక్షతను 3 గం.లకు మదరాసు మెడికల్ కాలేజీయందు గౌ॥ పి. కుమారస్వామిరాజాగారు ప్రారంభోపన్యాసము నొసెంగెదరు.

## భీమాకంపెనీ ఉద్యోగులు

పై ఉద్యోగుల సంఘం తరపున పనిచేయు ఉద్యోగులందరికి జీతాలకు సగం అదనంగా కరువుభత్యాలు, జీతనాభివృద్ధి, ఇండ్లసదుపాయం, బిడ్డల అలవెన్సు, 3 నెలల బోనసు, ఉచితవైద్యం, సెలవు సదుపాయాలన్నీ యివ్వాలని కోరుచు ఒక విన్నపమును కంపెనీలన్నింటికి టి. యస్. రామానుజంగారు, సంఘాధ్యక్షులు దాఖలు చేసిరి.

# క్రిస్మసునాడు కమ్యూనిస్టు చైనా పరిగణన

## భారతప్రభుత్వ నిర్ణయం?

లండన్, డిసెంబరు 22: ఇక్కడ వ్యాప్తిలోవున్న వార్తలనుబట్టి, క్రిస్టమస్ పండుగనాడు, భారతదేశం చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించునుందని తెలుస్తూన్నది.

బ్రిటిష్ మంత్రివర్గంకూడా చైనా ప్రజా ప్రభుత్వాన్ని గుర్తించటానికే నిర్ణయం చేసుకుంది. అయితే యీ విషయమై ప్రకటన యెప్పుడు జరిగేది ఇంకా యిష్టానిష్టాలమీద ఆధారపడి వుంటుంది. బెవిన్ ఈ విషయాన్ని జనవరి మాసారంభంవరకూ నిలిపి వుంచాలనే అభిప్రాయంతో వున్నట్లు తెలుస్తున్నది. బెవిన్, అంతవరదాకా ఆగమని భారతదేశాన్ని వత్తిడి చేయలేకపోతే పాకిస్థాన్, సింహళదేశములు కూడా డిసెంబర్ 25 వ తేదీనే తమ గుర్తింపు ప్రకటనలను కూడా చేయవచ్చును.

బ్రిటనూ, దూరప్రాచ్య దేశాలు అన్నీ కలిసి ఒకేసారి ఈ ప్రకటనలు చెయ్యటం అవసరమని అభిజ్ఞులు అనుకుంటున్నారు.

## కెనడాప్రభుత్వ నిర్ణయం

అటావా, డిసెంబర్ 22: కొలంబోలో జరిగే కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సమావేశం పూర్తిఅయేవరకూ కెనడాప్రభుత్వం చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించేవిషయమై ఏట్టిచర్యనూ తీసుకోదని ప్రధాని సెంట్ లోరెంట్ నేడు ప్రకటించాడు.

## బ్రిటిష్ ఫ్రెంచి సంప్రదింపులు

లండన్, డిసెంబరు 22: ఇండోచైనాలో బావ్‌దాయ్ ప్రభుత్వాన్ని బ్రిటన్ గుర్తించే విషయంమీదనూ, బ్రిటన్, ఫ్రాన్సులు చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించే విషయంమీదనూ సంప్రదించే నిమిత్తమై బ్రిటన్‌లో ఫ్రెంచి రాయబారి రేనమాసిగిలీ నేడు బ్రిటిష్ విదేశాంగమంత్రి బెవిన్‌ను కలుసుకున్నాడు.

బ్రిటన్ చైనా కమ్యూనిస్టుల ప్రభుత్వాన్ని గుర్తించేటప్పుడే, బావ్‌దాయ్ ప్రభుత్వాన్ని తాత్కాలికంగా గుర్తించవచ్చునని తెలుస్తున్నది. అయితే ఎప్పుడు ఈ గుర్తింపులు జరిగేదీ ఇంకా చర్చించబడుతున్నది. బావ్‌దాయ్ ప్రభుత్వాన్ని గుర్తించే విషయంలోమాత్రం ఫ్రాన్సు లాంఛనంగా బావ్‌దాయ్ ప్రభుత్వానికి అధికారం అప్పగించాలని బ్రిటన్ నిరీక్షించవచ్చును. అయితే ఫ్రాన్సు బావ్‌దాయ్‌తో చేసుకున్న ఒప్పందాన్ని ఫ్రెంచి ఎగువసభ ఆమోదించేవరకూ బ్రిటన్ వేచి ఉండవని తెలుస్తున్నది.

## కొమింటాంగ్ హెచ్చరిక

"రష్యా 1945 సం॥పు మైత్రీ ఒడంబడికను ఉల్లంఘించినట్లు చైనా చేసిన ఆరోపణను చిన్న సమితి విచారించవలెనని సమితి సర్వసభ్య సమావేశం చేసిన నిర్ణయానికి, బ్రిటన్ చైనా కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించటం విఘాతం కలిగించగలదు" అని కొమింటాంగ్ చైనా బ్రిటన్‌ను హెచ్చరించింది.

లండన్‌లోని చైనా రాయబారి నిన్న తన ప్రభుత్వ సందేశాన్ని బ్రిటిష్ ప్రభుత్వానికి అందజేశాడని ఒక బ్రిటిష్ విదేశాంగ కార్యాలయోద్యోగి నేటి రాత్రి వెల్లడించారు.

అంటే చిన్నసమితి చైనా ఫిర్యాదును విచారించేటంతవరకూ ఐక్యరాజ్య సమితి కొమింటాంగ్ ప్రభుత్వాన్నే న్యాయప్రభుత్వంగా గుర్తిస్తుందని కొమింటాంగ్ చెప్పుతుంటున్నదన్నమాట.

# కామన్వెల్తు విదేశాంగ మంత్రుల సభ

## కార్యక్రమం తేలలేదని నెహ్రూ ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 22: 1950 జనవరి నెలలో కొలంబోలో జరుగనున్న కామన్వెల్తు విదేశాంగ మంత్రులసభలో భారతదేశం పాల్గొంటుందని, తానే భారత ప్రతినిధివర్గానికి నాయకత్వం వహించి కొలంబో వెళతానని ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ యీవేళ, పార్లమెంటులో కామత్ ప్రశ్నకు సమాధానమిస్తూ తెలియజేశారు. ఈ ప్రతినిధి వర్గంలో, విదేశాంగశాఖ సహాయ కార్యదర్శి, యమ్. దత్, ఆర్థికశాఖా సహాయ కార్యదర్శి అంజెనోరకర్ సభ్యులుగా ఉంటారనికూడా నెహ్రూ తెలియజేశారు.

సమావేశంలో చర్చనీయాంశాలేవో తెలియజేయటాని అనుగనేదని, అసలు, మామూలుగా చర్చనీయాంశాల ఎజెండాను ముందుగా తయారుచేసిఆస్టైపెట్టే ఆచారం లేదు, కాని ఆర్థిక వ్యవహారాలకు సంబంధించిన కొన్ని విషయాలను చర్చకు ప్రతిపాదించ బడినవని నెహ్రూ అన్నారు.

# గ్రంథ సమీక్ష

## చలనచిత్రకళ - 2

(సినిమా పుట్టుపూర్వోత్తరాలు)

కర్త: శ్రీ యు. వి. ప్రసాద్, ప్రకాశకులు: చిత్రకళా ప్రచురణలు, సత్యనారాయణపురం, విజయవాడ. వెల: రూ 1-8-0.

ఈగ్రంథంలో పాశ్చాత్య ఫిలిం పరిశ్రమనుగురించి, విదేశీచిత్ర విశేషాలను గురించీ, నృత్యకళను గురించి వివరాలు ఇవ్వబడినవి. సినిమా సాంకేతిక పదాలవివరణ ఉన్నవి. ప్రసిద్ధ సినిమావ్యక్తుల ఫోటోలున్నవి.

## శ్రీ మద్భగవద్గీత

అనువాదకులు: శ్రీ నిర్వికల్పానంద స్వామి. ప్రకాశకులు: శ్రీ రామకృష్ణ మఠము మైలాపూరు, చెన్నపురి. వెల: రు 3-0-0.

ఈ గ్రంథం యొక్క మూడవ కూర్పు వెలువడింది. గ్రంథంలో గీతా తత్త్వమూ, ప్రతి మూలములకు గీతా వాక్యముల జాబితా, గీతలయందు చర్చించబడిన వివిధ విషయముల వర్ణానుక్రమణికా చేర్చడం వల్ల పఠితలకు మిక్కిలి ఉపయుక్తంగా ఉండగలదు.

## పాడి పరిశ్రమ

కర్త: శ్రీమైనం శ్రీరాములు, కార్యదర్శి, గవర్నరుపేట మునిసిపల్ హైస్కూలు ఉపాధ్యాయ సంఘము విజయవాడ వెల: రు 1-0-0

ఒకప్పుడు మనదేశం పంటకెంత ప్రసిద్ధో పాడికీ అంతప్రసిద్ధి. ఈ రెంటిని గురించీ మనం శాస్త్ర పరిజ్ఞానం సంపాదించవలసిన తరుణం వచ్చింది. ఇటువంటి పరిజ్ఞానాన్ని ఈ పుస్తకం చాలా తృప్తికరంగానూ, సులభగ్రాహ్యంగానూ ఇస్తుంది. ఆవేశ తరాలుగాపాడి కలిగి ఉన్నవారు సహితం నేర్చుకోదగిన శాస్త్ర విషయాలు ఇందులో ఎన్నో ఉన్నాయి.

## నిట్టూర్పు

(ఏడు విషాదాంత నాటికల సంపుటి)

కర్త: డాక్టరు రాంబాబు, ఏలూరు. మూల్యం: ముప్పావలా.

ఈ విషాదనాటికల సంపుటిలో తాజమహలు, పాలనోంగలు, అగ్నిగుండం - రత్నసముద్రం, దీపస్తంభం ఊగులాడుతోంది! అంధకారం, నిండుకుండ తొణికింది! మహాకవి: జాన్‌కీట్సు అనే నాటికలున్నాయి. నాటికలన్నీ భావప్రధానమైనవి. 1,3,5,7, చారిత్రక సంఘటనలకు సంబంధించిన కల్పనలు మిగిలినవి సాంఘికమైన వాతావరణానికి చెందినవి.

## అర్క

శ్రీ అరవింద ప్రబోధములను ప్రకటించు పత్రిక సంపాదకుడు: శ్రీ గోవిందరాజులు. ప్రకాశకులు: కార్యదర్శి, తెలుగు ప్రచురణ శాఖ, శ్రీ అరవిందాశ్రమ ముద్రణాలయం, పుదుచ్చేరి. చందా సంవత్సరానికి రు 3 లు విద్యార్థులకు మాత్రం అర్థ సంవత్సరానికి రు 1-8-0 విడిప్రతి రు 1.

## కథా సుమాంజలి

రచన: శ్రీయుతులు ఆకుండి వెంకటశాస్త్రి మాచిరాజు సీతాపతిరావు, కురుమెళ్ల వెంకటరావుగార్లు. ప్రచురణ: టి. వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్సు 2, పిలిప్స్ వీధి-మద్రాసు, మూల్యం: రు 0-10-0

ప్రథమ తరగతులలో చదువుతున్న విద్యార్థులకు చక్కని సహాయ పాఠ్యగ్రంథంగా (నాండిటెయిల్డ్ టెక్స్టు) ఉపకరించేలా వున్నది. దీన్లో చక్కచక్కటి చిన్నిచిన్ని కథలు ఒకవినిమిది వున్నయ్. కొజాతీయ కథలూ కొన్ని విదేశాల కథలూ కూడా వున్నయ్ భాష సరళ గ్రాంథికంలోవున్నది.

లైఫ్ ఇన్సూరెన్సు ఏజెంట్సు ప్రిపోజల్ అండ్ పాలసీ రిజిస్టరు (11) కమిషను రిజిస్టరు.

ఒక్కొక్కటి రు. 2-8-0: రెండూ ఒకే సెట్టుగా రు. 4-0-0

దొరుకు స్థలము. వై. ఆర్ అండ్ సన్సు, 16/194 సత్యనారాయణపురం విజయవాడ.

లైఫ ఇన్సూరెన్సు ఏజెంట్లను ఎక్కువ ఇన్సూరెన్సు వ్యాపారం, అనుకున్నా, పాలసీలు రద్దుకాకుండాను, రద్దు అయిన పాలసీలు తిరిగి అమలులోనికి తెచ్చుకొనుటకున్నూ పట్టాదారుని కుటుంబ చరిత్ర, పాలసీలోని వివరములున్నూ, దరఖాస్తు యొక్క పూర్తి కాపీన్ని కమిషన్ వగైరా వివరములు యీ పుస్తకములలో రికార్డుగా వుండును.

ఇన్సూరెన్సు శాస్త్రవేత్తలూ, పత్రికా సంపాదకులు వీటి ఉపయోగమును గూర్చి పదేపదే వ్రాస్తూనే వున్నారు ఎక్కువ వ్యయప్రయాసలు అని ఎవరునూ సాహసించలేదు ఇన్సూరెన్సు ఏజంటు వుపయోగమునకు పై ప్రకాశకులు వీటిని పూర్తి వివరములలో ప్రచురించి ఇన్సూరెన్సు వ్యాపారమునకు సేవ చేయుచున్నారు.

# వారఫలాలు

డిసెంబరు 25 వ తేదీ మొదలు డిసెంబరు 31 వ తేదీవరకు

### గ్రహస్థితి

రవి 26 వరకు బుధుడూ (ధనుస్సు) కుజుడు (కన్య) శుక్రుడూ 27 నుండి బుధుడూ (మకరం) కేతు (సింహం) రాహువు (మీనం) చంద్రుడు (కుంభం, మీనం, మేషం, వృషభాల్లో) 31 శని వక్రారంభం-26 శని చంద్ర 27 కుజ చంద్ర (సమ సప్తకం) 28. రాహు చంద్ర (యుతి) 29 బుధ చంద్ర. 30 గురు చంద్ర శుక్ర చంద్ర (కేంద్రం) 31 శని చంద్ర-బుధ చంద్ర (కోణం.)

### ధరలు

ప్రత్తి (జారిల్లా) నూలూ వస్త్రాలూ

స్పెక్యులేషన్ మార్కెట్టు జరుగదగిన రెడీ సరుకు మరికొంతధర త్వరలో (3 వారాల్లో) హెచ్చుతుంది.

వెండి-బంగారాలు

28-29 ల్లో మార్కెట్టు క్రమేపి హెచ్చుతుంది.

వాటాలు

స్వల్ప తేడాలో యుంటవి.

ధాన్యములు - ఆహారవస్తువులు

21-వ తేదీ చంద్ర దర్శనం-ఉత్తర శృంగోన్నతి. రసవస్తువులలో తాత్కాలికంగా కొంత హెచ్చు ధరలను సూచిస్తుంది.

### లగ్న ఫలాలు

మేషం (అశ్విని, భరణి, కృత్తిక 1వపాదం)

ఈ వారంలో 26 మధ్యాహ్నం 11 న్నరగంటలవరకు ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. తర్వాత 28 సాయంత్రంవరకు మీరుచేసే ఆలోచనలకూ జరిపే కార్యక్రమానికీ సంబంధం యుండదు. ఒకటి నిర్ణయించి మరొకటి జరుపుతారు. విధిలేని పరిస్థితుల్లోకూడా ప్రయాణం ఆపి 29-30 ల్లో జరుపండి. మేలు కలుగుతుంది. ఆరోగ్యం యథాతథంగా యుంటుంది. కొత్త పెట్టుబడులు చేయవద్దు. వారాంతములో కొందరి తొందరవల్ల ఉత్సాహం లేని పనుల్లో ప్రవేశిస్తారు.

వృషభం (కృత్తిక 2, 3, 4 రోహిణి మృగశిర, 1 2. పాదాలు)

ఈవారంలో పరిస్థితులు గతవారంలో కన్నా ప్రోత్సాహకరంగా యుంటవి. వ్యాపారాదులు లాభకరంగా యుండకలవు. సమాజంలో కీర్తి పైచేయిగా యుంటుంది. ఆరోగ్యంకూడా గత వారముకన్నా మేలుగా యుండకలదు 25-26 ప్రయాణానికీ అప్పునూ - మిత్రులనూ కలవడానికి అవకాశాలు కలుగుతవి. 27-28 లో పరిష్కారాలూ-వ్రాతలూ లాభకరం. 29-30 ల్లో భోజన శయన సౌఖ్యములు సరిగా అమరవు. 27 శుభవార్త.

మిథునం (మృగశిర 3, 4 పాదాలు ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పాదాలు)

ఈవారంలో మీరు ఉత్సాహంతో కార్యక్రమం ప్రారంభించలేరు. 26 మధ్యాహ్నంవరకు ఆరోగ్యంకూడా తిన్నగా యుండదు. తర్వాత అనుకూలపరిస్థితులు ఏర్పడి ఆశాజనకంగా యుండడంవల్ల త్వరపడి ముందుకు పోకలుగుతారు. చిన్న ప్రయాణం లేదా అప్పులకలవడం 27 28 లో కలుగుతుంది. 30 31 ల్లో పరిష్కారాలూ వ్రాతలు పెట్టుబడులూ లాభకరం కాగలవు. 27 ఆప్త సమాగమం. 30 శుభవార్త.

కర్కాటకం (పునర్వసు 4, పుష్యమి ఆశ్లేష)

ఈవారంలో పరిస్థితులు ఇంచుమించు గత వారాంతంలాగే యుంటవి. 25 26 ల్లో మీరు ప్రారంభించినకార్యం ఏదీ సరిగా ముగియదు. పైన అపనిందలు కలిగే సూచనలున్నవి. 27 28 ల్లో సంఘ వ్యవహారాల్లో చిక్కులూ అపవాదూ మిగులుతవి. 29 30 ల్లో ప్రయాణం నూతన వస్తు విక్రయం-లాభకరం. అప్పులను కలువారు వారాంతంలో పరిష్కారాలూ వ్రాతలూ ముగించండి.

సింహం (మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)

ఈవారంలో మీరు ఎంత మౌనంగా యుంటే అంత మేలు కలుగుతుంది. కుటుంబపరిస్థితులు విశ్రాంతినివ్వవు. ఆరోగ్యంకూడా తిన్నగా యుండదు. ప్రయాణావశ్యకత ఎక్కువ. కాని ఆపుకోవడం మంచిది. మీకు మిత్రులుగా అప్పులుగా నటిస్తూ మీకీర్తికి భంగం కలిగించేవారున్నారు. వారిని గమనించి తొలగించుకుంటేనే కాని మీకు సుఖం కలుగదు. 25 సత్వార్త, సుఖప్రాప్తి.

కన్య (ఉత్తర 2 3 4 పాదాలు, హస్త చిత్త 1-2 పాదాలు)

ఈ వారంలో 25, 26 లో పరిష్కారాలూ వ్రాతలూ పెట్టుబడులూ లాభకరం కాగలవు. 26, 27, 28 ల్లో తలపెట్టిన ప్రయాణం ఆగుతుంది. కాని ఎవరికోరకు మీరు ప్రయాణం చేయవలసియుంటాలో వారిని కలుస్తారు. వృత్తి ఉద్యమాల్లో ముఖ్య కార్యక్రమం ఆలోపుగా ముగించుకొనండి. 29, 30, 31 ల్లో ఆరోగ్యం సరిగా యుండదు. ఇరుగుపొరుగుతో కలహాలురేగే సూచనలున్నవి పెట్టుబడులూ స్పెక్యులేషన్ మానుకొనండి.

తుల (చిత్త 3, 4 పాదాలు, స్వాతి విశాఖ 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో పరిస్థితులు ఇరువైపులా యుంటవి. 25 బద్ధకంవల్ల ఏపనీ తృప్తికరంగా జరుపలేరు. 26, 27 ల్లో ఉద్యమ పరిస్థితులు ప్రోత్సాహకరంగా యుండకలవు. వ్యాపారస్పెక్యులేషనులు లాభకరం. 28, 29 ల్లో విధిలేని ప్రయాణం కలుగుతుంది. అప్పులను కలవడం విందువినోదాలతో ఎక్కువకాలం గడుపుతారు 30 31 ల్లో విశ్రాంతి అవసరం. 28 శుభవార్త.

వృశ్చికం (విశాఖ 4 పాదం, అనూరాధ జ్యేష్ఠ)

ఈ వారంలో 25 ఆరోగ్యం తిన్నగా యుండదు. ప్రయాణం ఆగిపోతుంది. 26, 27 ల్లో సంఘవ్యవహారాలు విసుగు కలిగించకలవు 28, 29 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ లాభకరం. కుటుంబ ఆర్థిక పరిస్థితులు చక్కచేసికొనకలుగుతారు. 30 31 ల్లో ప్రయాణం లాభిస్తుంది. ఆప్తులను కలుస్తారు. విందు వినోదాలతో సంతోషంగా కాలం గడుస్తుంది.

ధనుస్సు: (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం.)

ఈ వారంలో పరిస్థితులు ఇంచుమించు గతవారంలోలాగే యుంటవి. ఆరోగ్యాభివృద్ధి కలుగుతుంది. 25, 26, 31 పరిష్కారాలకూ పెట్టుబడులకూ లాభకరం. 27, 28 ల్లో ఎదురుచూచేవారు ఆశాభంగం కలిగిస్తారు. 29, 30 ల్లో సామాజిక వ్యవహారాలు విశ్రాంతినివ్వవు. కాని ముఖ్యులకు మీవల్ల సహాయం కలుగుతుంది. అందువల్ల వినుక మేలుపొంద కలుగుతారు.

మకరం (ఉత్తరాషాఢ 2, 3,4 పాదాలు, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పాదాలు)

ఈ వారంలో 26 మధ్యాహ్నం వరకూ కుటుంబపరిస్థితులు మనస్సునకు విశ్రాంతి నివ్వవు. మనస్సు ఉద్రేకపూరితలగా యుంటుంది. ఇరుగుపొరుగు ఆడవారివల్ల చిక్కులు కలుగుతవి. ఉద్యోగ నౌకరీల్లో అల్పులు సౌఖ్యం కలిగించుకొనడం పై వారితో మీపై చాడీలుచెప్పడం కలుగుతుంది. 27 28 ల్లో వ్రాతలూ పరిష్కారాలూ లాభకరం. 29-30 ల్లో ప్రయాణం ఆగుతుంది.

కుంభం (ధనిష్ఠ 3,4పాదాలు, శతభిషం పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో 25-26 ల్లో ప్రయాణం లాభకరం. మనస్సును స్వాధీనంలో యుంచుకొనడంవల్ల స్పెక్యులేషనులో మంచి అవకాశాలు పొందకలుగుతారు. 27-28 ల్లో పరిష్కారాలూ వ్రాతలూ ముగించండి. 29, 30, 31 ల్లో దూరప్రయాణం చేయవలసియుంటుంది. కాని డబ్బును జాగ్రత్తగా యుంచుకొనడం మంచిది. ఆప్తులను కలుస్తారు. శుభ సంప్రతింపులు జరుగుతవి.

మీనం (పూర్వాభాద్ర 4 పాదం ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో మీరు స్పెక్యులేషనుకు ఎంతో దూరంగా యుండడం అవసరం. 25-కొరగాని ఖర్చులు ఎక్కువ. 26, 27, 28 ల్లో అప్తులతో కులాసాగా విందు వినోదాలతో కాలం గడుపుతారు. ప్రయాణం కలిసివస్తుంది. 29-30 ల్లో కుటుంబంలో భార్యాబిడ్డలకు ఆరోగ్యం తిన్నగా యుండదు. 31 పరిష్కారాలకూ, వ్రాతలకూ అనుకూలం.

## కార్పొరేషను బడ్జెటు

మదరాసు, డిసెంబరు 23: మదరాసు కార్పొరేషను 1950-51 బడ్జెటు కమిషనరు సి. నరసింహంగారు తయారు చేసిన పన్నులు, ఆర్థికోపసంఘములకు పంపబడినది అందు రాబడి రూ 1,90,18,780 ఖర్చు రూ 18,927,030 చూపబడెను. నిలిటలోటుతోసహా, సాలాంతానికి లోటు 15.05 లక్షలుండును. అందుచే పెట్టుబడి ఖర్చులు చాలతగ్గించి 1.47 లక్ష మాత్రం నిర్ణయించబడెను.

లోటు పూడ్చుటకు యీదిగువ సూచనలు తెలుపబడినవి:

(1) సాలీనా రూ 500 అద్దె విలువకు తక్కువగల ఇండ్ల పన్ను కూడా హెచ్చించుట. (2) వృత్తిపన్ను ప్రమాణం రూ 50 నుండి 250 కి పెంచుట. (3) ట్రాము కారులపై పన్ను పెంచుట. (4) లైసెన్సు ఫీజు పెంచుట. వీటన్నిటివల్ల 8 లక్షలు రాబడి రాగలదు.

మెహబూబ్ ప్రొడక్షన్స్ 'అందాజ్' లో నాయిక నర్గిస్.

## నగరంలో సినిమాలు

| | |
|---|---|
| సన్ | 'లైల మజ్ను' |
| సాగర్ | 'బీనా' |
| వెల్లింగ్టన్ | 'అపూర్వ' |
| ప్రభాత్ | 'సహోదర్ కర్' |
| స్టార్ | 'నమస్తే' |
| పారగన్ | 'శైక్స్' |
| బ్రాడ్వే | 'జిద్దీ' |
| క్రౌన్ | 'ఇన్సాన్యత్' |
| సినిమా సెంట్రల్ | 'మనోన్మణి' |
| సెలెక్టు | 'లడ్డీ' |
| అశోక్ | 'అందాజ్' |

Casino: 'The Luck of the Irish'
Minerva: 'Adventures of Don Juan'
New Elphinstone: 'Beautiful Blonde from Bastful Bend'
NewGlobe: 'The Fountain head'
Roxy: 'Africa Screams'

### 'అందాజ్'

దిలీప్ కుమార్, రాజ్‌కపూర్, నర్గిస్ ప్రధాన భూమికలు నిర్వహించే మహబూబ్ ప్రొడక్షన్సు వారి "అందాజ్" మొన్న 23—వ తేదీనుంచీ "అశోక్" టాకీస్‌లో ప్రదర్శిత మౌతున్నది. ఈఫిలిం దర్శకులు మెహబూబ్, సంగీత దర్శకుడు నౌషద్.

భాగ్యవంతమైన కుటుంబంలో పుట్టి బాల్యంనుంచీ పాశ్చాత్య జీవన విధానాలకు అలవాటు పడిన యువతి నీన. ఆమె ఒకరోజున గుర్రపు స్వారీ చేస్తూండగా, గుర్రం స్వాధీనం తప్పి ప్రమాదస్థితి కలుగుతుంది. అప్పుడు దిలీప్ అనే యువకుడు ఆమెను రక్షిస్తాడు. ఆ పరిచయం క్రమేణా నీనలో స్నేహంగానూ, దిలీప్‌లో ప్రేమగానూ, వృద్ధిపొందుతుంది పైగా దిలీప్ ఆమె స్నేహరీత్యా చూపే చనవును ప్రేమగా అపార్థం చేసుకొంటాడు. నీన ప్రేమించిన రాజన్ రావడంతో అసలు సంగతి బయట పడుతుంది, దిలీప్ హతాశుడౌతాడు. అయినా తమాయించుకొంటాడు. కాని దిలీప్‌యెడ నీనా చూపే చనువు, శ్రద్ధా, ఆమె ప్రేమించి పెండ్లాడిన రాజన్‌కు అనుమాన కారణమవుతాయి. దానితో సంఘర్షణ ప్రారంభమై, నీనా జీవితం విషాదాంతమవుతుంది. ఇదీ కథాంశం. నిర్మాత, దర్శకుడు అయిన మెహబూబ్, ఈ కథను సముచిత సన్నివేశాలతో, పాశ్చాత్య జీవిత విధానాలను సక్రమంగా అర్థంచేసుకోక వాటిని అనుకరించేవారి జీవితాలు దుఃఖభాజనాలవుతాయన్న నీతిని బోధించేందుకు వినియోగించాడు.

నీనాగా నర్గిస్, దిలీప్‌గా దిలీప్‌కుమార్ రాజన్‌గా రాజకపూర్ అద్భుతంగా నటించారు. నౌషద్ సంగీతం హృద్యంగావుంది. గుర్రపుస్వారులు, నాట్యాలు, ప్రాదేశిక దృశ్యాలు, వీధులలో మంచుపడే దృశ్యం తీయడంలో ఛాయాగ్రహకుడు మంచి నేర్పు చూపాడు. మొత్తంమీద ఫిలిం రంజకంగావుంది.

## చెన్నపట్నానికిమరోచక్కని సినిమాహాలు

చెన్నపట్నానికి మరోచక్కని సినిమా హాలు ఏర్పడింది. లోగడ సాగర్ టాకీస్ నిర్వహిస్తుండిన ఎల్. ఎల్. షవేల్‌గారు పెరియమెట్టులో ఈ హాలు కట్టించారు. మొన్న 22 వ తేదీన ప్రధాని కుమారస్వామి రాజాగారు ఈ హాలు ప్రారంభోత్సవం జరిపారు. పత్రికలవారిని పురప్రముఖులను పలువురిని ఆహ్వానించారు. అతిథులకూ • షవేల్‌గారూ, వారి బంధువర్గం స్వాగత సత్కారాలు చేశారు. అల్పాహారానంతరం షవేల్‌గారు హాలు నిర్మాణ వివరాలు తెలిపి కృతజ్ఞత చెల్లించారు. ప్రధాని ఉపన్యసిస్తూ, సినిమా హాలువారు ప్రేక్షకులకు హాయికూర్చే సదుపాయాలు చేయాలనీ, సినిమాల మీద ప్రభుత్వంవసూలు చేసే పన్నుల సొమ్ము ప్రజాహితానికే వినియోగమవుతుంది కనుక అపన్నులు చెల్లించడానికి హాలువారు కంటగించుకోరాదని అన్నారు. తర్వాత అతిథులకు 'అందాజ్' ఫిలిం ప్రదర్శించారు.

హాలంచాలా అందంగా వుంది. 1120 మంది కూర్చొనేందుకువీలువుంది. సీట్లుబాగా సౌకర్యంగా వున్నాయి.

# ప్రభుత్వ మోటార్‌వాన్ అమ్మకం

## లెజిస్లేటివ్ కవున్సిల్‌లో విమర్శ

మదరాసు, డిసెంబరు 23: ప్రభుత్వ అసిస్టెంటు కార్యదర్శి ప్రభుత్వ మోటారు వానును కొనుట గురించి నేడు లెజిస్లేటివు కవున్సిల్‌లో ప్రశ్నోత్తరములు జరిగెను.

శ్రీ భీమారావుగారు మదరాసుప్రభుత్వ అసిస్టెంటు కార్యదర్శి మోటారును కొనుటగురించి డిసెంబరు 3 తేదీ "స్వతంత్ర"లో ప్రకటితమైన పుత్తరములు గమనించినారా యని అడిగిరి.

స: ప్రధాని, పై ఉదహరించబడిన ఉత్తర ప్రత్యుత్తరములను గమనించిరి.

ప్ర: ప్రకటించిన వుత్తర ప్రత్యుత్తరములు సరియైనవేనా?

స: చేరవుత్తరములు, వ్రాయవుత్తరములు గురించి మాత్రము ప్రభుత్వము సమాధానమివ్వ గలదు. 1, 2, 3, నెంబర్లుగల 3వ తేదీ "స్వతంత్ర" 42-43 పేజీలలో ప్రకటించబడినవి సరిగానే ప్రకటించిరి.

ప్ర: ప్రభుత్వోద్యోగి అమ్మకమును ఖాయపరచిరి.

స: ప్రభుత్వమే కొంచు అమ్మకమునకు వుత్తర్వుచేసెను కాబట్టి అమ్మకమును ఏ ఉద్యోగి ఖాయపరచవలసిన అవసరము లేదు.

ప్ర: ప్రభుత్వ ఉద్యోగుల ప్రవర్తన నియమములలోగాని, మరెచటగాని ఇట్టి పరిస్థితుల లో ప్రభుత్వ ఆస్తిని సెక్రటేరియట్ ఉద్యోగి కొనుటను నిషేధించు నియమము ఏమైనా యున్నదా?

స: లేదు.

శ్రీ భీమారావు: కోర్టు వేలములలో ప్లీడర్లు ప్లీడరు గుమాస్తాలు వేలపు ఆస్తిని కొనరాదను నిషేధమున్నది?

స: నేను లాయరును కాను. కోర్టులలో ఏమి జరుగునో తెలియదు, ఇక్కడ అటువంటి నిషేధము లేదు.

అనేక అనుబంధ ప్రశ్నలకు జవాబు ఇచ్చుచూ ప్రభుత్వ ఉద్యోగికి వానును రు 500 లకు అమ్ముటలోనూ అసిస్టెంటు కార్యదర్శి కొనుటతోనూ అనుమానించవలసినది ఏమీలేదని ఉద్యోగుల ప్రవర్తన నియములను సవరించవలసిన ఆవశ్యకత లేదని శ్రీ గోపాలరెడ్డిగారనిరి.

ప్రభుత్వోద్యోగులు అనవసర విమర్శకు గురికాకుండా ఉద్యోగులు ప్రభుత్వ ఆస్తిని కొనుటను నిషేధించుచూ నియమములు చేసెదరా?

స: నిబంధనలున్నా ప్రభుత్వోద్యోగులు అనవసరముగ విమర్శలకు గురి అవుతూనే వున్నారు. అటువంటి నిబంధనలు అవసరమైనప్పుడు ప్రభుత్వము ఆలోచించ గలదు.

## ఫిలింకంపెనీలతో కాంట్రాక్టులు

మదరాసు, డిసెంబరు 23: లేబరు మంత్రి శ్రీ సీతారామరెడ్డిగారు నేడు లెజిస్లేటివు కవున్సిల్‌లో 1933 సం॥ పు పిల్లల నౌకరీచట్టముక్రింద 15 సం॥ ములకులోబడిన పిల్లలచే నౌకరీచేయించు కాంట్రాక్టులు చెల్లవనియు అటువంటి కంట్రాక్టులు ఒప్పందములకు బాధ్యులయిన పోషకులు, తలి తండ్రులు చట్టక్రింద శిక్షార్హులనియు తెలిపిరి.

పాపులచట్టము ఫ్యాక్టరీల చట్టముకూడ 14 సం॥ ములకు లోబడిన వారిచ్చే పనిచేయించుట నిషేధించుచున్నదనీ ఈ చట్టములను సవరణచేయు ఉద్దేశ్యము లేదని కూడ మంత్రిగారు శ్రీ ఆర్, సూర్యనారాయణరావు గారి ప్రశ్నకు జవాబు ఇచ్చిరి.

## నగరంలోని నిరాశ్రయులు

1933 లో కార్పరేషన్ తీసిన లెక్కల ప్రకారము 10, 748 వీధులలో, అరుగుల మీద పడుకొనేవారున్నారనియు, నగరములో 3830 అనుమతిలేని పాకలున్నవని వీనిలెక్కను కార్పరేషను వుంచుచున్నదనియు మద్యనిషేధ మంత్రి నేడు కవున్సిలులో తెలిపిరి.

శ్రీ బి భీమారావుగారి ప్రశ్నకు జవాబు ఇచ్చుచూ నగరములోని గృహము లేనివారికి ఉద్యోగముగాని ఆశ్రయముగాని ఇచ్చుటకు ఇంతవరకు ప్రభుత్వ మేమీచేయలేదనియు అయితే కార్పరేషన్ ఇల్లు లేనివారికి ఆశ్రయమిచ్చుటకు 70 గృహములను నిర్వహించుచున్నదని అందు 230 కుటుంబములు వుండవచ్చుని కూడ మంత్రిగారనిరి.

## ఖర్చు తగ్గింపు కమిటి సలహాల అమలుమున మిగులు

ప్రభుత్వ పరిపాలనా వ్యవహారముల ఖర్చు తగ్గించే విషయము పునర్వ్యవస్థీకరణ విషయములగూర్చి సలహా నిచ్చుటకుగాను నియమితమైన కమిటీ గావించిన కొన్ని ప్లానులను ప్రభుత్వము ఆమోదించుట వల్ల జనరల్ పరిపాలన న్యాయశాఖ, పోలీసు, విద్య, మెడికల్ పబ్లిక్ హెల్తు, పటర్నరి పరిశ్రమలు మున్నగు శాఖల పద్దులలో మొత్తంమీద రూ 5270064 మిగులు ఏర్పడ్డదని శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారి ప్రశ్నకు బదులుగా సమాధాన మివ్వబడెను.

# రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 26 సోమవారం

## మద్రాసు (ఎ)

ఉ 7-30 ఎమ్. రాజాంబాళ్ పాట. 8 ఆంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం (రి). 8-30 హిందీపాఠం. 8-50 మద్రాసు (బి) వలె. మ. 12-30 బి. శంకర్ వేణువు. 1-30 ఆంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం (రి). 2-15 మద్రాసు (బి) వలె. 4 మద్రాసు (బి) వలె. 4-30 పాశ్చాత్య సంగీతం (రి). సా. 5-30 సంగీతోత్సవం ఎలెక్ట్రికల్ రికార్డింగు. 6 ఆంగ్లమున వార్తలు. 6-20 ఎమ్. సి. పార్థసారథి వీణ. 7-30 గీతమంజరి (రి). 7-45 జంత్రవమ్మేళనము. 8 సంగీతోత్సవం ఎలెక్ట్రికల్ రికార్డింగు 9 ఆంగ్లమున వార్తలు, 9-15 మద్రాసు (బి) వలె.

## మద్రాసు (బి)

ఉ. 7 తెలుగున వార్తలు. 7-15 పంథ కోణం సోదరులు రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 హిందీపాఠము. 8-50 ఎ. జి. సెల్వంపిళ్లె పాట. మ. 12-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 2-15 వి. ఎమ్. శామారావు పాట. 4 టి. ఆర్. రత్నవేల మొదలియార్ వయొలిన్. సా. 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం (రి). 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయదారునికి సలహాలు. కొత్తరకపు అరటులు ప్రసంగం ఫిల్మ్‌సంగీతం (రి). 7 తెలుగున వార్తలు. 7-15 సంస్కృతి. అంతర్వాహినులు బైజాంటైన్ సంస్కృతి ప్రసంగం ఎ పట్టాభిరామ్ రారా ఓ మావ పుదా అనిసెట్టిగేయం 8-0 మద్రాసు (ఎ) వలె 9-15 వయొలిన్ నిలయ విద్వాంసుడు 9-30 సంగీతోత్సవం ఎలెక్ట్రికల్ రికార్డింగు.

## విజయవాడ

ఉ. 7-0 తెలుగున వార్తలు 7-15 ఎం. ఎల్. వసంతకుమారి (రి) 7-30 వాసా సాంబమూర్తి వీణ 8-0 ఆంగ్లమున వార్తలు. 8-15 వాసా సాంబమూర్తి వీణ 8-30 హిందీ పాఠము 8-50 గీతావళి వాసుదేవ పురుషోత్తం మ. 1 0 తారాపథం (రి) 1-30 ఆంగ్లమున వార్తలు 1-50 తెలుగున వార్తలు 4-0 చిత్రవాణి (రి) సా. 5-30 మద్రాసు (బి) వలె 6-0 ఆంగ్లమున వార్తలు. 6-20 గీతావళి వాసుదేవ పురుషోత్తం 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి) 7-0 తెలుగున వార్తలు. 7-30 చిత్రవాణి (రి) 7-45 పరస్పర సహకారము పారిశ్రామిక అభివృద్ధి ప్రసంగం సి. వి గడ్డి 8-0 మద్రాసు (బి) వలె 9-0 ఆంగ్లమున వార్తలు. 9-15 ఆంగ్లమున ప్రసంగం 9-30 మద్రాసు (బి) వలె.

## హైదరాబాద్

ఉ. 7-30 మహనాయ్ ఓస్మిల్లాపార్టీ రికార్డులు 7-40 జకీరాలీ ద్వాద్రా ఘజల్ 8-0 ఆంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే) 8-20 ఎం. వెంకటరాజా కర్నాటక సంగీతం 8-50 తెలుగున వార్తలు. 9-15 తసాదుక్ హుస్సేన్ ఖయాల్ జాన్పూరి మ. 12-30 రికార్డులు. 1- జావళీలు రికార్డులు. 1-30 ఆంగ్లమున వార్తలు, 1-50 తెలుగున వార్తలు. (ఎ. ఐ. ఆర్ రిలే) సా 5. తసాదుక్ హుస్సేన్ ఖయాల్ భీమ్‌పాస్ ఘజల్ 5-35 జకీరాలీ ద్వాద్రా. గీత్. 6-30 పిల్లల కార్యక్రమం తెలుగున, కష్టార్జితం కథ రచన ఎ. చెన్నకేశవులు. హితవు మాటలు కావ్యపఠనం: క. శాంత 7-0 తెలుగున వార్తలు (ఎ.ఐ. ఆర్. రిలే) 7-15 గ్రామస్థుల కార్యక్రమం. తెలుగున. కుటీర పరిశ్రమలు"బొమ్మలు తయారు చెయ్యటం" సంభాషణ. జానపద గేయాలు. 7-15 అబ్దుల్ కరీం రికార్డులు 8-30 సోవోన చటోపాధ్యాయ్. భజన్ గీత్. 8-40 ఎం. వెంకటరాజా కర్నాటక సంగీతం. 9-0 ఆంగ్లమున వార్తలు (ఏ. ఐ. ఆర్ రిలే.) 9-15 శ్రోతల పరిచయం 9-25 తాసదుక్ హుస్సేన్. ఖయాల్ దర్బారీ 9-55 శ్రోతలు కోరిన హిందుస్తానీ (రి).

ఆంధ్రపత్రిక

ఆదివారం డిసెంబరు 25, 1949

సారస్వతానుబంధము

# సోవియట్ రష్యా నిజస్వరూపం

రచన: ఫ్రైడా ఊట్లే

సోవియటు ప్రజల మధ్య ఏదైనా అక్కరకు వచ్చేది పనిని చేయవలెననీ కుతూహలంతో నేను తగిన పనికొరకు అన్వేషిస్తూ ఉండడంవల్ల నేను నా మకామును ఎంతో తరచుగా మార్చుకొనుచుంటినో నా ఉద్యోగమునుకూడా నేను అంత తరచుగా మార్చుకోవలసినదాననైతిని.

ఒక అంతర్జాతీయ కమ్యూనిస్టు ప్రచార సంస్థయందు నేను చేయుచుండిన ఉద్యోగము నిష్ప్రయోజనకరమైనదని నాకు తెలిసినపిమ్మట ఆ ఉద్యోగముపై నాకు విసుగు పుట్టినది. అదిన్నీగాక రాజకీయ సంస్థగా వ్యవహరింపబడేటటువంటి సంస్థలో నేను పనిచేయుచున్న కారణముచేత, నేను స్నేహమ్ము తగినదావను కొను అనే అనుమానముకలిగి నన్ను పట్టుకోవచ్చును. ఆ కారణముచేత నేనిపరిశ్రమయందు ప్రత్యేక ప్రవీణురాలుగా పనిచేయుటకొక ఉద్యోగము దొరికితే, అందులో ప్రవేశించితిని. మాస్కో ఎక్స్పోర్టు ఆఫీసులో ఆరుమాసాలు ఆ ఉద్యోగమును నేను చేసిన అనంతరము చిన్న లఘుపరిశ్రమల వ్యవహార కార్యాలయమొకటి క్రొత్తగా ఏర్పాటుచేయబడగా అందులో ఉద్యోగమును స్వీకరించితిని.

ఈ రెండు ఉద్యోగములు చేయడంవల్ల రష్యను ప్రభుత్వము జేశములో నివసస్తుసంపదను ఏవిధముగా వినియోగించుచున్నదో గ్రహింపగల్గితిని. రష్యాలోని పాటకపు జనులు యంత కష్టించి పాటుపడినప్పటికీ యిన్ని యిక్కట్టుల నోడిగట్టినప్పటికీ వారికి సరియైన జీవనోపాధి ఎందుచేత లభించలేదో నాకు బోధపడింది.

ఏదైనా భవనంలోని ఒక అంతస్తుగాని, కనీసం మా సొంతకాపురమున కొకగదిగాని దొరకునేమోయని నెలలతరబడిగా వెతుకుచునే యున్నాము. 1932 సం॥ వసంత ఋతువులో న్యూమాస్కో హోటలునందు మేము బసచేసి యుంటిమి. మా గదికి యివ్వవలసిన అద్దెను "తెలెక్స్ రివో" శాఖవారే అనగా, లఘుపరిశ్రమల ముడిసరకుల శాఖవారే చెల్లించుచుండిరి. ఈ శాఖకు సంబంధించిన ఎగుమతి రవాణాల సంస్థకు సారథియైన ఆర్కాడిగారే పైనుచేయిర్యనుగా నియమింపబడిరి.

## విచ్ఛిన్న విభ్రాంతి

[ఫ్రైడా ఊట్లేసతి, రచించిన విచ్ఛిన్నవిభ్రాంతియను గ్రంథమునందలి ఎనిమిదవ అధ్యాయ సంగ్రహమిది. "కార్మిక నియమనిబంధనల అతిక్రమణలకు" స్టాలిను విధించిన కఠినశిక్షలు యీ అధ్యాయములో విపులముగా వివరింపబడినవి. సోవియటు ప్రభుత్వపు భయంకరాధికారము మూలముగా "పారిశ్రామిక సామంతుల" వర్గమొకటి ఏర్పడినది. ఈ సామంతుల అధికారము క్రింద కార్మికులకు స్వాతంత్ర్యమున్నూ ప్రాతిపదిక మానవహక్కులును లేకుండా చేయబడెను.]

ఆహారవిషయమేమైనా యిప్పుడు బ్రహ్మాండమైన సమస్యయైనది. నాపేరిట "ఇన్స్నాబ్" తరగతి రేషనుకార్డు ఉన్నది. ఆర్కాడిగారికి "గోర్ట్స (బి)" రేషనుకార్డు ఉన్నది. కాని, మేము వంటవండుకొనుటెట్లు? మాస్కో హోటలులోని భోజనశాలయందు ఒక భోజనమునకు 20 రుబుల్సుగాని 25 రుబుల్సుగాని చెల్లించాలి. కనుక అదంతా సాధ్యంకాదు. ఆర్కాడిగారు 1948 సం॥లో బర్లిను నగరమునుండి ఒక ఎలెక్ట్రిక్ కెటిల్ (విద్యుచ్ఛక్తితో వేడినీళ్లు కాచుకొనే పాత్రను) తెచ్చిరి. విద్యుచ్ఛక్తితో వేపుడు వేయించుకొనతగిన పెనమొకటి తెచ్చిరి. వీటితో ఏదో ఒక రకం భోజనం తయారు చేయగల్గితిని.

న్యూమాస్కో హోటలునందు మేము అనుభవించుచున్న యీ అసంపూర్ణదర్జా జీవితము ఏప్రెలు మాసంలో కుదమట్టినది. రష్యాలో మేడిన ఉత్సవములు సమీపించుచుండెను. విదేశాలనుండి కొందరు యీ ఉత్సవాలు చూచుటకై రాగలరు. గనుక, వారు డబ్బుయిచ్చి యీ హోటలులో మకాము చేయగలరు. గనుక అట్టి అతిథుల కొరకై హోటలులో ఉండే రష్యనులందరు ఖాళీచేసి పోవలెనన్నారు. రష్యనుపోలీసు అధికారులు మాత్రము ఖాళీచేయనక్కరలేదు.

అటుపిమ్మట అస్టోజెంకా వీధిలో గాబ్రిలోవ్ గారి భవనమందు ఒక అంతస్తులోని రెండుగదులను తాత్కాలికంగా నివసించుటకై మేము సంపాదింపగల్గితిమి. గాబ్రిలోవ్ గారు మాకు ఇంగ్లాండులో పరిచితుడైయుండిన మా పార్టీ సభ్యుడు. ఆయన తిరిగి యిప్పుడు కూడా విదేశాలలో నే పనిచేయుచున్నాడు. మేము మాస్కో నగరమునకువచ్చిన యింతకాలానికి యిదే మొదటిసారిగా కొత్తఫాషనుగల మేడమీద రెండు గదులు తీసికొని మకాము చేయగల్గితిమి. నేను ఇంగ్లండునుంచి వెంటనే మా అమ్మను తీసికొని వచ్చితిని.

అస్టోజెంకు వీధిలో కొంచెం నాగరిక పద్ధతిగా కొలదిమాసములు మేము కాపురము చేసినపిమ్మట, గాబ్రిలోవుగారి కుటుంబము మాస్కోకు తిరిగివచ్చెను. తిరిగి మాకు కొంప అనేదిలేదు. మా అమ్మను తిరిగి ఇంగ్లండుకు పంపివేసితిని. నా మిత్రురాలైన జేను సెలవు దినములలో ఇంగ్లండుకు పోతూవుంటే ఆమె వెంట మా అమ్మను పంపితిని. తిరిగి న్యూమాస్కో హోటలులోనే ఆర్కాడియున్నూ నేనున్నూ బసచేయుట కొకగది సంపాదింపగల్గితిమి.

బసవిషయములో మేము ఎన్ని చిక్కులు పడినప్పటికీ ఈమధ్యకాలంలో మా జీవిత సౌఖ్యానుభవము కార్మికులలో అధికసంఖ్యాకుల జీవితము కంటెను పనివాండ్ల జీవితముకంటెను చాలా బాగా ఉన్నది. కమ్యూనిస్టుపార్టీలోని ఉన్నత శ్రీమంతులతో మేము సాటికి రాజాలము. కాని మధ్యతరగతివాండ్లలో మేము పై శ్రేణికి చెందినవారమే. ఆహారపదార్థముల సప్లయి విషయములో, "ఇన్స్నాబ్" తరగతి రేషనుకార్డు నాకు ఉండుటవల్ల నేను చాలా గొప్పతరగతిలో చేరిన దానినని పరిగణింపబడెదను.

గడచిన ఒకటి రెండు సంవత్సరములకంటె, ఇప్పుడు మా బ్రతుకు తెరువు చాలా బాగా ఉండినప్పటికీ, 1932-33 సంవత్సర శీతకాలంలో రష్యాలోని ప్రజలు అత్యధిక సంఖ్యాకులు అమితమైన దురవస్థలపాలైరి. కార్మికులకు వారి రేషను కార్డు ప్రకారంగా వారికి యివ్వబడే మాంసంగాని, వెన్నగాని చాలా తక్కువ. కాని, అదికూడా యిప్పుడు తరచుగా వారికి లభించుటలేదు. రష్యను ప్రజలలో విశేషభాగం నల్లని రొట్టె, జొన్నలు, తక్కువరకపు గోధుమలు తిని జీవించుచున్నారు.

ఆ సంవత్సరం శీతకాలములో లాభసాటి వ్యాపారంచేసే షాపులు కొన్ని మాస్కోనగరంలో వెలసినవి. ఇవి ప్రభుత్వపు షాపులే. ఇక్కడ మాంసం, వెన్న, కోడిగ్రుడ్లు, కాయగూరలు, దుస్తువస్త్రములు, లభిస్తాయి. కాని రేషన్ప్రకారంగా చెల్లించే కిమ్మతుకు అధమపక్షం పదిరెట్లు ఎక్కువగానైనను చెల్లించి గొప్పవాళ్లు కొనుక్కుంటారు.

ఈ వ్యాపారసరళి షాపులలో చాలామంది కొనుక్కోలేరు. వారి జీతబత్తెములు స్వల్పము. అంత హెచ్చుధరలు వారు చెల్లించలేరు. గొప్పవాళ్లకున్నూ, దారిద్ర్యపీడితులైన కొద్దివాళ్లకున్నూ జీవిత విధానంలో తారతమ్య వ్యత్యాసం అంతకంతకు విస్తరించుచున్నది.

1921 సం॥ కరవులో ప్రజాబాహుళ్యము ఎంతకష్టమనుభవించెనో ఈ 1932-33 సం॥ శీతకాలములోకూడా అంతకష్టమనుభవించినది. సోవియటురష్యను ప్రభుత్వము రష్యా భవిష్యదభ్యుదయపథకములను బ్రహ్మాండముగ తయారుచేయుచున్న కాలదీ "రష్యను పారిశ్రామికాభివృద్ధి విజయము" కొండంతగా కొనియాడబడు

(9-వ పేజీ చూడుడు)

గవర్నరు భావనగర్ మహారాజా ఈ మధ్య కొవ్వూరులోని ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠమును సందర్శించినప్పటి దృశ్యం. పీఠం ప్రధానాచార్యుడు కె. వెం. నృ. అప్పారావు, మాగంటి బాపినీడు, ప. గో. జి. కలెక్టరుగార్లు కూడ ఇందు కలరు.

# నా చిన్నప్పుడు

## సర్దార్ వల్లభాయ్ పటేలు

మానవుడు యెంతవరకు తనలో శైశవానందాన్ని నిల్వరించుకోగలుగుతాడో, అంతవరకే అతని జీవితాన్ని చీకట్లు ఆవరించకుండా వుంటాయి. ఈ చీకటి తలపులు ఆవేశించగా నేముఖం కావులేసి ముడతలుబడి వ్రూరుకుంటుంది. నిరంతర దురాశాదురాలోచనలలో మునిగి కావులేసి వుండే ముఖంకంటే మరో చిరాకు వస్తువు యీ ప్రపంచంలోలేదు" అని సర్దారు వల్లభాయిపటేలు "శంకర్సు" వీక్లీ అనే ఢిల్లీ వారపత్రిక పిల్లల ప్రత్యేక సంచికకు వ్రాసిన ఒక వ్యాసంలో ఉల్లేఖించారు.

"క్రొత్తపాతల అసహజసంయోగాలతో వికారంగా వుండే ఈ నగరమధ్యంలో కూర్చుని, మనస్సు ఒక్కసారి హఠాత్తుగా 60 సంవత్సరాలు వెనుకకు తూలించి, బాల్యస్మృతులను స్ఫురణకు తెచ్చుకోగలగటమంటే అసాధ్యమైన కార్యం.

"సంతానంలో పుడితే పెద్దవాడుగా పుట్టాలి లేదా కడసారివాడుగా పుట్టాలి. తల్లిదండ్రుల ఆశలన్నీ పెద్దబిడ్డమీద వుంటై. తల్లిదండ్రుల మమకారమంతా కడసారి బిడ్డమీదవుంటై. మిగతా తమ్ముళ్ళనూ, చెల్లెళ్ళనూ శాసించే సావకాశం పెద్దవాడికుంటుంది. కడసారి వాడికి యీ పెద్దవాళ్ళ శాసనాలన్నీ భరించవలసిన బాధవున్నా, యేదో దురదృష్టవంతుడైతే తప్ప, ఈ తక్కిన పెద్దవాళ్ళందరి ప్రేమాభిమానాలూ గుంజుకోవటానికి సావకాశం వుంటుంది. నేను యీ రెండు సావకాశాలలో దేన్నీ పొందినవాణ్నిగాను. నేను మధ్యమ సంతానం, అందుచేత మధ్యమ సంతానానికి వుండే సాధారణ స్వాతంత్ర్యమూ, స్వశక్తిని ఆధారంగా తీసుకుని ముందుకు పోవటానికి ప్రయత్నించటమూ—ఈ అవకాశాలు లభించినై. అలా పెరిగిన కారణంగా అవసరంవచ్చినప్పుడు నా స్వబుద్ధిని నేను ఉపయోగించుకోగలిగాను. నేను పెద్దబిడ్డ యొక్క బాధ్యతలను మోసినవాణ్ణిగాను. అభిమాన వాత్సల్యాల ఒరవుకింద కడసారి వాడుగా నడుంవంగి క్రుంగిపోయినవాణ్ణి కాను.

"శిశువులోవుండే మహత్తర శక్తులన్నీ బయటికి పెంపొందటానికి నగరవాతావరణం అనువైందికాదు. బిడ్డచుట్టూ అనేక కృత్రిమమైన నిరోధాలు కల్పించి స్వేచ్ఛాభివృద్ధిని అరికడుతుంది. మరిపుణ్యమునన్ను గాకరుడు గట్టించి, ఒకచుంచి తౌహాలో బంధించి 'సుడిగుడిసుంచం' తిరిగించుతుంది. గ్రామీణ జీవంయొక్క బహిరంగమైదానం మీద బిడ్డకు విస్తృతమైన అనంతపథ ద్వక్పథం యేర్పడటానికి సావకాశం వుంటుంది. చుట్టూవున్న ప్రజలతో యెంత సరిసమాన భావాన్ని పొందగలుగుతాడో శిశువు అంత అభివృద్ధికి రావటానికి వీలుంటుంది. నలుగురితోపాటు జీవితంలోని వ్యగ్రనిష్ఠురతకూడా అతనికి అర్థంకావటానికి సావకాశం వుంటుంది. నలుగురు బిడ్డలతోపాటు వీధిదుమ్ములో పొరలాడతాడు. ఇతరులు తన్ను దుమ్ములో పడద్రోయటం, ఇతరులను తను పడద్రోయటం ఈ అనుభవమంతా కలుగుతుంది. సమాన ఛాయలో యీ 'ఇచ్చిపుచ్చుకోవటాల' వాతావరణంలో పెరగటంతో, జీవితంలో అచంచలుడుగా నిలబడగలగటం మనోనిబ్బరం తెంపూ, కార్యోత్సాహం, యీ బలతేజాలన్నీ కలుగుతవి. మొరటు చరిచియేపనైనా చేయగలగటం కష్టదినాలు అడ్డుతగిల్తే దించుకుపోకుండా నవ్వుతూ బ్రతకగలగటం నేర్పుతుంటాడు. నేను అలాంటి గ్రామీణ వాతావరణంలోనే పెరిగాను.

పెద్దవాళ్ళకన్ను గప్పటంలోగాని, అల్లరిలోగాని, నాకు జ్ఞప్తివున్నంతవరకూ, నేనేకు గ్రాడికి తీసిపోయేవాణ్ణి గాను. అయితే మంచికార్యాలలోనే, అంటే నా మెదడుకుమంచివనితోచిన కార్యాల్లోనే, నా శక్తిసామర్థ్యాలన్నీ ఉపయోగించుతూ వుండేవాణ్ణి.

నిర్లక్ష్యంగా ప్రవర్తించే ఉపాధ్యాయుడంటే నాకు మహా చిరాకుగా వుండేది. సోమారిపోతు ఉపాధ్యాయుడైతే యెప్పుడూ వూరుకుండేవాళ్ళం కాము. ఉపాధ్యాయులను త్రోవకి తేవటానికి పిల్లలు అనుసరించే మార్గాలు పిల్లలకు వుంటై. దీల్లో ఎన్నెన్నో రకాల యుద్ధతంత్రాలు యోజించేవాళ్లం.

ఓసారి పంతులుగారు ఆలస్యంగా బళ్ళోకి వచ్చారు. ఆలస్యంగా వచ్చినందుకు ఆయన్ను జేళాకోళం పట్టించమని నేను పిల్లలనందర్నీ రెచ్చగొట్టాను. పంతులుగారికి దాంతో కోపంవచ్చింది. దీనికి శిక్షక్రింద పంతులుగారు నాకు కొంత అదనంగా పనియిచ్చి తెల్లారికి చేసుకురమ్మన్నారు. మర్నాడు ఆపని పూర్తిచెయ్యకుండానే బళ్లోకి వెళ్లాను. ఆ నేరానికి శిక్షక్రింద అంతకు రెట్టింపు పనిచేసుకు రమ్మన్నారు. రోజురోజూ నేను పని చేసుకురాకుండానే బళ్ళోకివెళ్లడం ఆయన ఆపని రెట్టింపులక్రింద పెంచుతూ వుండటం ఇలా చాలారోజులు జరిగింది. చివరికి యెందాకా వెళ్లిందంటే ఆ లెక్కలు 200 సార్లు చేయవలసినదాకా దేకింది. ఆ వేళ నేనేమి జేళానంటే—పలకమీద '200' అనే అంకెవేసి, అమాయకుడులాగా తీసుకువెళ్లి పంతులుగారికి చూపించాను. 'ఏది పదాలు?' - అన్నారాయన ("పదాలు" అంటే గుజరాతీభాషలో లెక్కలకూ, దున్నపోతులకూకూడా అర్థం) 'పదాలు పారిపోయేలోగా యింతవరకే వ్రాయగలిగానండీ' అని సమాధానం చెప్పాను. పంతులుగారు మండిపోయారు, నన్ను ప్రధానోపాధ్యాయులవద్దకు పంపారు. వారు నన్ను కేకలువేయటానికి మారుగా, 'పిల్లలకు ఎలా పనియిచ్చి చేయించాలో తెలియదేం?' అని పంతులుగార్నే చివాట్లుపెట్టారు.

'మానవుడు యేరీతిగా పెంపొందేదీ శైశవ దశమీదనే ఆధారపడి వుంటుందంటారు. నాకు ఈ నాడుగల మంచి చెడు

(9 వ పేజీ చూడుడు)

గవర్నర్ భావనగర్ మహారాజాగారు ఇటీవల గుంటూరు వచ్చి, ఆజిల్లా ఎంప్లాయిమెంటు ఆఫీసు సందర్శించినప్పటి దృశ్యం. పి. వి. కృష్ణయ్యచౌదరి, జిల్లా కలెక్టరు ఎం. కనకసుందరం, జి. ఎం. ఆఫీసరు కాప్టెన్ కె. వి. ఆర్. చౌదరి, గవర్నరు, డాక్టర్ వీరయ్యచౌదరి, సబ్ రీజియనల్ ఎంప్లాయిమెంట్ ఆఫీసరు పి. పీరాస్వామి, జిల్లాజడ్జి నాడార్, జి. పో. సూపరింటెండెంటు కల్యాణరావుగార్లు వరుసగా నిలబడి ఉన్నారు.

భారత రిపబ్లిక్ అధ్యక్షుని ప్రత్యేక కేతనం

# స్వర్గానికి నిచ్చెనలు

## కవిసమ్రాట్: శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

### 32

అప్పట్టున వెళ్ళిపోయిన వామదేవుడు మరల రాలేదు. రామశాస్త్రియింటి వద్ద పూజలు పురస్కారములు జరుగుచున్నవని తెలియవచ్చెను. అచ్చట మహోత్సవములు జరుగుచున్నవి. కామాక్షియు రామశాస్త్రియు నిత్యోపవాసములు పెద్ద హోమములు రోజునకు నాల్గయిదు వందల రూకలవ్యయము తప్పుటలేదు. అది మండలము దినముల ప్రక్రియా కొండెనుట. పాతికముప్పది వేలయినగాని హోమాది క్రియ ఆసాంతము నెరవేరదు. రామశాస్త్రియొక్క యాస్తి యిదివరకే చేతులు మారయినది. ఒకనాడు వామదేవుడు ఇరువదియేడవదినమున పెద్ద హోమము చేయవలయుననియు మరల ముప్పదియవదినమున నంతటి హోమమును జరుగవలయుననియు మొదటిహోమమునకు మొదటి కూతురును, రెండవహోమమునకు రెండవ కూతురును రావలయునని చెప్పెను. పుత్రులు లేనిసందర్భములో తండ్రియాస్తి మీద దౌహిత్రుల యాత్మలకు వాళ యుండును. ఆ కూతుండ్రు వచ్చి యీ హోమములయందు బాల్గొన్నగాని వారి యాశలు నివర్తింపబడవు. అరీతిగా నా ప్రతిబంధకమును తొలగింపవలయును. రామశాస్త్రి వల్లె యనెను. పెద్దయల్లునకు వ్రాసెను. భార్యాభర్తల నిరువురను గలిసి రమ్మని. రామపోను వ్యయము పెట్టుకొనినగాని యతడు వచ్చెడువాడు గాడు. రామశాస్త్రి కా సంగతి తెలియును. అందుచేత నతడు డబ్బు పంపించెను. పెద్ద కుమార్తె వచ్చెను. నరసింహము రాలేదు. తన ప్రయాణపుఖర్చు నరసింహము దాచుకొనెను. పెద్ద కూతురి పేరు లావణ్యవతి. ఆమె యానాకొడో తెలియదుగాని నిరాభరణసుందరిమాత్రము కీ నిక్కముగా నగును. నరసింహ మామెశరీరమునందు గ్రుడ్డిగవ్వ విలువగల వస్తువు నేనియునుండనీయలేదు. తొడిగిపెట్టిన నగలుగూడ తానే యొలుచుకొనెను. లావణ్యవతి నలుగురు పిల్లలను తీసుకొని మాసిపోయినపు ముతైదువవలె పాకిటిలో దిగెను. ఆమెను జూచి వామదేవుడు నిస్పృహ పొందెను. ఆ హోమము జరుగుటకు నాల్గుదినము లున్నది. ఆ హోమప్రక్రియ సులభముగా గడచిపోయెను. ఆనాడు సాయంతనమే లావణ్యవతిని పంపించివేయవలయునట. ఆమె వెడలిపోయెను. మరిమూడు దినములకు రెండవ హోమ మున్నది. ఆకూతురింకను రాలేదు. ఇంటిలోనికి గావలసిన సంభారములకొరకు రామశాస్త్రి చీట్లు వ్రాసిపంపించును. వచ్చినచో సంభారములు సగానికి సగము వచ్చును. రానిచో చీట్లు తిరుగగొట్టబడును. ఒక రెండు వేలరూపాయలు నాడు కావలయును. అన్నిమార్గములును నిష్ప్రయోజనములని తెలిసి, రామశాస్త్రి తాను కాగితము వ్రాసియిచ్చును. వసుంధర యప్పిచ్చువేమో? కనుగొనవలయు ననెను. వామదేవుడు వార్తనంపెను. సమాధానము రాలేదు. కళాధరుడు వెళ్ళెను. వసుంధర దేవతాధనము నిచ్చుటకు వీలులేదనెను. కళాధరునకు కోపమువచ్చెను! "ఇది వామదేవుడడిగినమాట. వామదేవుడెవరో నీకు దెలియునుగదా? నీకు బ్రతుకుట కిష్టమున్నచో డబ్బిచ్చి బ్రతుకుమనెను." కళాధరుడు వసుంధరతో బూర్వ మెప్పుడు నిట్లు మాట్లాడలేదు. వసుంధరకు గోపమువచ్చెను. కళాధరుని తన యెదుటనుండి వెడలిపొమ్మనెను. అతడు కోపముతో రుసరుసలాడుచు వెడలిపోయెను.

మరునాడు సాయంతనము రెండవ కుమార్తెవచ్చెను. ఆమె పేరు శ్రీదేవి. నిజానికామెకంటె లావణ్యవతియే యందకత్తియ. ఆమెను గోపాలము పెళ్ళవద్దనెను. ఆమెకు గోపమువచ్చెను. గోపాలము చివరి కంగీకరించెను. చివరికామె యంతటనామె పెండ్లి బయలుదేరివచ్చెను. శివునియంతటివానికి దిక్కులేదు. దక్షునియజ్ఞమునకు బోవలదని యాయన యెంత బతిమాలుకొనినను సతీదేవి యూరకున్నదా? శ్రీదేవియు వచ్చినది. శ్రీదేవికి బిల్లలు లేరు. భార్య నొక్కర్తెను పంపించుటకు గోపాలున కిష్టము లేదు. ఆమె పట్టినపట్టు వదలకపోవుటచేత గోపాలము నీచావు నీవుచావుమని పంపించెను. నీ వొంటరిగా బోవుచున్నావు.' ఇన్నినగ లెందుకని భర్త చెప్పెను. ఆమె పుట్టినింటికి బోవుచు లేనివానివలె నేల పోవలయునని తనకున్న నగ కట్టంతయు బెట్టుకొనియే వచ్చెను. ఆనాడు హోమము జరిగెను. జగత్ప్రియముగా జరిగెను. ఎందుచే తెచ్చటనుండి వచ్చెనో తెలియలేదు. శ్రీదేవి యానాడు సాయంతనమే వెళ్ళవలయును. రైలు తెల్లవారకడ మూడుగంటలకుగాని లేదు. ఇంటిలో నొకనియమ మున్నది. ఆమె వెడలిపోవునపుడు తల్లిదండ్రులతో జెప్పిపోరాదు.

మరునాడు తెల్లవారినది. మరల హోమము జరుగుచుండెను. ఊరంతయు నేమియు జరుగనట్లే యుండెను.

రామశాస్త్రికి నిద్దరుమనుమలు బంధువులున్నారు. అతని మేనమామకొడుకు ఉన్నది. వారు సంపన్నగృహస్థులు. భార్యయు భర్తయు సంతానముకొరకు రామేశ్వరము పోయివచ్చిరి. ఈ హోమసమయమునందు వారిచ్చటికి జేరిరి. ఆనాడు భోజనముచేసి పండుకొనెను. ఆ భర్తవద్ద రెండువేల రూకలుండెను. వాని నతడు తలక్రింద బెట్టుకొని పండుకొనెను. అతని భార్యశరీరమునకు రెండువేలనగకట్టుండెను. వారు పండుకొనిరి. తెల్లవారువరకు గనిపించలేదు. తనతో జెప్పకుండ వెళ్ళినారని మరునాడు రామశాస్త్రికి గోపము వచ్చెను.

రామశాస్త్రియు మీనాక్షియు దీక్షితులగుటచేత వంట మొదలయిన యే పనులను వారు చేయుటకు వీలులేదు. వంటచేయుటకొక వృద్ధురాలిని నియమించిరి. ఆమె వృద్ధురాలును గాదు. ఆమె యెచ్చటనుండి వచ్చెనో తెలియదు. ఇంటిలోని పెత్తనమంతయు నీలది, నిర్మలది. వారిద్దరు రాజహంసలవలె గునగుననడచుచు కామోద్దీపకములయిన వేషములతో, నవ్వులతో, నాట్యాసారములతో, విలాసములతో, సంచరించుచుందురు. వీరితోబాటు శారద వచ్చెను. రాధకొంచెము తోడు. ఈ నలువురు గ్రామమునకే కన్నెఆగా నుండిరి. నాస్తికసంఘమువారు వీరికొరకు కొన్నియోయొదుపులు వేసిరి. కాని లాభము లేకపోయెను.

ఈ హోమము లారంభించిననాట నుండియు నాస్తికసంఘముయొక్క కోపము పెల్లుబేగిపోయెను. వారి హృదయములలో నగ్నిపర్వతములు చెలరేగెను. వామదేవుడు గొప్ప మోసగాడు, దొంగ. వాడు రామశాస్త్రిగారిని గుల్లచేయుచున్నాడు మొదలయిన ప్రచారమును వారు లేవదీసిరి. ఒకనాటిరాత్రి పదిమంది కఱ్ఱలు తీసికొని రామశాస్త్రియింటిమీదికి వచ్చిరి. తలుపు ఘటఘట వాయించిరి. ఇంటిలో నున్న యందరును భయపడిపోయిరి. వామదేవుడు పోయి తలుపు దీసెను. వామదేవునిగ్జూచి వారందరు నిలుచుండిరి. వామదేవుడు వారందరవంక జూచెను. వామదేవుని కన్నులలో నెత్తురులు చిమ్ముగ్రోవిపెట్టి చిమ్ముచుండెను. అయిదు నిముసము లట్లు నిలుచున్నతరువాత వామదేవుడు పండ్లు బిగించి "ఊ" యనెను. అని లోనికి బోయి తలుపువేసికొనెను. వారందరు మాటాడకుండ వెడలిపోయిరి. మరునాడు వారందరు సమావేశమయి "నీకు ధైర్యముచాలలేదనిన నీకు ధైర్యము చాలలేదని" యొకరి నొకరు నిందించుకొనిరి. ఈ సంగతి యూరునందంతయు దెలిసెను. ఆ పదిమంది యువకులు, వారివలన నూరిలో మిక్కిలి బాధగా నుండెను. స్త్రీలు బయటకు బోవుటకు వీలులేదు. పురుషులు యథేచ్ఛముగా దిరుగుటకు వీలులేదు. వారెవరినిపడినవారిని లెంపకాయలు కొట్టుదురు. వారి చేలకు నెగువనున్న చేలకు నీళ్లు రాకముందే వారి చేలకు రావలయును. వారు బోటకడ్డము కట్టినచో వారే తీసివేయవలయును. తక్కిన వర్ణములవారు వారిని, వారు యథేచ్ఛముగా దిట్టుదురు. ఆ తిట్లు తరతరాలు దాటిపోవును. సంసారస్త్రీలు సంసారిణులుగా నుండుటకు వీలులేదు. వారిమీద నభియోగము తెచ్చుటకు వీలులేదు. ఎవ్వడును సాక్ష్యము చెప్పరు. చెప్పినచో మరునాడు వాని కొంపయొక్క గోడగడ్డలుకూడ నిలువవు. వారాయూరికి ప్రభువులు. ఈ ప్రభువులు వామదేవుని హుంకారముముందు నిలువలేకపోవుటచేత మరునాడూరికెల్ల లోకువ యయ్యెను. గ్రామములో జాలమంది రామశాస్త్రియింటికి బోవుటలేదు. ఆ మూడవ దినమున గ్రామములోని స్త్రీలందరు పురుషులందరు రామశాస్త్రియింటికి వెళ్ళిరి. హోమసమయములందు గూర్చుండిరి. కళాధరుడు స్వామిని దర్శించి యూరకే పోరాదనెను. స్త్రీలు కానుక లిచ్చిరి. నాటి కయిదువందల రూకలు వచ్చెను. పిండి కొలది రొట్టెయన్నట్లు రామశాస్త్రి శక్తి యుడిగినకొలది హోమములయొక్క వ్యయము తగ్గుచుండెను. కళాధరునితో వామదేవుడు మీయయిదువందల యయిదుదినములు రావలయు ననెను. కళాధరుడు దాధనము మాట యేమి యని యడిగెను. వామదేవుడు గ్రుడ్డురిమి చూచెను. ఏ ఘనమో తెలియదు. కళాధరుడు దూరకుండెను. కళాధరుడు భయపడెను. ఎందు కడిగితినా? యనుకొనెను. శిష్యులందే లేకమయిన దోషమును గురువు మన్నించదు. ఆ నాటి రాత్రి కళాధరునకు శిక్ష జరిగెను. కళాధరుడును, నీలయు, వామదేవుడును మువ్వురేకాంతముగా నొక గదిలో నుండిరి. వామదేవుడును నీలయు నొకరినొకరు రాలింగన చుంబనాదులతో క్రీడించిరి. కళాధరుడు తానచట నిలుచుండి చూడవలయును. కళాధరున కీసంగతి తెలిసినను నాస్తికసంఘముయొక్క శిక్ష, అతడు మాటాడుటకు వీలులేదు. అది గురుద్రోహము. గురువు శిష్యుని తన యిష్టమువచ్చినట్లు శిక్షించును.

మరునాడు నాస్తికసంఘమువారు తమ పేరు మార్చుకొని యాస్తికసంఘ మని పెట్టుకొనిరి. ఆస్తికసంఘమన్న పేరు వచ్చినప్పటినుండి వారికి గ్రామములో గౌరవము కలిగెను.

### 33

లోకములో దౌర్భాగ్య మొకపద్ధతిగా నుండదు. కొందరు దుష్టులు తమకంటె నధికులయందు నీచులై, దీనులై దాసులై ప్రవర్తించి తమకు లోబడినవారిమీద దురధికారము చేయుదురు. కద్రువ వినతమీద నధికారము చేసెను. ఆ వినతను వంచించెను. ఆమెను వంచించుటకు దన కడుపున బుట్టిన సంతానమునకు గాళ్ళ ప్రేళ్ళ బడెను. తన దుస్స్వభావము కొడుకులకు దలియునని యైన సిగుపాటు లేదు. పై యధికారులవద్ద జేతులు జోడించుకొని నిలుచుండి వారి చెప్పులు మోసి 'యూరువేళ్ల మ్రోయనసు నగారా మ్రోతవలె' నటించితనక్రిందివారివలన సంప్రాప్తించినయధికారమును దనక్రిందివారి మీద నెప్పుటలో వాడు విష్ణుమూర్తియో బ్రహ్మయో వలె ప్రవర్తించును. ఈ లోకము మీ లోకమువలె నుండుటకు నీతాదృశులే కారణము. బ్రహ్మదేవుడు తొలుత వీరిని సృజించి యనంతరమున సత్పురుషులను సృజించెను. బ్రహ్మకు సత్పురుషులమీద నమ్మకము లేదు. వారు నందియుండి యెప్పుడో తన సృష్టికి స్వస్తి చెప్పుదురని యాయనకు దలియును. అందుచేతనే దుర్జనుల నెక్కువమందిని సృష్టించెను. కళాధరుడెంత నీచుడో, యంతటి దురధికారి, అతని చేతిలో నధికారము లేదు. అధికారము చేయుటకు నధికార ముండ నక్కరలేదు.' ఈ పెత్తనము నీ కెవరిచ్చిరిరా' యనగా 'నా మూల నుండగా పెత్తన వేసికొంటి' నని చెప్పినాడట, దేశనాయకు లందరు నిట్టివారే. వీలు కుదిరినచో దేశనాయకుడు. లేనిచో దేశభక్తుడు.

కళాధరుడు వసుంధరమీద గోపించెను. వామదేవుడు డబ్బుకొరకు బంపించగా దనయెత్తెంత! తానెంత? లేదని చెప్పునా? నాల్గయిదుదినములుగా కళాధరునిలో నొక క్రౌర్యము బయలుదేరెను. అదివరకతడు పట్టి పులి. ఇప్పుడునువ్వు మాంసమురుచి యెరిగినపులి. క్రూరజంతువు సహజముగా భయము కలది. మనుష్యుని జంపవలెనని చూచుచుండును. అప్పుడు దాని కనులలో గ్రౌర్యమును భయమును రెండును గోచరించుచుండును. ఒకసారి మనుష్యుని తిన్నతరువాత భయముపోయి యచ్ఛముగా గ్రౌర్యమే భాసించును. కళాధరుడిప్పుడట్లుండెను. నిజముగా వాడు తన క్రౌర్యమును ప్రత్యపకార నిర్వహణమును నెఱపవలసినచో వామదేవుడు స్థానము. ఆ వామదేవునిమీదికి వానికోపముగాని వాని ప్రతీకారబుద్ధి గాని పోక వసుంధరమీదికి కేల పోవలయును?

అతడానాడు వసుంధరయింటికి బోయెను. వసుంధర పాకలో బురాణము వినుచుండెను. అతడు వసుంధర గదిలో బ్రవేశించెను. గవాక్షపు తలుపున కొక సన్నని దారము కట్టి యది కనపడకుండ మంచముక్రిందనుండి తీసి యా గదిలో నైరృతిమూల నున్న బీరువావెనక దాను గుప్తముగా నుండి యా దారము తాను లాగగా గవాక్షపు తలుపు తెరచుకొనునట్లు రెండుమూడుసార్లు పరీక్షించి తాను బీరువావెనుక నిలుచుండుటకు దన మాట వసుంధరకు వినబడుటకు నట్లు గా దని యిట్లు, ఇట్లు గా దని యట్లు పదిపద్ధలుములు మార్చి మార్చి చివరకు నిర్ణయించి దారము చేతబూని ప్రతీక్షించుచు నిలుచుండెను. ఒకానొక కంఠస్వరమును వాడు చాలరోజులుగా నభ్యాసము చేసియుండెను. అతడు కొంతసేపు ప్రతీక్షించిన తర్వాత చావడిలో కాలి చప్పుడు వినిపించెను. అతడు స్వస్థుడై నిలుచుండెను. ఆకాలిచప్పుడు గదిలోనికి బ్రవేశించెను. వెంటనే యితడు దారమును లాగెను. గవాక్షపు తలుపు పెద్దమ్రోతతో తెరచుకొనెను. కాని దారము తెగిపోయెను. తెగిపోవుట యతని కష్టమతే. మిగిలిన దారము నతడు మెల్లగ్గదికా చేతిలోనికి లాగికొనెను. వసుంధర మాటాడకగా నిలబడిపోయెను. ఈ మనస్య నామె పిశాచము రాక యెరుగదు. ఒకనాడు గవాక్షము తలుపు దభేలున పడెను. ఆమె పరీక్షించెనుగాని యేమియు గనిపించలేదు. ఆమెయు నతనికొరకు ప్రతీక్షించుచుండెను. ప్రతీక్షాదోషముచేత బాహ్యశక్తి నశించెను.

"మరల నెందుకు వచ్చితివి?"

"రెంటికిం జెడిన రేవడవు కాకుము. నన్ను కాదంటివి. వామదేవుని వదలిపెట్టకుము."

"వామదేవుడు సత్పురుషుడు కాడు."

సమాధానము లేదు. కళాధరుడు మరి యొక మాట మాటాడలేదు. ప్రతీక్షావ్యగ్రమయిన వసుంధరమనస్సు వినబడిన ధ్వని యొక్క స్వరూపలక్షణాదులు పరిశీలించుట కెడ మీయలేదు. కళాధరుడు గవాక్షపుతలుపు మూయుటకు సమర్థుడు కాడు. మూసినచో భర్తృపిశాచము వెళ్లిపోయినదని యామె యటునిటు వెదుకదు. ఇప్పుడు వెదకునేమో? కాని యెచ్చటనుండి వచ్చినదో దివ్యమగు గాలి వచ్చి 'హూం' యని లోనికి బోవసికొని వెంటనే గవాక్షపు తలుపు మరల మూసికొనెను. కళాధరుడు ప్రశ్రేయనిశ్వాసమును వదలిపెట్టెను. భగవంతుడు దుర్జనుల కుపయోగించినంత సజ్జనుల కుపయోగపడడు. దుష్కార్యములు సులభముగా ఫలించును. సృష్టిలోని మాయయంతయు దుష్కార్యాభిముఖముగా బ్రవర్తించును. సృష్టి ప్రకృతి ప్రాచుర్యము. తదన్యస్తమయిన పరమేశ్వర భావము స్పష్టాస్పష్టము. మాయ బలవతి. ఇహలోకము మాయది. పరలోకమీశ్వరునిది. సత్పురుషునివి పారలౌకిక ప్రయత్నములు. అచ్చట నతనికి బంట పండును. ఆ పంట యప్రత్యక్షము. దుర్జనుని పంట లోకము. ఇది సుప్రత్యక్షము. కళాధరుడా బీరువావెనకనుండి తప్పించుకొనిపోవుటకు నించుమించుగా బ్రొద్దు క్రుంకెడువరకు నాగవలసివచ్చెను. కదలరాదు మెదలరాదు. సాయంకాలము మరల గురుదర్శనము చేయువేళకు వాని సంధిబంధములునరనరమునకుబాధాజనకములుగా నుండెను. వేన్నీళ్ల కాపు పెట్టించుటకు గూడ వీలులేదు. నీల వానిని లెక్కచేయుట మానివేసి నెలలు గడచినవి.

మరునాడు ప్రొద్దున కళాధరుడు వసుంధరవద్దకు బోయెను. ఆమె 'మరల నేటికి వచ్చితి' వనెను: "గురువుగారు మరల బంపించిరి. వసుంధరా! నా మాట వినక చెడిపోవుచున్నావు. బ్రహ్మరుద్రాదులు నా మాట నధఃకరించలేరు. త్రిలోకాధిపతి యయాల్యాణారుడు కూడ వామదేవుడు గీచిన గీత దాటడు. రెండువేల రూకలు తక్షణమే కావలయును. వెంటనే పంపింపుము. ఇతరులను బెదరించినట్లు నిన్ను బెదరించను. నీవు నా స్నేహితుని సోదరివి. అందుచేత నిన్నెన్నివిధములుగా గౌరవించుచుంటినో నీకు దలియును. నా ప్రవర్తనను గూర్చి నీ కనుమానపడవచ్చును. మేము మహాత్ములము. చిక్కశాక్తేతులము. మేము కర్మను దగ్ధము చేయుదుము. మాకు బాపము లంటవు. కావలసినచో మార్కండేయపురాణము చదువుము. యోగు లెట్లు ప్రవర్తించినను, నేమి చేసినను వారికేనస్పర్శము లేదు. సామాన్యులకు బట్టెడు నీతిసూత్రములు మాకు బట్టించి మమ్మునీతిబాహ్యులనుకొనరాదు. "లోకమ్ములు లోకేశులు, లోకస్థులు తెగిన తుదిన లోకం బగు పెంజీకటి కవ్వల నుండెడు నేకాకృతి" మాది. నేను రెండు వేలు చాల యవసరము. కైలాసమువద్ద నున్న మానససరస్సీరమున నేటి రాత్రి దేవతల సమావేశము జరుగును. దానికి మేము పోవలయును. ప్రపంచకమంతయు సమర్మభూయిష్ఠమయియున్నది. మానవ ప్రపంచసంగ్రామము జరుగకుండ దేవతలు, ఋషులును కూడి ప్రకృతిలో నున్న కొన్ని దుష్టశక్తులను మార్చుటకు సంకల్పించినారు. నేను పోకపోయినచో నేటి దేవతాపరిషత్తు వ్యర్థమగును. కొన్ని ప్రకృతిలోని దుష్టశక్తులమీద నా కధికార మున్నది. నీ విచ్చెడు ధనము జగత్కల్యాణహేతువు కగును. దేవునకీగా నీవు పెట్టిన పీఠము కాదు. జగత్కల్యాణమే పరమేశ్వర రూపము" అని కళాధరుడు దూరకుండెను. తరువాత వసుంధర యరగంటసేపు మాటాడలేదు. కళాధరుడు మూగవాడయి నచటే నిలుచుండెను. అతనినీతి వసుంధరను దాటిపోయినది. ఆమె చివరకులేచి రెండువేలరూకలుతీసి కళాధరునకిచ్చెను. కళాధరుడామె కొగితములు తన చేతిలో బెట్టునపుడు కాగితములు తాను తీసికొన్నట్లు నటించుచు నామె చేయి పట్టుకొనెను. పట్టినపట్టు వదలలేదు. వసుంధర నిర్వ్యరబోయెను. ఆ నిర్వ్యరబోవుట కళాధరుడంగీకారసూచకముగా దలంచి రెండవ చేయి యామె బుజముమీద వేసెను. ఆమె కొడలు జలదరించెను. ఇతడింత సాహసింప డని యనుకొనిన వసుంధరయొక్క నిర్వ్యరపడిరెప్పపాట్ల కాలములో విశ్లథమై యామె సహజస్థితి బొందెను. ఆమె చేయి లాగికొని దూరముగా బోయి యుగమూర్తి యయ్యెను. కళాధరుడాపాటున వెడలిపోయినను సత్పురుషుడే. అతడెందుకు బోవును? అతడిట్లనెను. 'వసుంధరా! చక్కని యౌవనమును వృథా చేసుకొనుచున్నావు. ఆ యుమాకాంతుడు దాదంగికేకలవాడు. వాడొక తృతీయాప్రకృతి. వాడు మువ్వురు భార్యలతో ముండమోసినాడు. నీకున్న యిద్దరు భర్తలును దయ్యములే. చచ్చి భర్త దయ్యమైనిన్ను మాకాంతునకు గాకుండ జేసెను. ఉమాకాంతునకు నీవు గావు. నిర్మల చిన్నతాటక, అది నిన్నెప్పుడో మ్రింగును. నీవు యోగినివి కావు. ఇది యొక పెద్ద లోకప్రతారణము. నీ రహస్యము నా చేతిలో నున్నది. నీ సీతమున కిదివరకే తగినంత యప్రతిష్ఠ గలదు. నేను తలచుకొన్నచో నీపైను కడిగిపోనీదను. అన్నిపత్రికలలో నీ సంగతియే వ్రాసెదను. నీ దేవతానిలయము కొనసాగవలసినచో నన్నంగీకరింపుము. గొంగడిలో భోజనముచేయుచు వెండ్రుకలు లెక్కపెట్టికొనుట యెందులకు? వామదేవుని సంగతి నాకు దెలియదా? నిన్ను వదలిపెట్టె నని నే ననుకొను. నా మాట నల్లై యుంచుము. ఊరిలో నెవ్వరు నను కొనుటలేదు'అని వసుంధరను సమీపింపబోయెను. ఆమె కొంచెము బెదరెను. తాను నిజముగా నొక కృత్రిమవ్యూహమున జిక్కుకొనెను. అరచినచో దన మర్యాదను నష్టము. ధైర్య మవలంబించి వీనికి శిక్ష సేయవలయును. అటునిటు జూడగా నొకమూల కొబ్బరికాయలు కొట్టు నినుపగుదియ కనిపించినది. దానిని జేతులలో దీసికొని రమ్మనెను. కళాధరుడు వసుంధరచేయి పట్టుకొని యామె కొట్టుటకు వీలులేకుండ జేసి బలవంతపెట్టనెంచెను. కాని యింకొక మార్గము ద్రొక్కెను. 'చెప్పుచున్నాను విను. నిన్ను వశముచేసికొనుట పెద్దపని కాదు. దేవతానిలయపు లెక్కలన్నియు నా చేతిలో నున్నవి. లక్షరూపాయలాదాయపుపన్ను వేయించెదను. మరియు వినుము నిన్నురికంబ మెక్కించెదను. కళాధరుడనగ నేమి యనుకొంటివో? నిన్న ప్రొద్దున నీతో మాటాడినది భర్తృపిశాచము కాదు. కళాధరుడు, గవాక్షపు తలుపునకు దారముకట్టి లాగితిని. అది తెగిపోయినది. పోయి చూచికొనుము.'

### 34

కళాధరుడు వెడలిపోయెను. వసుంధర గదిలోనికి బోయి గవాక్షపుతలుపు పరిశీలించెను. దానికి ద్రాడు కట్టియున్న దిర. వెంటనే రెండువేల రూపాయలు తన చేతిలోనుండి వృథాగా జారవిడుచుకొంటినన్న యూహయే మనస్సునందు హాహాకారమును చేసెను. కళాధరుడు దుర్మార్గుడని తెలియునుగాని యింత దుర్మార్గుడని తెలియదు. వీనినిగూర్చి యెవరితో జెప్పవలయును? తన యన్న కీదేవతానిలయపు సంగతు లక్కరలేదు. అతడంతటివివేకియు దేవతానిలయవిషయమున దాసానుదాసుడై ప్రవర్తించుచుండెను. ఇది యొక మాయ. నెపోలియన్ యూరపుఖండమంతయుగగ్గోలు పెట్టించినవాడు అలనికి నెలుక యనినచో భయమట. తక్కిన సర్వవిషయములయందు మహానసులయి యేకవిషయమున గొందరు దీనులగుదురు. ఉమాకాంతునితో జెప్పవలయునా? ఉమాకాంతుడు వచ్చినప్పటినుండియు దా నతనియెడల జూపవలసిన గౌరవమే చూపించుటలేదు. అతనిని భర్తగా మన్నించుటలేదు. అతనిని నేడుచు సంప్రతించుటలేదు. నేడీ సంగతి పోయి యాతనితో జెప్పినచో దానిస్వార్థకాని స్త్రీ నేడగును. పోయి వామదేవునకు జెప్పవలయునన్నచో వామదేవుని బలము లేకుండ కళాధరుడిట్లు చేయడు. కీరివృకునుబోయి రామశాస్త్రియింటిలో దీకను పెట్టి పాతిక దినములు కావచ్చినది. అచ్చటి కథలు జనము చిత్రచిత్రముగా జెప్పుకొనుచున్నారు. తా నిల్లు కదలెడిదికాదు. లోకము చమత్కారముయినది. పరమరహస్యముగా జరిగినవిషయముకూడా నాల్గు దినములలో నడిబజారున నుండును. వామదేవుడు కళాధరునకు జేసిన శిక్ష నలుగురినోళ్ళ బడెను. వసుంధరచెవి బడెను. ఈ యపనయుడు తనమీదికి వచ్చుట యెందులకు? తా నీ విషయమున వానిని నాక్షేపించనైన నాక్షేపించలేదే? తానెందు కాక్షేపించలేదు. ఆక్షేపించుట తనమర్యాదకు భంగమనియా? పెట్లాక్షేపించు దుస్స్వభావము తనప్రకృతిలో లేదా? అట్లు చేసినచో దనస్త్రీత్వము దానంగీకరించిన ట్లగునా? తన దేవతాపీఠమర్యాదకు నట్లు చేయుట తగనిపనియా? అది యెట్లైనను గానిమ్ము. కళాధరుడు కేపొనూకా తిరిగివచ్చును. అప్పుడు తా నేమి చేయవలయును? తానేకాకిని యైయుండరాదు. ఎప్పుడు తానెవరితోనో కలిసియుండినచో నతడేమియు జేయలేడు. కాని యది తన బలహీనతగా బ్రకాశించును. వాడు తనక్రింద నొక యుద్యోగి. వానికి దాను భయపడవలయునా? పురుషుడైనంత మాత్రమున దాను స్త్రీయగుటచేత వానికి భయపడుట సామాన్యస్త్రీలక్షణము. తానొకవేళ నిద్రపోవుచున్నప్పుడతడు వచ్చి దెందినచో నేమి చేయవలయును? అప్పుడందరును నిద్రపోవుచుందురు. తా నరచినను బ్రయోజన ముండదు. వాడసలు తనగదిలోనికి వచ్చి దాగుకొనుట యే యాశ్చర్యముగ నున్నది. తన మేడతలుపు లెప్పుడును దెరచియే యుండును. ఒక్క యినుపపెట్టెకు దాళ మున్నదిగాని యా మేడపై సర్వదేశమున నెవ్వరయినను రావచ్చును, తిరుగవచ్చును. ఈరీతిగా నేండ్లు గడచినవి. ఇన్నియేండ్లుభద్రముగా గడచిన వనుటభవిష్యత్కాలమునకొక్క నియమము నకుగూడ. భద్రహేతువని చెప్పకొనరాదు. అన్నిటికన్న కాలము బలవత్తరము మయినది. పౌరాణికుడు కాలమునుగూర్చి చాల చమత్కారముగా జెప్పెను. పరమేశ్వరుడు సర్వసమర్థుడు. సర్వశక్తుడు. అతడే సృష్ట్యాదియందు మనుష్యులను సృష్టించె నని యొకడడిగెను. అట్లయినచో సర్వసృష్టియు నిప్పుడు స్త్రీపురుషసంయోగజన్యమగుటయేల? తొలుదొల్త తాను చేసినట్లే యిప్పుడుకూడ మున్పే వానివలె బొమ్మలుచేసి యొందబెట్టరాదా? యని మరియొకడడిగెను. అప్పుడవసర మున్నది యిప్పుడు లేదని సమాధానము. అప్పు డున్న యవసర మేమిటి? ఇప్పుడు లేని దేమిటి? యని ప్రశ్న. మరియు బరమేశ్వరుడు సర్వశక్తుడయినచో బాపుల నందరను నొక్కసారి నిర్మూలనము సేయరాదా? యని పౌరాణికుడడిగెను. దానికి కాలముపట్టు నని యితరుడు సమాధానము చెప్పెను. పౌరాణికు డిట్లనెను. అనగా నా పరమేశ్వరుడు కాలమున కధీనుడని యర్థము. లేదా కాలము పరమేశ్వరునికంటె గొప్పదని యర్థము. మరి కాలమే పరమేశ్వరుడన్నచో బరమేశ్వరు నారాధించుట యెందులకు? కాలము నారాధించవచ్చును. కాలమును లౌకికు లారాధింతురు. పరమేశ్వరుని వైదికు లారాధింతురు. వసుంధర యిప్పుడు లౌకికురా లయినదికాని వైదికురాలు కాలేదు. దేవతాయతనము వైదికము. ధనము మొదలయినది లౌకికము. కాని యా వైదికలౌకికములనుగలిపి తన్ను దాను మోసముజేసికొనుచున్నది. ఈ మోసము తను దా సంకల్పించినదా? లోకమునందే దియున్నదో దానిని సామాన్యులు పరిగ్రహింతురు. విశిష్టులు విచారింతురు. తనయందు విశిష్టత్వము కనుపించుటలేదు. తాను సామాన్యురాలు. సామాన్యురాలైనచో గళాధరుని నిశ్చయముగా వంచింపబడును. తాను విశిష్టురాలయినచో నీ వంచన యుండదు. తాను విశిష్టురాలగుట యెట్లు? తన ధనాదులయందు వాంఛ పోవలయును. అధికారమునందు వాంఛ పోవలయును. స్త్రీభావమునందు నభిమానము పోవలయును. తన్నతడు వచ్చి యెట్లు బెదరించెను? తనయందు స్త్రీభావమున్నదిగనుక బెదరించెను. ఆమూలగూర్చున్న దెవరు? ఆమె తనకంటె యౌవనవతి. పోయి యామె నిట్లడుగ లేదే, తానుగూడ నట్లున్నచో దన్నిట్లడుగడే. ఆమె బహుపూర్వజన్మ పరిపాకముచేత నట్లున్నది. తన పూర్వజన్మలయందట్టి పరిపాకము లేదు. లేకపోయినను దాను ప్రవర్తన యట్లుగా దీర్చుకొన్నచో లోకమువలన వచ్చు సుఖదుఃఖము లంటవు. ఒకడు పసుధనయోగి. మరియొకడు భావనాయోగి. తాను భావనాయోగ మవలంబింపవచ్చును. ఏది యెట్లున్నను దా నూహయే చేయనివాడనుభవయోగి. వానికి శీతోష్ణములు వాని సుఖదుఃఖములను కల్పించనే కల్పించవు. భావనాయోగికి సుఖదుఃఖములు కలుగును. అవి స్పర్శమాత్రముగా గల్గును. వానిని నతడు నిరాకరించును. లెక్క సేయడు. అవి యింద్రియము లింద్రియవిషయముల యందు బ్రవర్తించుటగా భావించి తన యాత్మవస్తువు దానికలత జెందుటలేదని యాత్మానుసంధానము చేసికొనును. ఇతడు ధనిష్ఠయోగి. అట్టి స్థితి తానవలంబింపవచ్చును. ఈ ధనమంతయు బోయినవో దనకేమి? తాను స్త్రీయే కాదు. తన్ను పురుషుడేమి చేయును? అందుచేత నామె స్త్రీయేతద్విషయకమైన యూహాపరంపర వచ్చినదానినెల్ల బొలగబెట్టి తన కేమియు పట్టనట్లు సంచరింప నారంభించెను. ఈ వైరాగ్యములో నాల్గయిదు దినములు గడచెను. ఇనుపపెట్టె తాళపుచెవు లెప్పుడును తనవెంటనే తీసికొనిపోవుచుండెడిది. ఈ నాల్గుదినములు పోనిమ్మ వాకే మని యినుపపెట్టెనే యుంచి తాను పురాణమునకు బోయి వినుచుండెను.

ఒకనాడాసమయములో వచ్చిన కళాధరునకు నామహాల్యము దేవతవలె ప్రత్యక్షమయ్యెను. తాళపుచెవి యినుపపెట్టె నందుండుటజూచి యతడు దొంగతనము చేయుటకు వచ్చినవానికన్న నెక్కువ సంతోషించెను. ఇనుపపెట్టె తెరచెను. అందులో నున్న ధన మొక్క దమ్మిడీ ముట్టుకొనలేదు. ముట్టుకొనలేదుసరిగదా! యా పెట్టెలో నాల్గయిదు వేల రూపాయల కిమ్మతుచేయునగల మూట పెట్టెను. ఆ పెట్టుట తలుపు తెరచినంతనే కనిపించునట్లు పెట్టలేదు. సొరుగుదీసి యందులో బెట్టి సొరుగునకు దాళము వేసి యినుపపెట్టె మూసితాళపుచెవుల నత్తి యథాప్రకారముగనుంచి వెడలిపోయెను.

కళాధరుడు మిక్కిలి సంతోషించెను. వసుంధరమీద బగ దీర్చుకొనును. వామదేవునిమీద బగ దీర్చుకొనును. నీల నేమి చేయవలయునో తెలియలేదు. పిల్లలున్నారు. ఒక కొడుకు. ఒక కూతురు. తాను వైదువేలు వ్రాసచేసెను. అది పిల్లలిద్దరకు దక్కును. ఇంతకు వసుంధర యంగీకరించినచో నంతమూరమే రాదు. తనభార్య పరునివశమైనది. పరుని భార్య తనకు వశమయినచో దనకు నష్టము లేదు. కొన్ని ప్రకృతు లిట్లుండును. వారి దెస నీతియు ధర్మమును ధనమునంటివి. అక్కడ పదిరూకలు రాలేదు. ఇక్కడ పదిరూకలు వచ్చినచో సరిపోయినట్లు.

మరునాడు కళాధరుడువసుంధరకడకు వచ్చెను. అతడు నిన్నటే యాశ్చర్యపోయెను. వసుంధర తాళములు వేసి పోవుననుకొనెను. పోలేదుసరికదా యినుపపెట్టెతాళపుచెవులుగూడ నచ్చటనే యుంచెను. తాను వచ్చునని భయపడి యెవరినో తోడుంచుకొను ననుకొనెను. నే నట్లును లేదు. ఒక్కతెయే యుండెను. ఇది యతని కర్థము కాలేదు. అతడిట్లూహించెను. ఆమె నిస్సహాయురాలు. ఆమెయు నాలోచించియుండును. ఎవ్వరినో యొక్కరిని విశ్వసింపకపోయినచో దన యీ సీతజీవనము నడువదు. వామదేవుడు నమాకాంతుడును దనకు బనికిరారని తెలియును. తన్నంగీకరించుటకే యామె నిశ్చయించె ననుకొనెను.

తాను ప్రవేశించువరకు వసుంధర సావడిలో నుండెను. ఆమె గదిలో నున్నచో బాగుగా నుండెడిదే! యని యతడనుకొనెను. ఆమె తలికి దగ్గరగా గూర్చుండి యుండెను. ఇంచుమించు శిలవలె నే కూర్చుండి యుండెను. కళాధరుడు వచ్చెనని యామెకు దెలియును. కాని తల యెత్తిచూడలేదు. కళాధరుడు రెండు నిముసము లట్లే నిలుచుండి పకాలున నవ్వెను. ఆమెకు తలయెత్తి చూడవలెనన్న యూహ కలిగెను. కాని తలయెత్తి చూడలేదు. అతడిట్లనెను. "ఇదియా యెత్తుగడ. నీవు వచ్చినది శిలవి కావు. ఆ శిలమాత్రము దిగివచ్చినదా? అది యొక వేషము వేసికొని కూర్చున్నది. మీ రిద్దరును గలిసి యీ నాటకమాడుచున్నారు. నీ జన్వరికి దెలియకుండ నామెకు రాత్రులందన్నము పెట్టుదువని యందరకు దెలిసినవిషయమే" యనెను. వసుంధర మాట్లాడలేదు. అతడు మరల నిట్లనెను. నేను చెప్పినమాట యేమిచేసితివి? నాతో గదిలోనికి రమ్ము. నీకు గత్యంతరము లేదు. అని యతడు గదిలోనికి బోయెను. పోయిగడపలో నిలుచుండి యామె లేచునేమో యని చూచుచుండెను. కొంతసేపయినతర్వాత, నిట్లనెను. "నీ యంతట నీవు రానిచో నేను చేయిపట్టుకొని లాగుకొని వత్తును" అని ఆమె కదలలేదు. మరల నైదునిముసములు గడచెను. అతడింక దాను పోయి వసుంధర చేయి పట్టుకొని లాగవలయు ననుకొనుచుండెను. కాని యతనికి దైర్యము చాలుటలేదు. అతడు సహజముగా పిరికివాడు. ఆమెతో నిట్లు మాటాడుచున్నను నశ్వరము చేతను, భయముచేతను వాని కంఠస్వరము కదలుచునే యుండెను. వాని నెత్తురంతయు నుడికిపోవుచుండెను. అతనిమంచె బుగబుగలాడుచుండెను. ప్రతినిమేషప్రయత్నమూరితో వాని నరిడు సంబాళించుకొనుచుండెను. ఆమెను లాగికొనిపోయినట్లు మనకొన్నంతవరకు మనసుతో నతడు తూగి చిట్టచివరకు దన భయములక్షణము నే ప్రదర్శించెను. తాను పట్టిపనయయముల నొక యాదార్యము నపేక్షయించును. అతడిట్లనెను. నేను బలవంతముగా నేమియు జేయను. నీయిష్టమైనచో రావలయును. నేను మరల వచ్చెదను. కాని యీ, విషయముమాత్రము జ్ఞాపక ముంచుకొనుము నీవు నా వొనరింబ నెక్కుటయో? ఉరికంబ మెక్కుటయో?"

# మద్రాసులోని వివిధవిద్యాకేంద్రాలలో బేసిక్ విద్యాశిక్షణ













రాజమహేంద్రవరం, శ్రీ గౌతమీ జీవకారుణ్య సంఘంవారు తుపాను బాధితుల సహాయార్థమై పురవీధులలో ప్రచారంచేసి పాతబట్టలు వసూలు చేయుచున్న దృశ్యం.

## విచ్ఛిన్న విభ్రాంతి

(7-వ పేజీ తరువాయి)

చున్న కొలదీ, కార్మికులకు, కర్షకులకు పనివాండ్లకు జీవితము అంతకంతకు మరింత దుర్భరమగుచున్నది.

స్టాలిను అమలుపరచనున్న సోషలిజం తత్వమును కార్మికులు ఆమోదించేటట్లు చేయడం సాధ్యమగుటలేదు. తినుటకుతగిన తిండియును, నివసించుటకుతగిన ఆశ్రయమున్నూ ఎక్కడనైనా దొరుకునా అని ఆశపడుచునే కార్మికులుకూడా ఒక ఊరినుండి ఇంకొక ఊరికి వలసలుపోవుచున్నారు.

రష్యను ప్రభుత్వం ఈ పాటకపు జనులను నిర్బంధించి పనులు చేయించుటకై అంతకంతకు నిర్బంధ శాసనములను అనులుపరచి వారిపై ప్రతీకారము సాగించుచున్నది. మొట్టమొదలుగా సేవాయోగ్యతాపత్రము నొకదానిని అమలుపరచెను. ఈ పద్ధతులే అటుతర్వాత జర్మనీలో హిట్లరుకూడా అనుకరించెను. ప్రభుత్వము యొక్కయు సర్వాధికార బలోపేతమైన పార్టీయొక్కయు అజ్ఞలకు కార్మికులు లోబడియుండుటకై యీ పద్ధతి అవలంబింపబడెను.

ఈయోగ్యతా పత్రము ఖైదీల ప్రవర్తన పత్రికవంటిది. అట్టి కార్మిక సర్టిఫికేటు నందు కార్మికుని పుట్టుపూర్వోత్తరములు, సంక వృత్తాంతము అతడు చెల్లించిన జరిమానాలు అతడు చేసిననేరము లున్నయెడల ఆనేరముల వివరములు ఇదివరకతడు పని చేసియుండిన చోటనుండి బర్తరఫు చేయబడుటకుగల కారణములు అందులో నమోదు చేయబడి యుండును. అతడు నవుకరీ ఎందుచేత వదలుకొని వచ్చెనో అందుకు తగిన సరియైన సమాధానం అతడు చూపనియెడల అతనికి తిరిగి యింకొకచోట పని దొరకదు. కనుక అతడు తిండిలేక మాడవలసినదే.

కార్మికుల సహకారసంస్థలు ఫ్యాక్టరీ అధికారుల నిర్వహణములోనే ఉండును. కనుక, ఏ కార్మికుడైనను తన ఉద్యోగమును వదులుకొనే యెడలగాని, బర్తరఫు అయినయెడలగాని అతనికి అతని కుటుంబమునకు యివ్వబడే రొట్టెల రేషనుకార్డు వ్యాధ్యాపదీము అతడు వంటనే గోల్పోవును.

కార్మికుల క్రమశిక్షణకొరకై శరపరంపరగా అనేక సవరణలు అనులుపరచబడుచుండుటవల్ల, రాజ్యాధికార చక్రమును త్రిప్పుచుండవలసిన కార్మికులు సామాన్య మానవహక్కులను స్వాతంత్ర్యమును గోల్పోయిన వారగుచున్నారు. ఇటువంటి అక్రమ ప్రపంచములో నివసించుచున్నామని మేము గ్రహించితిమి. ఫ్యాక్టరీలో సమేస్త్రీకిగాని, మేనేజరుకుగాని కోపం తెప్పించిన కార్మికుడు పనిలోనుండి బర్తరఫు చేయబడును. అతనికి వుండుటకు కొంపగాని, తినుటకు తిండిగాని లేకుండా చేయబడును.

సమ్మెచేసే అధికారం కార్మికులకు చాలా కాలం క్రిందటనే పోయింది. తమ జీతబత్తెములగూర్చి చెప్పుకొని కోరిన ప్రకారం అడుగుటకుగాని రాయబారములు జరుపుటకుగాని కార్మిక సంఘములకు అవకాశముగాని నామమాత్రమైన హక్కుగాని లేనేలేదు. ఈ కార్మికుల జీతబత్తెములు చాలా హీనంగా ఉన్నవి జారు చక్రవర్తుల కాలంలో రష్యనుద్రవ్యముతో పోల్చినంత సరకు కూడా యిప్పటిరష్యను ద్రవ్యమునకు లభించదు. ద్రవ్యముయొక్క కొనుగోలు శక్తితగ్గిన స్థితినిబట్టి చూస్తే వారి ప్రస్తుత జీతబత్తెములు చాలా హీనంగా ఉన్నవి.

1920 మొదలు 1930 వరకు గడచిన సంవత్సరములలో కంటె, 1936 సం॥లో చాలా మెలుగా ఉన్నవి. కాని, 1914 సం॥లో రొట్టె ఉన్న ధరకంటె 15 రెట్లు ధర యీ 1936 సం॥లో ఉన్నది. ... యొక్క ధర 12 రెట్లు అధికంగా ఉంది. బట్టలధరకూడా చాలారెట్లు పెరిగినది. కాని, రష్యను ప్రభుత్వపు లెక్క ప్రమాణములనుబట్టి చూచినప్పటికీ, కార్మికుల జీతనములు నాలుగురెట్లు మాత్రమే పెరిగెను.

విదేశములనుండి చాలమంది యాత్రికులు రష్యాను చూచుటకై వస్తూవుంటారు. కాని వారు యిచటి షాపులలోనికి వెళ్లి జీవితావసరములైన వస్తువుల ధరలు ఎట్లున్నవో విచారించి, ఇచటి కార్మికులు గడించెడి కూలిరేట్లతో పరిపోల్చి చూడరు. విదేశాల నుండి వచ్చేడి కమ్యూనిస్టులు సోవియటు రష్యాలోని కార్మికుల స్థితిచాలా బాగుపడినదని ఇతర దేశాలలో ప్రచారము చేయుచుందురు. అందుకు భిన్నముగా ప్రత్యక్షసాక్ష్యమెంతయుండినప్పటికీ వారి ప్రచారం అవిధంగా సాగుచున్నది.

ఎన్ని కఠిన నిర్బంధములను అమలుపరచినను కార్మికులను యెంత పీడించి భయపెట్టినను తిండిలేకమాడుచున్న కార్మికులు పనిమాని కొని వెళ్లిపోకుండా నివారించుటకు సాధ్యమగుటలేదు. "కార్మిక నియమనిబంధనలు బాహాటంగా అతిక్రమింపబడుచున్నవి." అనెడివార్తలతోను ఫిర్యాదులతోను రష్యనుపత్రికలు నిండిపోవుచున్నవి.

క్షుధార్తులైన కార్మికులు తమపని విడిచిపోకుండా నిర్బంధించుటకున్నూ, అసంతుష్టిచెందిన కర్షకులు సమష్టివ్యవసాయక్షేత్రమునుండి వెడలిపోకుండుటకున్నూ జారుచక్రవర్తుల కాలమునాటి పోలీసు కాపలాపద్ధతి నొకదానిని సర్వేసర్వత్ర మరింత కఠినపద్ధతిగా స్టాలిను అమలుపరచెను. దేశమధ్యంలోనే ఒక ప్రాంతమునుంచి ఇంకొక ప్రాంతానికి పోవుటకు ప్రయాణానుమతి పత్రము కావలెనను నిబంధన అమలుపరచెను.

బస్తీలలో నివసించు ప్రజలను, పెద్ద పట్టణముల సమీపంగా నివసించెడి కర్షకులను తమ నివాసములకు అనుమతి పత్రములను పొందవలెనని శాసించెను. ఎవడైనను తాను నివసించు పట్టణమునుండిగాని పల్లెనుండిగాని, ఒక్క రాత్రిమట్టుకైనను పోలీసువారి అనుమతిలేకుండా విడిచిపోవుటకు వీలులేదని శాసించెను.

ఈ ప్రయాణానుమతి పత్రమును పొందకుండా సదరు నిబంధనలను అతిక్రమించిన రష్యనుల సంఖ్య లక్షలకొలదిగా హెచ్చుచుండెను. అందుకొరకై కఠిన శిక్ష విధింపబడి నిర్బంధ ప్రవాసములకు పంపబడుచుండిన వారిసంఖ్య లక్షల కొలదిగా పెరుగుచుండెను. రష్యా ప్రభుత్వ పద్ధతి ననుసరించి కార్మికులచేత బానిస సేవ చేయించుట ఆవశ్యకమైనది. అమెరికా సంయుక్తరాష్ట్రములందు స్వదేశాంతఃకలహము జరిగియుండక పూర్వము అచటి దక్షిణ రాష్ట్రములలో నీగ్రోజాతి వారిని బానిసలుగా కొనితెచ్చి పనిచేయించుట ఆవశ్యకమైయుండెను. అదే పద్ధతిగా రష్యాలోని కార్మిక పరిస్థితి ఏర్పడెను.

సాధారణంగా నిజమైన జీవిత స్వాతంత్ర్యము నేది కార్మికునకు లేకుండా స్వేచ్ఛాకార్మికుడు అని చెప్పబడేవాని జీవితమే చాలా అధ్వాన్నంగా వుంది. అట్టిస్థితిలో కేవలం బానిసగా పనిచేయుచు వారి గ్రామిక శాఖాధికారుల కంట్రోలులోనున్న బ్రహ్మాండమైన సంస్థలయందు పాటుపడుచున్న కార్మికునిస్థితి ఎంత దారుణమైనదో, ఘోరమైనదో వర్ణింపనలవి కాదు. మానవుని ఆత్మశక్తిని లొంగదీసి కీలుబొమ్మవలె మానవుని ఆటలాడించుట స్టాలిను ఏలుబడిలో అత్యంతదారుణమైన విషయము. మానవునకు కళ్లెంబిగించి వంగదీసినవాడు ప్రతి వాడున్నూ తనపై అధికారులయెదుట వంగివంగి సలాములు చేయుచుండును. ఈ విధంగా నైచ్యములకు అలవాటుపడిన మళ్లి తమకు అధికారం చలాయించే అవకాశం దొరికినప్పుడు తమ చేతిక్రింది అభాగ్యులను బెదరించి పీడించు చుందురు.

రష్యాలో యీవిధంగా ఏర్పడిన "నూతన ప్రభుత్వ" సాంఘిక విధానమును పారిశ్రామిక సామంతాధికారపద్ధతి అనే పేరుతో వ్యవహరించుట వుత్తమమని నేను నా స్నేహితురాలైన నేను నిశ్చయించితిమి. ప్రజలకు సంచలన స్వేచ్ఛ కాదు వారి చేతబత్తెముల హెచ్చుకొరకై వారు సమష్టిగా బేరమాడుకొను అవకాశము లేదు. ధనిక వర్గ దేశములలో అనర్థకములుగా ఉన్నటువంటి కార్మికసమ్మెలు మొదలైనవి పూర్తిగా అంతమొందింపబడినవి.

## నా చిన్నప్పుడు

7-వ పేజీ తరువాయి

గులన్నీ అనాటి సంతోషదినాల్లో అలవరచుకున్నవే. ఈ నాటి నా జీవితాదర్శం ఆ నాడు నిర్మాణం చేసుకున్నదే. ఈనాడు నేను పత్నీలాన్ని ప్రదర్శించనివ్వండి, దుశ్శీలాన్ని ప్రదర్శించనివ్వండి అవన్నీ బాల్యంలో అలవడ్డవే. అంటే నా జీవితానుభవాన్నంతా ఒకే రైలు పట్టాల మధ్యను నడిపించుకు వచ్చానని గాదు దీని అర్థం. అనేక రకరకాల వతావరణంలో పెరుగవలసి వున్నప్పుడూ, అనేకరకాల అనుభవం కలిగే సావకాశమున్నప్పుడూ, ఇలాంటిది అసంభవం. జీవితక్రమంలో వచ్చే ప్రతి అనుభవమూ, ఒక గుణపాఠమై దినదినం మనలోవుండే ఒకేలోపాన్నే సవరించుతూ నిత్యనూతన పథాన మన్ని నడిపిస్తూవుంటుంది. నావంటు ఇలాటి అనుభవాలు యెన్నో నాకూ జీవితంలో తటస్థించినై. కాని స్థూలంగా ఆలోచించితే 70 సంవత్సరాలక్రితం నాలో యేకోర్కెలూ ఆవేశాలూ వుండేవో వాటి ప్రతిరూపంగానే నేను యివ్వాళకూడా వున్నాను.

'ఈ వేళకూడా నాకు ఇన్ని పనులూ, ఇన్ని బాధ్యతలూవున్నా, చుట్టూ పిల్లల్ని పెట్టుకుని వారితో కాలక్షేపం చేయమంటే నాకెంతో సర్దాగా వుంటుంది. చుట్టూ పరిస్థితులు యెంత అంధకారమయంగావున్నా, పసిబిడ్డల సంతోష వాతావరణం తిరిగి మనలో యేదో ఒక కాంతిరేఖను ఉదయింపజేస్తూ వుంటుంది. విషాదకరమైన వార్తాపరంపరను విన్నప్పటికీ, హృదయంలోనుంచి నల్లివిరిసిన నవ్వులా అనిపిస్తుంది. ఆందోళనామయలింగావున్న క్షణాలమధ్య విశ్రాంతి రేఖగా ఆనందమిస్తుంది. కర్మాచరణ దైవపూజవంటిదనటంలో సందేహం లేదు. కాని 'నవ్వు' మానవజీవితానికి ప్రాణతుల్యం.

'జీవితంలో ప్రతిదాన్నీ అతితీవ్రంగా ఆలోచించి ఆందోళనచెందేవాడి జీవితం, చాలా దుఃఖమయంగా తయారవుతుంది. సుఖదుఃఖాలను సమానంగా సేకరించగలిగిన మానవుడు, జీవితంలో లభించగల ఉత్కృష్టతనంతా సాధించగలుగుతాడు. సుఖదుఃఖాలను రెంటినీ సహించగల స్వభావం నాలో పెంపొందించుకోగలిగినందుకు నేనెంతో ఆనందిస్తున్నాను. నేను మొన్న మొన్నటివరకూ నా మనుమడితో కుస్తీపట్లు పట్టి ఆటలాడుతూ వుండేవాణ్ణి. ఇప్పుడు కూడా అంత కుస్తీపట్లు పట్టకపోయి నా పిల్లలతో కొంత సరదదమాతూనే వుంటాను వాళ్ళ సాహచర్యం నాకెంతో ఆనందదాయకంగానూ లాభకంగానూ కూడా వుంటుంది.

"వార్ధక్యం ద్వితీయబాల్యం" అంటారు. నిజంగా అలావుండాలనే నాఅభిప్రాయం.

ఇంకా ఇంకా వృద్ధుడవుగా ముందు మరింత ఆనందముంది బాల్యంలో ఏ ఆనందాన్ని చవి చూచావో అదినాకు సంపూర్ణంగా లభించుతుంది" అని ఒక మహాకవి అన్నారు.

నా కసపటి జీవితమంతా అందరికీ తెలిసిన విషయమే. నా బాల్యవిషయాలు తెలిసినవారు మాత్రం కొద్దిమందో తప్ప, బ్రతికిలేరు. ఆ వృద్ధుల కూడా యెక్కడెక్కడో దూరదూరాన మారుమూలల వున్నవారు వారి మాటలు మీదా కొ ప్రకటనలోకి రావటానికి వీలులేదు. కాని యిది మాత్రం చెప్పగలను- 1949 లో ఈ నాటి వ్యక్తిగా కంటే, 70 యేళ్ళనాటి ఆ పసువుగానే బ్రతకగలగటం నాకు సర్దాగా వుంటుంది.

స్థానికసంస్థల మంత్రి గౌ॥ కల్లూరి చంద్రమౌళిగారిని తెనాలి పురపాలకసంఘం సన్మానించినప్పటి దృశ్యం. మంత్రిగారికికుడిప్రక్క చైర్మన్ నన్నపనేని వెంకటరావు, ఎడమప్రక్క తెనాలి డిప్యూటీ కలెక్టరు బి. రామమూర్తి పంతులుగార్లు గలరు.



మంగళగిరి పంచాయితీ బోర్డువారు నిర్మింపదలచిన కూరగాయల మార్కెట్‌కు టి. ప్రభాకరరావు నాయుడుగారు శంకుస్థాపన చేసిన సందర్భమున తీసిన ఫోటో.



# పాత్రల పిల్లలు

పూర్వమొక గ్రామములో ఒక వర్తకుడు వుండేవాడు. వాడు మిక్కిలిదురాశాపరుడు. ఆగ్రామం లోనే ఒక పేదవాడు నివశించే వాడు. అతడు మంచి చతురుడు. ఒకనా డాతడు వర్తకుని యింటికి వెళ్ళి "సోదరుడా! రేపు నాయింట నొక వివాహ మహోత్సవము జరుగనున్నది. దయచేసి, మీరు కొన్ని పాత్ర లిస్తారా?" అని అడిగేడు. వర్తకుడు అన్నాడు— "మంచిది. తీసుకవెళ్ళండి. కాని త్వరగా తీసుకురావాలి సుమా!" ఇట్లు చెప్పి, అతనికి చాలా పెద్ద పెద్ద పాత్రలను యిచ్చివేశాడు. వాటిని తీసికొని పేదవాడు యింటికి వెళ్ళిపోయినాడు.

రెండుమూడుదినముల తర్వాత నతడు వర్తకుని పాత్రలు తీసుకొని వచ్చాడు. వానితోబాటు కొన్ని చిన్నచిన్న పాత్రలు గూడా తెచ్చేడు. వర్తకుడు ఆ పాత్రల జూచి ప్రశ్నించేడు: "ఈ చిన్న పాత్ర లెక్కడివి?" ఆ పేద వాడన్నాడు. "మహాశయా! తమరి పాత్రల పిల్లలేయివి. మీ పాత్రలు పిల్లలు బెట్టినవి. వర్తకుడు తనలో ఆ పేదవాడు వట్టి మూర్ఖుడని తలంచి, ఆ పాత్రలన్నీతీసి భద్రముగా యింట్లో దాచేసేడు.

పది, పదిహేను దినముల తర్వాత, ఆ పేదవాడు మరల వర్తకుని వద్దకువచ్చి, కొన్నిపాత్ర లడిగేడు. వర్తకుడు సంతోషించి వానికి చాలా పాత్రలిచ్చి, చెప్పేడూ—"చూడూ! పాత్రల పిల్లల్నన్నింటినీ జాగ్రత్తగా తీసుకరావలసినది" పేదవాడు "సరే" అని పాత్రలు తీసికొనియింటికి వెళ్ళిపోయాడు.

కొన్నిదినాలతర్వాత, ఆ పేద వాడు వర్తకుని యింటికి వెళ్ళి, పెద్దగా ఏడ్చి, మొత్తుకొని సాగేడు. అది చూచి, వర్తకుడు భయపడి

శ్రీ ఎస్. వి. హనుమంతరావు

వాని యేడ్పుకు కారణం ప్రశ్నించేడు. వాడు జవాబిచ్చేడు... 'మహాశయా! ఏమి చెప్పేది! రాత్రి మీ పాత్రలన్నీ చచ్చిపోయినవి. వాటిని బ్రతికించుటకు నేను యెంత ప్రయత్నంచేసినా విఫలమైపోయింది.

అప్పుడు వర్తకుడు అన్నాడూ: "అరే! ఎంత విచిత్రమైనమాట చెప్తావయ్యా నువ్వు! నేను చావవచ్చు, నీవు చావవచ్చు, మానవుడు చావవచ్చు, చెట్లు, మొక్కలు చావవచ్చు, కాని పాత్రలు చచ్చేయంటే ఎవరైనా నమ్ముతారా?"

పేదవాడు జవాబు చెప్పేడు- "కాని, స్వామీ! మీ పాత్రలు మాత్రము లోకవిరుద్ధమైనవి! అవి పిల్లలూ పెడతాయి. చచ్చీపోతాయి" ఈ మాటలు విని వర్తకుడు సిగ్గుపడిపోయాడు.

# మూర్ఖత్వం

పాపాయిలూ! చీటికీ మాటికీ మూర్ఖముచుసుని, నేను పట్టిన కుందేలుకి మూడేకాళ్ళని మూర్ఖపు పట్టుపడితే ఉన్నదికూడా పోతుంది. అల్లాగమూర్ఖంగా ఉంటే వచ్చేనష్టం ఏమిటో ఈ కథ చదవండి తెలుస్తుంది.

పూర్వకాలంలో "గుజరాతు" దేశములో "ధనపాలుడు" అనే ఒక కోటీశ్వరుడుండేవాడు. ఆ ధనపాలుడు తన కొడుకుకి పెళ్ళిచేస్తున్నాడు. ఒక్కడే కొడుకేమో చాలా డబ్బు ఖర్చుపెట్టి మహావైభవంగా పెళ్లి చేస్తున్నాడు. రకరకాల బాణాసంచాలూ, పువ్వువిమానాలూ, ఒకటేమిటి కనివిని ఎరుగనివన్నీ తీసుకువచ్చారు. పెళ్ళికొడుకుని ఊరేగించడానికిఅప్రక్కనేవున్న పూల్లో "కరీమ్" అనే మహమ్మదీయుని దగ్గర ఒకఏనుగుని అద్దెకు తీసుకువచ్చాడు ధనపాలుడు. ఆ ఏనుగు మీద చక్కని అంబారీకట్టి పెళ్ళికొడుకుని ఐదురోజులూ ఊరేగించారు. ఖర్మంచాక ఆ వరోజు రాత్రి ఆ ఏనుగుకి చిన్న కునుకువచ్చింది. ఆనిద్దరలో ఒక సింహం భయంకరంగాగర్జిస్తూ తన నెత్తిమీదకిదూకి, పంజాతో బుఱ్ఱ పగలగొట్టి తన మెదడు తిని వేస్తున్నట్లు ఆ ఏనుగుకి కలవచ్చింది. ఇంకేం ఉంది? వెంటనే హడిలిపోయి ఆ ఏనుగు ప్రాణాలు విడిచేసింది.

తెల్లవారేక ఏనుగకు నీళ్ళుపెడదామని మావటివాడు వచ్చిచూస్తే ఏముంది? ఏనుగు చచ్చిపోయి ఉంది. ఆ మావటివాడు దాన్ని చూసి గబగబా ధనపాలుడుదగ్గరకు పరిగెత్తుకువెళ్ళి "ఏనుగు చచ్చిపోయి ఉం"దని చెప్పేడు. ఆమాటలువిని ధనపాలుడు ఆశ్చర్యపోయి ఏనుగు దగ్గరకు పరుగెత్తుకు వచ్చాడు. "కరీమ్‌గారి ఏనుగు చచ్చిపోయిందంటే చచ్చిపోయిందని" నిమిషంలో ఊరంతా తెలిసిపోయింది. ఈసంగతి విని ఊళ్ళోవాళ్లంతా ధనపాలుని ఇంటికి పరుగెత్తుకువచ్చారు.

ఈ సంగతి కరీమ్‌కికూడా తెలిసింది ఇంక చూసుకో ఆ మాటలు వినగానే లబోదిబో నెత్తీనోరూ మొత్తుకుంటూ ధనపాలుని ఇంటికి పరుగెత్తుకు వచ్చాడు.

"మాణిక్యంలాంటి ఏనుగుని చంపేసేవుటయ్యోయ్! అయ్యో నాయేనుగోయ్!" అని కొంపలు ఎగిరిపోయేటట్లు రాగాలు మొదలుపెట్టేడు కరీమ్.

ఈ గోల వినలేక "ఊరుకోవయ్యా కరీమ్! ఆ ఏనుగుఖరీదు ఎంతో చెప్ప ఇచ్చేస్తాను" అన్నాడు ధనపాలుడు. "నాకు డబ్బు అక్కర్లేదయ్యోయ్! నాకు యేనుగే కావాలయ్యోయ్! నాకు డబ్బు అక్కర్లేదయ్యోయ్!" అన్నాడు కరీమ్ ఏడుస్తూనే.

"పోనీలే అల్లాగయితే ఇంకో ఏనుగుని కొని ఇస్తానులే ఇంక ఊరుకో" అన్నాడు ధనపాలుడు.

ఆ ఝే కరీమ్‌ఊరుకుంటేగా "నాకు ఆ ఏనుగే కావాలయ్యోయ్! నా తాతలనాటి నుంచీవస్తున్న బంగారంలాంటి ఏనుగుని నిష్కారణంగా నీ కడుపుని పెట్టుకొన్నావయ్యోయ్! నాకు ఇంక ఏ ఏనుగూవద్దురోయ్! అయ్యో నాఏనుగా! ఎల్లిపోయావుటే?" అని ఏనుగుమీదపడి ఇంకా గట్టిగా అరవడం మొదలుపెట్టాడు. చచ్చి

మహీధర నళినీ మోహన్‌రావు

పోయిన ఏనుగుని తెచ్చియిమ్మంటే ఎల్లా తెస్తానోయ్? కరీమ్! పోనీ రెట్టింపుడబ్బు ఇచ్చుకుంటాను ఊరుకో. ఎక్కడపోయి తెచ్చానురా దేవుడా!" అన్నాడు ధనపాలుడు. ఇంక ఎంత చెప్పినా వినకుండా "నాకు డబ్బు అక్కర్లేదయ్యోయ్! నా తాతలనాటి ఏనుగే కావాలయ్యోయ్!" అన్నాడు కరీమ్ భోరుభోరున ఏడుస్తూ.

"చెరోజబ్బా పట్టుకుని గెంటేశావిడి పట్టి బయటకూలవెయ్యండిరా ఈకరీమ్‌ని. లేకపోతే...చచ్చిన ఏనుగే కావాలట" అని అక్కడఉన్నవాళ్ళంతా తలోమాటా అన్నారు కరీమ్‌ని.

ప్రతిరోజూకూడా ఇంక వేళాపాళా లేకుండా, ధనపాలుడు ఇంటికివచ్చి, ఫెడీల్‌మని వీధితలుపు తన్నేసి, లోపలికివెళ్ళి ఆ మూలనుంచి ఈ మూలకిదొర్లుతూ, శోకన్నాలుపెట్టి అందర్నీ తిడుతూ ఇల్లాగే ఏడుస్తూ ఉండేవాడు కరీమ్.

ఇంక ఈ బాధ పడలేక ధనపాలుడు తన ఇంటిప్రక్కనే కాపురముంటున్న ఒక బ్రాహ్మణుని వద్దరకువెళ్ళి, సంగతంతా చెప్పి "ఈ శనిగ్రహాన్ని వదిలించుకునే ఉపాయం ఏదైనా ఉంటేచెప్పమ"ని వేడుకున్నాడు. ఆ బ్రాహ్మడుచాలా తెలివైనవాడు బాగా ఆలోచించి ఆలోచించి చక్కని ఉపాయం ఒకటి ధనపాలుడికి చెవులో చెప్పిపంపించాడు.

వెంటనే ధనపాలుడు కుమ్మరి ఆవనుంచి 10రూపాయలకుండలు తెప్పించి వీధితలుపు దేరవేసి,తలుపుకి దగ్గరగాదొంతర్లుదొంతర్లుగాఆకుండలన్నీ పేర్పించాడు.

మళ్ళీ ఆరోజుకూడా యథాప్రకారం కరీమ్ మహాకోపంతో చిందులుతొక్కుతూ ధనపాలుడు ఇంటికివచ్చి, ఫెడీల్‌మని వీధితలుపు బలంకొద్దీ తన్నేడు. వెంటనే తలుపు వెనకాలే ఉన్న కుండలన్నీ ముక్కలుముక్కలై పోయాయి. ఆ కుండలచప్పుడువిని, ధనపాలుడు అక్కడికి పరుగెత్తుకువచ్చి "అయ్యో నా కుండలోయ్! అప్పటే మీకు నా కూ ఋణం తీరిపోయిందటరోయ్? అయ్యోనీ చెయ్యి కాలిపోనూ. తాతల నాటి నుంచీ వస్తూన్న బంగారం లాంటి కుండలన్నీ నిష్కారణంగా పిండి పిండి చేసేసేవట్రోయ్! అయ్యబాబోయ్!" అని వీధిలోపడి, గుండెలు బాదుకుంటూ గోల్లపం మొదలుపెట్టేడు.

కరీమ్ ఇదంతా చూసి విస్తుపోయాడు. ఈ కుండలు బద్దలయిపోయినందుకే ఇంత ఏడుపు ఎందుకో అతనికి అర్థం కాలేదు. వెంటనే ధనపాలుడుతో కరీమ్ అన్నాడు కదా "ఎందుకయ్యా! ఈమాత్రానికే ఇంత రాద్ధాంతం చేస్తున్నావ్? ఆ కుండల ఖరీదు చెప్పు. ఇచ్చేస్తాను" అని.

"నాకు డబ్బు వద్దురోయ్! నాకు కుండలే కావాలి రోయ్!" అని ఇంకా కంఠం పెద్దది చేసేడు ధనపాలుడు.

"అల్లాగయితే కొత్త కుండలు కొని యిస్తానులే: పోనీ రెట్టింపు డబ్బు ఇస్తాను పుచ్చుకో" అని కరీమ్ ఎంత బ్రతిమాలినా ధనపాలుడు వినిపించుకోకుండా "నాకూ డబ్బూ వద్దు కొత్తకుండలూ వద్దురోయ్ నా తాతలనాటి ఆ కుండలే కావాలి రోయ్" అనిశోకన్నాలుమొదలుపెట్టేడు.

కరీమ్ ఇంక ఏమీ చెయ్యలేక ఆదేశపు రాజు దగ్గర ఫిర్యాదు చేశేడు. రాజు సంగతి అంతా తెలుసుకుని, "కరీమ్ ఆ చచ్చిపోయిన ఏనుగే కావాలని మూర్ఖపు పట్టు పట్టి ధనపాలుడిని అంతగా బాధ పెట్టినందుకు, కరీమ్‌కి ధనపాలుడు ఒక్క చిల్లి కాని కూడా ఇయ్య నక్కర్లేదు." అని తీర్పు చెప్పేడు.

"అయ్యయ్యో! అనవసరంగా ఏనుగు పోయింది. డబ్బూ పోయింది. రెట్టింపు డబ్బు ఇస్తానన్నప్పుడు ఆ డబ్బు తీసుకుని ఉంటే ఎంత బాగుండేది!" అని విచారిస్తూ వెళ్లిపోయాడు కరీమ్.

చూసేరా? అల్లాగ మూర్ఖపు పట్టు పట్టినందుకు కరీమ్‌కి ఎంత నష్టంవచ్చిందో?

# మన అందాల ప్రపంచం

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

చిన్నపిల్లలకు చెప్పటానికంటూ, పెద్దవాళ్లు ధర్మోపదేశాలూ, నీతిబోధలు, ఇలాంటివి తయారు చేస్తూవుంటారు. ఆ బాపతు మాటలంటే చిన్నప్పుడు నాకెంతో తలనొప్పిగా వుండేది. అలాంటివి వినవలసివస్తే మీకూ ఇప్పుడు అలానే వుంటుందనుకుంటాను. పెద్దవాళ్లకు మరో గుణం కూడా వుంటుంది—తామేదో అంతా తెలిసిపోయిన విజ్ఞానవంతులుగా ప్రవర్తించుతారు— నూటికి తొంభైపాళ్లు అజ్ఞానులైనా నా మటుకు నేను విజ్ఞానినో, అజ్ఞానినో ఇప్పటికి నిర్ణయించుకోలేకపోయాను. అందుచేత, యేవో నాకు తోచిన మంచి చెడుగుల జాబితాలు తయారు చేసి మీకిచ్చి 'ఇది చెయ్యి', 'అది చెయ్యొద్దు' అని మీకు చెప్పటం మంచిదిగాదు. ఇప్పటికే మీ ఉపాధ్యాయులు ఇలాంటి జాబితాల నెన్నింటినో మీకిచ్చివుంటారు. పైగా, నేనేదో పెద్ద గ్రంథసాంగుణ్ణి అయి



నట్టు మీముందు ప్రవర్తించటం కూడా తప్పే, అని ప్రధాని నెహ్రూ, 'శంకర్స్' వారపత్రిక పిల్లల ప్రత్యేక సంచికకు ఒక వ్యాసం వ్రాశారు. 'మనచుట్టూ వున్నప్రపంచం' అని ఈవ్యాస శీర్షిక.

'అయితే ఇకదేన్ని గురించి వ్రాయాలి? మీరు నాచుట్టూ వున్నట్టయితే, మన చుట్టూవున్న అనేకవింతవింత విషయాలను గురించి మాట్లాడుకునేవాళ్ళం. పువ్వులసంగతీ, చెట్ల సంగతీ, రంగురంగుపిట్టల సంగతీ, జంతువుల సంగతీ. నక్షత్రాలసంగతీ, పర్వతాల సంగతీ, మంచుకొండలసంగతీ, ఇలా ప్రపంచంలో మనచుట్టూవున్న అనేక చక్కచక్కటి వింతవింత విషయాలనీ చెప్పుకునేవాళ్ళం. మన చుట్టూ ఎన్నెన్నో చక్కటి చక్కటి వస్తువులన్నీ వున్నయ్. ఇవ్వన్నీ చూస్తుంటే ఎంతోసంతోషంగా వుంటుంది. కాని కొంచెం పెద్దవాళ్ళమైతే యేంజరుగుతుందో తెలుసా— వీటి సంగతే మరచిపోతాం. లేనిపోని వాదోపవాదాలకూ, రాద్ధాంతాలకూదిగి ఒకళ్లతో ఒకళ్లు పోట్లాడుకుంటూ కూర్చుంటాం—లేకపోతే ఆఫీసుగదుల్లో, యేవో పేద్దకూడబొడుస్తున్న వాళ్లకిమల్లే, పెద్దఘన కార్యం చేస్తున్నవాళ్ళకి మల్లేనిక్కపోతూ కూర్చుంటాం.

'మీరు ఆలా చెయ్యరని నే ననుకుంటున్నాను. మీరు యెంతపెద్ద వాళ్ళయినా కూడా ఈ సౌందర్య సంపదలను గురించి మరిచిపోరు, మీరు కళ్లూ చెవులూ మూసుకుని గుడ్డివాళ్ళలాగానూ, చెవిటివాళ్ళలాగానూ ప్రవర్తించరు. — నాకు తెలుసు — ఏం? కాదూ?—

'మీరు ప్రతిపువ్వునూ జ్ఞాపకం పెట్టుకుంటారు, అవి పూచేపాటను బట్టి అసిట్ట యేప్పుడో చూడకుండానే తెలుసుకో గలుగుతారు. పిట్టలతో జత కుదుర్చుకోటం ఎంత తేలిక! ప్రపంచంలో వుండే ప్రతి వస్తువుతోనూ జతచేసి చెయ్యొచ్చు. చక్కగా స్నేహభావంతో నవ్వుతూ వాటి దగ్గిరికి వెళ్ళటం చేస్తే చాలు! మీరు అనేక దేవతల కథలూ, శాస్త్రాలూ విని వుంటారు కాని నిజంగా చూస్తే, ఈ ప్రపంచానికంటే విచిత్రమైన కథముకోటేలేదు. అయితే దాని విషయం తెలుసుకోవాలంటే మనం కన్నులు విప్పివాని సౌందర్యమంతా చూడగలగాలి, చెవులు విప్పి సంగీతమంతా వినగలగాల. బుద్ధితో ప్రపంచంలో వున్న సౌందర్యాన్ని జీవితపు సొగసునూ అర్థం చేసుకోగలగాలి.

'పెద్దవాళ్ళేమి చేస్తారో తెలుసా! చిన్న చిన్న గుంపులు గుంపులుగా యేర్పడి మధ్యమధ్య పెద్దపెద్ద అడ్డుగోడలు కట్టేసుకుంటారు, ఒకళ్ల సంగతి ఒకళ్లు తెలుసుకోవటానికి వీలులేకుండా. అపైని, గోడవతలవున్న వాళ్లంతా యెవరో పరాయివాళ్లనుకోవటం, వాళ్లందర్నీ అసహ్యించుకు తీరాలనుకోటం మొదలు పెడతారు. ఈ గోడలు అనేకరకాలుగా వుంటై—మతాల గోడలుకొన్ని, కులాలగోడలుకొన్ని, పార్టీల గోడలుకొన్నీ, జాతులగోడలు కొన్నీ, రాష్ట్రాలగోడలు కొన్నీ, భాషలగోడలు ఆచారాల గోడలుకొన్నీ, రంగుభేదాల గోడలుకొన్నీ, డబ్బుగలవాళ్ల గోడలుకొన్నీ డబ్బులేనివాళ్ల గోడలుకొన్నీ— ఒకటేమిటి, లెక్కలేనన్నిరకాలు. అలావాళ్లంతటికివాళ్లు జైళ్లుకట్టుకుని వాటిలోబడి కుములుతూవుంటారు.

'చక్కగా, పిల్లలకు మధ్యమటుకు, ఇలాంటి గోడలన్నీ వుండవు. ఒకళ్ళతో ఒకళ్ళు కలిసి యెంతో హాయిగా ఆడుకుంటూవుంటారు. ఒకళ్ళతో ఒకళ్ళు కలిసి హాయిగా పనిపాటలు నేర్చుకుంటూ వుంటారు.

'పెద్దవాళ్ళయితేగాని యీ గోడల బాధంతా మీకుపట్టదు. మీరు చిరకాలం పిల్లలుగానే సుఖపడాలని నేను కోరుకున్నాను. మీరు త్వరత్వరగా పెద్దవాళ్లుగావటం నాకు బాగుండదు.

'మొన్నీమధ్య ఆమెరికా వెళ్లాను మీకు తెలుసుగదూ! కెనడా, ఇంగ్లండూకూడా చూసివచ్చాను. అది ప్రపంచానికి అవతలిపక్కన్నమాట! చాలా దూరప్రయాణం సముద్రాలు దాటిపోవాలి. నిజంగా చెబితే నమ్ముతారోలేదో! ఆదేశాలలో పిల్లలంతా కూడా, అచ్చంగా యిక్కడ మీకుమల్లేనే వున్నారు. ఏమీ తేడాలేదు. అందుచేత, నేను వెళ్ళినచోటల్లా, పిల్లలందరితో కూడా, అంచక్కహా, నిమిషంలో జత చేసుకోగలిగాను.

'వీలున్నప్పుడల్లా వాళ్లతో ఆడుకుంటూ వుండేవాణ్ణి. పెద్దవాళ్ళలో ఎన్నో విషయాలు మాట్లాడాను. కాని వాటన్నిటికంటే పిల్లలతో ఆడుకోవటం నాకు మహా సర్దాగా వుండేది. చిన్న పిల్లలు ఎక్కడైనాక్కి సరే, మంచి కలుపుగోరుతనంగా మనతో హాయిగా వచ్చి ఆడుకుంటారు. పెద్దవాళ్లకు మాత్రం అది చేత గాదు సుమీ! మనకూ వాళ్లకూ యేదో తేడా వున్నట్టు లేనిపోని ఆలోచనలన్నీ చేసి మనతో జత చెయ్యకుండా దూర దూరంగా వుండి పోతారు. అలా వుంటే అదేవంత సర్దాగా వుంటుంది చెప్పండి!

'ఈ మధ్య జపాను దేశపు పిల్లలు నాకో ఉత్తరం వ్రాశారు. తమకో ఏనుగు పంపమని వ్రాశారు. భారత దేశపు నేను వాళ్లకోసం, చక్కటి యేనుగును పంపాను. ఈ యేనుగు మైసూరు నుంచి వచ్చింది — సముద్రాలమీద ప్రయాణం చేసి జపాను దేశం వెళ్లింది. ఆ ఏనుగు టోకియోపట్నం వెళ్ళేసరికి — ఇక చూసుకోండి!—దాని చూసేందుకు, పిల్లలు, ఎలా ఎగబడ్డారనుకున్నారు! — వేలకువేలు —చుట్టేశారు. పాపం వాళ్లు, మరి, మీకుమల్లే, ఆదివరకెప్పుడు ఏనుగును చూశ్లేదాయిరి. ఈ బహుమతివల్ల జపాను పిల్లలకూ మీకూ స్నేహం కుదిరిందన్నమాట. దాన్ని చూడగానే వాళ్లందరికీ మనభారత దేశపు పిల్లల సంగతి జ్ఞాపకమొస్తుంది. వాళ్ళంతా మన దేశాన్ని గురించి మీ మంచితనాన్ని గురించీ చెప్పుకుని సంతోషించుతారు. అలానే మనంకూడా వాళ్ల దేశాన్ని గురించీ అక్కడి మీ చిట్టి చిట్టి స్నేహితుల్ని గురించీ తెలుసుకుంటూ వుండాలి. ఒక్క జపాను పిల్లలమాటే గాదు నేన నేది; ప్రపంచంలోవున్న అన్ని దేశాల పిల్లల సంగతీ మనం తెలుసుకోవాలి. వాళ్ళతో స్నేహం చెయ్యాలి.

'మరోమాటేమిటంటే - ప్రతిదేశంలో నూకూడా పిల్లలు మీకు మల్లేనే ఆడుతూ పాడుతూవుంటారు—చదువుకుంటారు— పనిపాటలు నేర్చుకుంటూవుంటారు; మీకు మల్లేనే మధ్యమధ్య పోట్లాడుకుంటూ కూడా వుంటారు- కాని చిత్రమేమిటంటే మళ్ళీ అదంతా ఒక్కక్షణంలో మరిచిపోయి అంతా వొకటైపోతూ వుంటారు- మళ్ళీ సంతోషంగా ఆడుకుంటూ వుంటారు. ఈ అన్ని దేశాలను గురించి మీరిప్పుడు మీ పుస్తకాల్లో చదివి తెలుసుకోవచ్చు. పెద్దవాళ్ళయాక మీలోకొంత మంది ఆదేశాలకు వెళతారుకూడా. అలాగ వెళ్ళినప్పుడు మీరు గనక స్నేహంగా ప్రవర్తించితే, వాళ్ళు మిమ్మల్నిఎంతో స్నేహంగా ఆదరిస్తారు.

'మొన్నమొన్నటిదాకా, మనదేశంలో ఒకగొప్ప మహాపురుషుడు వుండేవారు- మీకు తెలుసుగా - ఆయన మహాత్మాగాంధీ; కాని, ఆయన్ని మనమంతా, ప్రేమగా ఎలా పిలుచుకునేవాళ్ళం?— "బాపూజీ" అనే వాళ్ళం. ఆయన చాలా గొప్పవారు. ఆయనకు తెలియని సంగతంటూ లేదు. అంత తెలిసినమనిషికూడా, ఏమన్నా,తను తెలిసినవాణ్ణని గొప్పచూపెట్టేవారా? లేదు. ఆయన చాలా నిరాడంబరంగా వుండేవారు. పిల్లలతో పాటుకలిసి, తనో చిన్నపాపాయి అయినట్టు, అంచక్కహా ఆడుకోటానికి వచ్చేవారు. చిన్నపాపాయిలంటే ఆయనకు ఎంతో యిష్టం. ఆయన ప్రతివారికీ స్నేహితుడే; రైతులతోగాని, కూలిచేసేవాళ్లతోగాని, పేదవాళ్లతోగాని, డబ్బున్నవాళ్లతోగాని, ఆయన అందరితోనూ స్నేహం చేసేవారు. ఆయనదగ్గిరికొచ్చిన వాళ్లనందర్నీ ఎంతో ఆదరంగా దగ్గిరికి తీసేవారు. ఒక్క మనదేశంలోవున్న మనుషులకే కాదు - ప్రపంచంలో యేదేశపు ప్రజలకైనా ఆయన స్నేహితుడే. "మనం యెవ్వర్నీ ద్వేషించకూడదు." అని ఆయన మనకు చెప్పారు. పోట్లాడుకోకూడదన్నారు. ఒకళ్లతో ఒకళ్లు కలిసి హాయిగా ఆడుకోమన్నారు. అంతాకలిసి శ్రద్ధగా ఉండి కష్టపడి పనిచేసి మనదేశాన్ని బాగుచేసుకోవాలన్నారు ఆయన చెప్పిన మరో గొప్ప విషయమేమిటంటే! "ఎప్పుడూ దేనిని చూసీ, మనం భయపడగూడదు. నవ్వుతూనూ, సంతోషంగా ప్రపంచంకేసి మనం చూడాలి."

'మంది చాలా పెద్దదేశం. మనమంతా ఎన్నెన్నో పెద్దపెద్ద కార్యాలు చేయవలసివుంది. చేయవలసినపని ఎంతోవుంది. మనలోవున్న ప్రతిఒక్కరూ యేదో ఒకపని చేసి దేశం అభివృద్ధి చెంది ముందుముందు మరింత గొప్పదేశమౌతుంది."

# గుజ్జనగూళ్లు పిచ్చుకగూళ్లు



# ఇరుగు పొరుగులు

**రచయిత**
**శ్రీ పంతుల శ్రీ రామశాస్త్రి**

యన్. వి. రమణయ్యగారు అంటూ పోస్టుమేన్ సావడిలో కవరు పడేసి వెళ్ళిపోయేడు.

అప్పుడే భోజనంచేసి, పేపరు తిరగ వేస్తూ సాయంత్రంవరకూ ఏలా గడపడమా అని ఆలోచిస్తున్న రమణయ్యకి కర ప్రసాదంలా అనిపించింది ఉత్తరం రావడం. అంతేకాదు, రోజూ గోము ఆఫీసులో ఉత్తరాలు కట్టలు కట్టలు రాయడంలో మునిగి, తనకు ఆ మాత్రం ఈ మాత్రం ఉత్తరాలు రాసే మిత్రులను దూరపు బంధువులనూ, ఏనాడో పోగొట్టుకొన్నాడు రమణయ్య. ఇక తన అన్నగారున్నారంటే, ఆయనకి చూడాలనుంటే ఎప్పుడో ఓనాడు జయ లుదేరి వచ్చేస్తాడు. లేదా ఈ సంవత్సరం నీ వంతుకి ఈ మాత్రం వస్తుంది అన్న మాట స్పష్టంగా అనకపోయినా, యింత ఖచ్చితంగానూ లెక్కకట్టి పొలాలమీద వచ్చినదాంట్లో తవవబ్బును తనకు మని ఆర్డరుచేస్తాడు. అంచేత తనకి ఇటీవల ఈ ఉత్తరం వచ్చే సావకాశమేపోయింది. అటువంటిది ఏవిధంగా కాలక్షేపంచెయ్యడమా అని ఆలోచిస్తున్న శలవురోజున ఎక్కడనుండో తెలియకుండా చిత్రంగా ఈ ఉత్తరం రావడంకంటే అదృష్టం ఇంకేముంటుంది.

పడకకుర్చీవాల్చి, తలదగ్గర దిండూ కాళ్ళదగ్గరబల్లా సరిగా అమర్చి, సిగరెట్టు వెలిగించి, నిదానంగా మరేమీ తొందర లేదన్నట్లుగా, ఈ ఉత్తరం చించకుండా ఓపికగా విప్పి, చదవడం ఆరంభించాడు. చదువుతూండగా సరస్వతివచ్చి, కుర్చీవెనక నిలబడి, తలగడమీద చేయి ఆనించుకొని చూస్తున్న సంగతిని, ఒక్కమారు వెనక్కి తిరిగిన అతనికళ్ళే గుర్తించాయిగాని మనస్సుమాత్రం పట్టించుకోలేదు. అదివరకు రెండురోజుల క్రితంవచ్చిన పోట్లాట మూలంగా తాము ఒకరితో ఒకరు మాట్లాడుకోకుండా ఎడమొహంగా ఉంటున్న సంగతికే మరచిపోయి, సరస్వతి అతనితలకు ఆనిస్తూ దిండుమీద చేయివేసి, ఉత్తరం చదవడంలో తానూ నిమగ్నురాలయింది.

ఈ ఉత్తరంలోని సంగతులు తమ ఇద్దరికీ సంబంధించినవీ, అంత బలమయినవీ అయి ఉండకపోతే, తనంతటతానే ఓడిపోయినట్లు ఒప్పుకొన్నందుకు సరస్వతినిగూర్చి రమణయ్య ఏదో ఎగతాళీగా మాట్లాడి ఉండేవాడు. కాని, ప్రస్తుతం అటువంటి వేళాకోళపు మాటలకి సావకాశం లేదనిపించింది.

ఉత్తరం చదవడం పూర్తి అయిన తరవాత, ఇద్దరూ, ఒక్కమారే, మాట్లాడ మొదలుపెట్టేరు.

"కానీ ఇదేదో అంటుకనుక్కొంటూ వుండు" అన్నాడు రమణయ్య.

"ఇదే మర్యాదయమండీ, కలిసున్నంత కాలం అంతలా స్నేహంగా ఉన్నట్టుండి, ఇప్పుడిదా మర్యాద?" అంది సరస్వతి తమలపాకుల అతి త్వరగా సున్నం రాస్తూ అంది.

అతను అంతకంటె తొందరగా కాగితం, కలం తీసి, జవాబుగా రాయడం మొదలుపెట్టాడు.

అతను రాస్తున్నంత సేపూ ఆమె అలా ఆకులకు సున్నం రాసి, అందిస్తూనే ఉంది, మధ్యమధ్యను తానూ ఒక్కొక్కటి వేసుకొంటూ—విరామంలేకుండా ఆకులు నములడంవల్లనో, రాస్తున్న సంగతులు కలిగించిన ఉద్రేకంవల్లనో, ఆ డిసెంబర్ నెల మధ్యాహ్నం అతని ముఖం నిండా చెమట బిందువులు నిలిచాయి—

ఆమె తగా కొలం చేతిలో పని నిలిపి, తువ్వాలు తెచ్చి, అతని ముఖం మీద చెమట బిందువులు కాగితంమీద పడకుండా ఒత్తి, కాగితాలు ఎగిరిపోక అంత తీవ్రంగా కాకుండా మెల్లిగా విసరసాగింది. అతను అంతల రాస్తున్నది ఆపకుండానే, "ఎందుకూ విసరక్కర్లేదు, మరొక్క చుక్క 2 ఆకులూ అందుకొందూ" అన్నాడు.

ఆమె మళ్ళీ ఆకులకి సున్నంరాసి అందించడంలో నిమగ్నురాలయింది.

అతను ఉత్తరం రాయడం సమాప్తం చేసి, బలంగా నిట్టూర్చి, తానే తువ్వాలుతో ముఖం ఒత్తుకొని, "ముడిచిను, నువ్వు వింటే, ఇప్పుడే వెళ్ళి పోస్టుచేసేసి వస్తాను" అన్నాడు.

ఆమె శ్రద్ధగా వినడానికి సిద్ధంగా కూర్చొని, అతను చదవడం ఆరంభించే లోగా, "అయినా ఏమిటో, ఒక్క ఊరులో ఉండి ఉత్తరాలు రాసుకోవడం, మాటామాటా ముఖస్థంగా అనేసుకొంటే బాగుంటుంది, కాని, అయినా ఇప్పుడే వెళ్ళాలా, రపు ఆఫీసుకి వెళ్ళేటప్పుడో వేళకానే సాయంత్రం షికారుకి వెళ్ళేటప్పుడో పోస్టుచేస్తే ఏమి" అంది.

అలాను, 'అలాగా అలాకాక్కుడు, ఇప్పుడే వెళ్ళి పడేస్తే ఈసాయంత్రానికే వాళ్ళకి అందుతుంది. సరే, మరి విను' అని చదవసాగాడు.

"శ్రీ ఎల్. ఆర్. నరసింహంగారికి, ఒకప్పుడు మీ పొరుగునావనని చెప్పుకొనే సావకాశం కలిగిన నేను (అంటె మిక్కిలి దప్పుడుచేసిన మనిషినైనా నాయకునే విన్నపములు:-'

విన్నాకేకానూ, సరిగ్గా నాకేలాగ మొదలు పెట్టేను. అక్కడికి ఏమిటో వచ్చిన వ్యాలు కొన్నిరాసి పత్రికలలో అచ్చువే యించేవని అతగాడికి మహాబుద్ధి తిరుగుడుగా ఉన్నట్టుంది. అమాత్రం భావ, అమాటకివస్తే ఆమాత్రం ఏమిటి, అఖండమైన సమాసాలకి సమాసాలు వాడగల ఉద్దండుడ్ రమణయ్యపంతులు, బి.ఏ. లో తెలుగులో యూనివర్శిటీకి సెకెండు మనం.

"తమరు వ్రాయించిన తే... దీగల ఉత్తరం ఇప్పుడే అందుకొని, అది చదివి ఒకానొక మహత్తర విషయం తెలుసుకోగలిగేను కదా అని మిక్కిలి ఆనందించినవాడనయినాను.

తమరు నాలుగు పేజీల పొంకతిరుగుడు భావంలో నాకు గావించిన హితబోధ యొక్క సారాంశాన్ని ఒక్క వాక్యంలోకి కుదించినా అర్థం అట్టే చెడిపోదనుకొంటాను—నేనూ నాభార్యా తరుచు కీచులాడుకోవడమూ, ముఖ్యంగా నేను తరచు ఆమెమీద బిగ్గరగా కేకలువేయడమూన్నూ మూలంగా, తమ ప్రశాంతికి భంగం కలుగుతూ ఉండినట్లుగానూ, అంటే తమ ప్రశాంతికంటె కూడా ముఖ్యంగా మా సౌఖ్యం లాభం పీటదృష్టిని చూసినా, మేము, ఇప్పుడు మానడుము లేనటువంటి సామరస్యాన్ని కలిగించుకొని పెంపొందింప చేసుకోవడము సర్వథా శ్రేయోదాయకమని తమ ఉత్తరం సందేశం అనుకొంటాడు. ఈ నా అర్థంచేసుకొనే పద్ధతిలో పొరపాటుంటే, (నాలో వ్యక్తులనుగాని, పరిస్థితులనుగాని అర్థంచేసుకొనే శక్తి పూర్ణానుస్వారమునేకదూ తమ ఉత్తరంయొక్క ప్రధాన బోధ సాలత్యం) తెలియజేస్తే అతి కృతజ్ఞుడుగా ఉండగలవాడను.

భోజరాజు ముఖం చూస్తే కవిత్వం పుట్టుకొచ్చేదని చెప్పేటట్లు, తమ ఉత్తరం చూడ్డంతో, కొన్ని సంవత్సరాలుగా ఉత్తరాలురాయడం అలవాటులేని నాలో ఈ ఈ ఉత్తరం రాసే ఓపిక ఉద్భవించింది—అందుకు మీకు చాలా ఋణపడి ఉన్నాను.

తమ ఈ ఉత్తరం మొదటి పేరాలో ఒక చోట, "ఎదురుగా ఉన్నప్పుడు చెప్పడానికి వెనకతీసినా, ఇది ఉత్తరం గనుక నిర్మొగమాటంగా, సహృదయుడయిన మిత్రుడికి వ్రాసినట్లుగానే వ్రాస్తున్నాను" అని వ్రాసేరు. అదే దృక్పథంలో ఈ నా ఉత్తరాన్ని అర్థంచేసుకొంటారని ఆశిస్తున్నాను.

నేను తమవంటి విఖ్యాత రచయితను కాను గనుక, ఎక్కువ పేజీలకి పేజీలు విలక్షణమయిన భాషలో నలుపు చేయలేను. కాగా, సంగ్రహంగా మాకు తమవల్ల లోగడ కలిగిన అపదుపాయాలను కొన్నింటిని మనవిచేసుకొంటున్నాను.

ఒకటి, తమరు కావ్యగానం అన్న పేరుతో నిత్యం ఆ చదివిన పద్యాలే మళ్ళీ మళ్ళీ రోజూకొక పర్యాయమయినా పెద్దగొంతుగా చదువుతూ ఉండడమూ,

రెండు, తమకు ఇంట్లో ప్రశాంతంగా లేదని తోచిన సందర్భాలలో తమ పొరుగున ఉండడమే మేము చేసిన నేరం అన్నట్లుగా 'పోయి పొరుగువాళ్ళింట్లో ఆడుకోండర్రా' అని తమ పిల్లల్ని మాయింటికి తమ చిత్తంవచ్చినప్పుడల్లా పంపడం— అంటే మీపిల్లలవచ్చి మాయింట్లోనూ, మాతోనూ ఆడుకొన్నందుకు మేము బాధపడ్డామని కాదు గాని, చూచేవారమూ, కేవలం తమ సదుపాయంకోసం మా ఇష్టా ఇష్టాల సంగతీ సందర్భా సందర్భాల సంగతీ వ్యవహరించడం జరిగిందని ఉటంకించడం మాత్రమే ఇక్కడ నా ఉద్దేశం.

ఇక మూడవ సంగతి, తమ భార్యాభర్తలకి సంబంధించినది. తమరు మా సుతించి అంతగా ఆత్మీయులుగా సహాయం ఇచ్చి వుండకపోతే, నేనీ విషయం ప్రసంగించడానికి హక్కు లేదని అనుకొనేవాడినే. తమరు నా ప్రవర్తనలో కొద్ది పాటి ప్రయత్నంతో సవరించుకోవలసిన లోటుపాట్లున్నాయే, అటువంటివే నాకూ మీలో తోచినవి చిరువ వివరిస్తున్నాను— మీలో మీరు బిగ్గరగా కేకలువేసుకోవడం అయితే మేము వినలేదుగాని, మీరు కొన్నికొన్ని సందర్భాలలో ఇంటికి రాత్రి అతి ఆలస్యంగా రావడం అయితే లేమి, అంతవరకూ ఏమీ తెలియజేయకుండా కేవలం ఏ ఇద్దరు ముగ్గురు స్నేహితులనో భోజనానికి పిలుచుకొని రావడం అయితేనేమి, ఇంటికి కావలసిన వస్తు సామగ్రులు బజారునించి తేవడం సంబంధంలో అసమానమయిన అశ్రద్ధ ప్రవర్తించడమే కాకుండా భోజనంలోకి మాత్రం అలవాటయిన ఏ ఒక్క పదార్థం లోటువచ్చినా లేచిపోవడమూ గసంలో తరువాత అధిక భోజనంచేసినా చెయ్యక పోయినా లక్ష్యం చెయ్యకపోవడం, ఇంకా ఇటువంటివే మరికొన్ని సంగతులు కూడా వున్నాయి. అవన్నీ మీకు తెలియనివి కావు. నేను తెలుసుకోవలసినవి కావు; అయితే పని మనుషులమూలంగానో, మరొక విధంగానో మాకు తెలియడం తప్పలేదు—అవన్నీ ఇక్కడ రాయడంవల్ల మరింత గ్రంథం పెరగడమేగాని, ప్రయోజనం వుంటుందనుకోను.

ఇంతకీ నేను తెలియజేయవలసినది ఒక్కటే ముఖ్యమయిన సంగతి. మాకు మా పొరుగున వున్నప్పుడు మా భార్యాభర్తల వివాదమూలంగా కొంత మానసికంగా అపదుపాయం కలిగిందన్నారే, అంతకు పదంతలు అపదుపాయం మాకూ మీవల్ల బహుకారణాలవల్ల కలిగి తీరిందన్న అంశాన్ని ఇప్పటికయినా గుర్తించి, అన్నింటినీ అత్యంత సానుభూతితో వీక్షించగలరని చెప్పుకొనే తమ రచయితృ శక్తికి సార్థక్యం ఆపాదిస్తారని ఆశిస్తున్నాను.

శలవు. ఇందుకు ప్రత్యుత్తరం వ్రాయవలసిన అవసరం తమకి కనిపిస్తుందని నిబ్బరంగా అనుకోలేను. చిత్తగించవలెను.

విధేయుడు,

యన్. వి. రమణయ్య వ్రాలు,

ఏం సరసూ! ఎలా వుంది ఉత్తరం? అసలు ఈ ఉత్తరంభాగం తక్కువా ఉపోద్ఘాతం ఎక్కువ అయినట్టుందికదూ. అయితే కానీ, మరి మార్చడానికి వైము లేదు. కాక, ఇప్పుడు మన మిది అందరూ చదవాలని పత్రికలలో ప్రచురించబోవడం లేదుకదా, మనల్ని అనవసరంగా గిల్లినందుకు మనకీ ఆశక్తి లేకపోలేదని గుర్తింపజెయ్యడమే మన ఉద్దేశం. ఏదీ ఆ కుండువా? ఇలా అందులో మళ్ళీ మరొక మారెందుకూ, ఇప్పుడే ఏమయినా వస్తువులు తీసుకొనిరావలసివుంటే చెప్పు."

"ఏమీ లేవుగాని అంతదూర ఇప్పుడు నడిచి వెళ్తారా? పోనీ రిక్షామీదయినా వెళ్ళ కూడదా?

"రోజూ ఇంతకు రెండింతలు దూరం ఆఫీసుకి వెళ్ళడం లేదా ఏమిటి? వస్తువులు తేవలసినవేవీ లేవన్నావు కదూ?"

* * *

"జయనేదో రాసేరే అనుకోండి. అయినా మీరు అంత తీవ్రంగా రాయకపోయుంటే బాగుండేది."

"ఈ మాట అవేళే చెప్పలేకపోయేవా?"

"ఏమిటో మీరు ఆలోచనకయినా వ్యవధి ఇస్తే కదూ. ఈ ఉత్తరంవచ్చి రావడంతోనే బరబరా రాసిపారేసారు—పాపం, ఆవిడ రాజేశ్వరమ్మ, అసూయపరురాలు, ఎంత బాధపడిందో, అక్కయ్యగారూ మీరూ బావగారితో కలిసి నన్ను వేరేలా అనుకొంటున్నారు కాబోలు. నాకే తెలిసి ఉంటే అటువంటి ఉత్తరం రాయనిచ్చేదాన్నా?" అని రాసింది. తనే కష్టా మనుకొందట గాని. వాళ్ళ చేతిపిల్లకి జ్వరం వస్తూందట - ఆనక నేను ఒక్కమారు బండీ చేసుకొని వెళ్ళాలనుకొంటున్నాను."

"సరే, వెళ్ళు గాని, నాకూ కొంచెం ఇదిగానే ఉంది. అతనూ చాలా నొచ్చుకొన్నట్లున్నాడు తనుచేసిన పనికి. నాకూ ఆఫీసుకి ఒక చిన్న ఉత్తరం రాసేడు మనల్ని పొరపాటుగా అర్థం చేసుకొన్నందుకు క్షమించమంటూ."

* * *

"ఏం సరసూ అలా వున్నావు? కోపమా?"

"లేదండీ, మామూలుగానే ఉన్నాను."

"నువ్వు లేదనగానే సరా? నీ మొగంలో అంత స్పష్టంగా కనిపిస్తూ ఉంటే. ఇవాళ ఉదయం నేను ఆఫీసుకి వెళ్ళేవరకూ సరదాగానే ఉన్నావు. ఈ లోపున నేను ఏమయినా పొరపాటు చేసి ఉండడానికి సావకాశం ఉందా? ఏదీ జ్ఞాపకం చేసుకొని కానీ, నేను గాని ఏమయినా తెస్తానన్న వస్తువు తీసుకొని రాలేదా? అయినా అంత మాత్రంలో ఇంతకోపం తెచ్చుకోడమే నా చిట్టనలక."

"అబ్బె, మీమీద ఏమీ కోపంలేదంటే నమ్మరు కదా!"

"అయితే మరెవరి మీద కోపం వచ్చిందో ఎందుకు వచ్చిందో నాకేమీ తెలియజెయ్య కూడదన్న మాట?"

"చెప్పడాని కేముంది లెండి, ఇంటింటా ఒక పొయ్యి ఉంది, మాయింట మరొక పొయ్యి ఉందని, మనకి ఉండనే ఉంది కదూ పొరుగు—"

"ఏం జరిగిందేమిటి? ఇవాళ మళ్ళీ ఏమయినా?"

"కొత్త జరగడాని కేముంది? ఎప్పుడూ ఉన్నదేకదూ. మీరీ ఇల్లయినా మార్చెయ్యండి, లేదా నన్ను మా వాళ్ళింటికయినా పంపించెయ్యండి. అంతేకాని, నేనీ ఇంట్లో ఉండలేను సుమండీ."

"మాంచిపనే, తాడు చాలదని మయ్యిపూర్తిం చెయ్యమన్నట్లు పొరుగు వాళ్ళకి జడిసి, మనం ఇల్లు మార్చుకొంటామా?"

"మార్చుకోకపోతే మీకంత సుఖంగా ఉంటే మీ రుండండి; వద్దనడానికి నేనెవతెను—గాని, నేనుమాత్రం ఉండలేనంతే"

"అసలు జరిగిన సంగతేమిటో చెప్పు."

"చెప్పడానికి అసలు ఒక సంగతి అంటూ ఉంటేకదూ, సరే, ఆజామి చెట్టు కొమ్మలు విరిచేసినందుకు ఏమీ అనలేదు. చేమంతి పువ్వులే కాదు, మొగ్గలు కూడా లేకుండా దూసేసినా పల్లెత్తుమాట అనలేదు ఆవిడ నోటికి జడిసి; మధ్యాహ్నం జడవేసుకొని, గులాబీపువ్వు పెట్టుకొందామని పెరట్లోకి వెళ్ళేను. మరేముంది, ఈ రెండేళ్ళాయి ఇత కష్టపడి పెంచిన ఎరుపూ తెలుపూ రెండు గులాబీ మొక్కలూ అన్ని పువ్వులతో మా మొదలుకి తెగి పడి ఉన్నాయి."

"ఏమిటి రెండూనా? చంటి పిల్లల తల్లులు పిల్లల్ని పెంపకంలో కూడా పడ్డ శ్రమకంటె ఎక్కువ శ్రమపడి పెంచేవు—

"అది శ్రమకాదు, సరదా, శ్రద్ధాను, ఏమయితేనేం లాభం. రెండూ నేలమట్టమయేయి. నిజంగా నాకు, చెప్పలేనంత దుఃఖం కలిగిందంటే నమ్మండి"

కాదూమరి, ఆ సంగతి వింటేనే ఇంత బాధగా ఉందికదా. ఊఁ అయితే?"

"దగ్గర్లో వాళ్ళ పెద్ద కుర్రాడు శంకరం చిన్న గొడ్డలి ఒకటి పట్టుకొని, సాము చేస్తున్నట్టుగా తిప్పుతూ కనిపించేడు."

"గట్టిగా రెండు తగలనిచ్చేవు కాదూ?, నేనయితే మెత్తగా చితకొట్టి ఉండేవాణ్ణి."

"ఇంకానయం; 'ఉప్పులేకనే ముప్పందుం' అన్నట్లు, ఏమేమో ఆవిడ విరుచుకు పడుతూంది కదా—నివండిమరి,"ఏమోయి శంకరం, నువ్వేనా నరికేసే" వన్నాను— పన్నెండేళ్ళు వచ్చేయికదా పోనీ పోనీ సిగ్గయినా లేదేమోనండీ.

'నేనే' అన్నాడు ఏదో మహా ఘనకార్యం సాధించుకొని వచ్చిన వీరాధివీరుడులాగ, నాకు మరి ఉండబట్టక, "ఏంజేసేవోయి అని నిన్ను, అలాంటి మాన అవి ఉంటే చక్కగా పువ్వులు పూసే వాటిని నరకాలని ఎలా బుద్ధి పుట్టింది నీకు. స్కూలులో చదువు కొంటున్నావేమో, మరి, నీకే ఈ బుద్ధి పుట్టిందా. లేక ఎవరయినా చేయమన్నారా?" అని అడిగేను. సరిగా ఇదేనుమండీ, నేనన్న మాటలు, అదీ పెద్ద ఓగ్గరగా కాదు.

"అక్కడేఉంది నీలో పొరపాటు. ఇదివరకు వాడికి మాటలతో చెప్పడం చాలా మార్లు జరిగింది. మొన్న ఆవకాయకుండ రాయివేసి, పగలగొట్టిననాడే నాకు బాగా కోపం వచ్చింది. అయితే నువ్వు పెద్ద వాళ్ళతో పోట్లాట వస్తుందని వెనక్కిలాగేవు కాబట్టి ఊరుకొన్నాను. ఇవాళే నేనుంటే"

"అందుకే నేను సంతోషిస్తున్నాను. అక్కడికి నేనన్న మాటలకే, చెప్పేను కదూ, సరిగ్గా నేనన్న మాటకే ఆ విడ ధుమధుమ లాడుతూ వచ్చి కొడుకుని దబదబా నాలుగువేసి తిట్టడం మొదలు పెట్టింది"

"పోనీ ఇంకా కొట్టుకోని, తిట్టుకోని, మనకేం..."

కొట్టుకోడం, అంటే వాడికి బుద్ధి గావాలని ఆ విధ ఈ ప్రేశ్యం అయితేకదూ, అక్కసుకొద్దీ వాడిపేరు పెట్టి మనల్నే తిట్టడం మొదలుపెట్టింది, ఆ తరవాత ఒక అంతూపొంతూ అంటూ ఉంటేకదూ, ఇప్పటివరకూ ఒకటే ప్రవాహం

"బాగుంది, తిప్పు లేనలో పెట్టుకొని వైగా తిట్టడం కూడానా? అయినా సవ్వింత చేతకాని దానివెల్లా అయావా? అని నా విచారం"

"మీరేనన్నలా తయారు చేసేరు. అదుగో మీ కు నవ్వులాటగానే ఉంది. నేను మాత్రం పడలేను సుమండీ ఈ తెంపురేని బాధ. ఒక్క నిముషమయినా మనసుకి శాంతన్నది లేకపోతే, పనిమనిషితో ఒక అరగంట, అవతల ప్లీడరుగారి పెళ్ళాం జానకమ్మగారితో ఒక గంట, దారంట పోయే అమ్మలక్కలని పిలిచి రెండుగంటలూ, నాకు వినబడాలనే, వినలేక నాచెవులు చిల్లులు పడుతున్నాయి. గొడ్డుబానికేం తెలుస్తుందమ్మా బిడ్డముద్దు" లు - మళ్ళీ తనకేమయినాపిల్లల ముద్దుందేమో అంటే, గంట గంటకీ తనూ మొగుడూ ఇద్దరూ పిల్లల్ని చావగొడుతూనే ఉంటారు. వాళ్ళ పిల్లలంటే నాకు ముద్దులేదట. అదొక పెద్ద నేరమట, కాక ఏమయినా ముద్దు చేయడానికి తగి ఉంటేనా? రత్నాసెం కెలూ, రాలుగాయాలున్నూ..."

"మచ్చితంగాఉంటే మనం మాత్రం ముద్దు చెయ్యమేమిటి? మునుపు నరసింహంగారి పిల్లలు తెల్లవారి లేచినది మొదలు రాత్రి పడుకోబోయేవరకూ నీతో కేఉండీ వారు అత్తయ్యగారు, అత్తయ్యగారు, అంటూను."

"బాగుందండీ, రత్నానికీ గులకరాయికీ సాపేక్షఅన్నట్లు, వాళ్ళకీ వీళ్ళకీ నడుమ ఎన్నితాళ్ళు వెయ్యాలి. వాళ్ళపిల్లలు ఒకవస్తువు పాడు చెయ్యడంగాని, రవ్వంత గల్లంతు చెయ్యడంగాని ఎరుగుదురా?" వాళ్ళ సుశీలని పెరట్లోకెళ్ళి పువ్వులు కోసుకోఅమ్మా అంటే కూడా నవ్వేసి ఊరుకొనేది—నేను కోసిఇస్తే, తీసుకొనేది; అంతే; కొంత స్వతహాగా పుట్టుకొని రావాలి; కొంత తల్లిదండ్రులు తరిఫీజు కూడాను, అంతలా పిల్లలు మనతో నవ్వుగాఉన్నా, రాజేశ్వరమ్మ మనకెక్కడ విసుగ్గా ఉంటుందో ఏమో నని మనంపిలవకుండా రానిచ్చేదికాదు."

"నిజమే, అయితే మనకే వాళ్లు లేకపోతే, ఒక్కతుణంతో చేదికాదు. అసలు మనలోమనకి వచ్చిన ఎన్ని పోట్లాటలు వాళ్ళ చిన్నపిల్లలయితేనేం పరిష్కరిస్తూ

(12-వ పేజీ చూడుడు)



మదనపల్లె సమీపమునున్న అంకిశెట్టిపల్లె గ్రామమున, కస్తూరిబా గాంధి ట్రస్టు యాజమాన్యమున జరుపబడు బేసిక్ పాఠశాల నూతన గృహప్రవేశ సందర్భపు ఛాయాచిత్రము

# సంపాదక లేఖలు

అర్యా,

కృష్ణా జిల్లాలో వరదవలన, తుఫాను వలన చాలా యిండ్లు నేల మట్టమైనవి. పేద ప్రజలు, ముఖ్యంగా బుడమేరు, కొల్లేరు ప్రాంతములోని మాలమాదిగలు తినతిండి, కట్ట బట్ట నిలువ నీడలేక, యీ చలికాలములో గడ గడ వణకుచూ, డొక్కలు సన్నగిలి, బెంగాలు కరువును స్మృతికు తెచ్చు కడు హీనస్థితి యందున్నారు. ప్రభుత్వ ఉద్యోగులు, తాటియాకు వంద 7, 8, రూపాయలు అమ్మే ఈ దినములలో యింటికి 10 రూ మరియొక చోట 20 రూ మాత్రమే పంచుచున్నారు. కొందరు హరిజనులకు యీ కనీస పైకమయినను ముట్టనేలేదు. ఈ చలికాలములో ప్రసవించు స్త్రీల ఆర్తనాదములు ఆ పరమేశ్వరునికే యెరుక. ఈ జిల్లాలోని విద్యార్థుల తండ్రులు (హరిజనులు, హరిజన క్రైస్తవులు) తమ పిల్లల ఫీజు కట్టలేక స్కూళ్లకు మాన్పించుట కూడా జరుగుచున్నది. కావున గవర్నమెంటు వారు తగు శ్రద్ధ తీసికొని, యీ బీద ప్రజల కష్టములు తీర్చవలయునని విజ్ఞప్తి చేయుచున్నాను.

అప్పికట్ల జోసఫ్
విజయవాడ

* * *

## వెనుకబడినజాతుల విద్యార్థులకు స్కాలర్ షిప్పులు

ప్రభుత్వంవారు వెనుకబడిన జాతుల అభివృద్ధినుగురించి తమకు సలహాలు ఇచ్చుటకు ఒక సలహా సంఘమును నియమించిరి. ఇది సంతోషకరము.

ఈ జాతుల విద్యార్థులకు స్కాలరు షిప్పుల నిమిత్తమై కొంతడబ్బుగ్రాంటు ఇచ్చుటకు కూడ నిర్ణయించి గెజిటులో ప్రకటించిరి. ఆ విషయము తెలిసి ఈ జాతుల పేదవిద్యార్థులు ప్రభుత్వంవారికి దరఖాస్తుపెట్టుకున్నారు. ప్రభుత్వంవారు హరిజనశాఖ అధికారుల ద్వారా ఈ జాతుల పేద విద్యార్థులకు ఇవ్వమని కొంతడబ్బు యిచ్చినారు. కాని ఇంతవరకు స్కాలర్ షిప్పులు మంజూరుకాలేదు. ఇప్పడైనా మద్రాసు ప్రభుత్వమువారు చర్యతీసికొనవలెనని కోరుచున్నాము.

బత్తిన రంగనాయకులు
(భీమవరం)

* * *

## "బి" క్లాసు వైద్యుల రిజిస్ట్రేషన్

ప్రస్తుతం మనరాష్ట్రంలో సుమారు 1200మంది గ్రామాల్లోనుండే వైద్యులు "బి" క్లాసులో రిజిష్టరగుటకు గాను చాలాకాలంక్రిందటనే సెంట్రల్ బోర్డుకు దరఖాస్తులు చేసియున్నారు. ఇందులో కొంతమంది సంవత్సరం, రెండు సంవత్సరముల క్రిందటనే తమ దరఖాస్తులను, ప్రభుత్వం నిర్ణయించిన శుల్కములను, ప్రభుత్వ ఖజానాలలో చెల్లించి పంపుకొనియున్నారు. వారి దరఖాస్తులనన్నింటిని, ఇటీవల సెంట్రల్ బోర్డువారు తగిన కారణములను చూపకయే, ఒక్కుమ్మడిగా రిజిష్టరుచేయ నిరాకరించియున్నారు.

ఈ దరఖాస్తు చేసినవారిలో చాలామంది మంచి వైద్యజ్ఞానంకలిగి, అనువంశికముగా వైద్యంగల కుటుంబాలలో జన్మించినవారగుటచే నిర్దుష్టమైన అనుభవజ్ఞానంకలిగి, చిరకాలంగా యేవైద్యం లభ్యంకాని మారుమూలకు గ్రామాల్లో వసించే, వేలకొలది పేదల ప్రజానీకమునకు వైద్యసేవచేస్తున్నవారుకలరు. ఏ విచారణలేక యిట్టివారందరి దరఖాస్తులు త్రోసివేయుట మిక్కిలి అన్యాయము.

సెంట్రల్ బోర్డువారు యిట్టి దరఖాస్తులను పునర్విచారించి, అర్హతలున్నవారిని, రిజిష్టరుచేయుట భావ్యము. ప్రభుత్వమువారు, అందును ప్రజారోగ్యశాఖవారు యీ విషయమై, అవసరమగు చర్యలు గైకొని, నష్టపడిపోవుచున్న 1200 మందికి దారిచూపింతురుగాక.

గొల్లపూడి వెంకటసుబ్బయ్యాశాస్త్రి
వినయాశ్రమం.

# చిత్రాలలో వార్తలు

గవర్నర్ జనరల్ చక్రవర్తి రాజగోపాలాచారిగారు, గవర్నర్ భావనగర్ మహారాజా సమేతులై విశాఖపట్నంలోని ప్రేమసమాజాశ్రమం సందర్శించినప్పటి దృశ్యం.

ఇండియా-అమెరికా మహాసభలో పాల్గొంటానికిగాను యీ నెల 11 న ఢిల్లీకివచ్చిన 25 మంది అమెరికా ప్రతినిధులు రాజఘాటు దర్శించి మహాత్మాగాంధీకి జోహారు లర్పించారు.

లేడీ ఇర్విన్ కళాశాలలో జరిగిన ఉభయప్రతినిధుల సమావేశములో భారతప్రధానమంత్రి పండిట్ నెహ్రూ ఉపన్యసిస్తున్న దృశ్యం.

# ఇరుగు పొరుగులు

(11-వ పేజి తరువాయి)

ఉండేవారుకారు—వాళ్లు వెళ్ళిపోవడంతోనే మనగొడవలు మరీ ఎక్కువయేయి కూడా—"

"అసలీ ఇల్లుగలవాళ్ళనాలి, వాళ్ళు వచ్చి ఉన్నదీలేదు, చేసినదీలేదు. పాపం రెండేళ్ళుగా ఉన్నవాళ్ళని లేవగొట్టేరు. మనకిష్టై ఈరకంపొరుగు తటస్థించడానికే వచ్చినట్లుంది ఇదంతా. ఇన్నేళ్ళాయి ఉంటూఉండిన మనం కూడా ఇల్లువిడిచి పెడితేనేగాని తప్పేట్టులేదు. లోటిపిట, ముందు మంచిగా తలమాత్రం పెట్టుకోనిమ్మని, క్రమంగా పూర్తిగా ఆక్రమించి నీకంతకష్టంగాఉంటే నువ్వే బైటికిపో అన్నట్లుంది.

"కాని, మనమే ఇల్లువిడిచి పోతామంటావా? అది మనకి పరువు తక్కువకాదూ. చేతనయితే వాళ్ళను లేవగొట్టాలి లేదా..."

"ఏమిటి పోనిద్దురూ, ఇంతమాత్రంలో పరువు ఉండడానికీ, పోవడానికిన్నీ. ఏదో తగాదా ఒదిలిపోతే చాలును—రెండు వాటాలుగా కాకుండా, చిన్నదయినా సరే, వేరేఉన్న ఒక్కయిల్లు తీసుకొంటే ఏచీకూ చింతా లేకుండా ఉంటుంది— కాస్త కలిసిమెలిసి ఉండేవాళ్ళయితే, వాళ్ళో మనమో వేరే వెళ్ళిపోవలసివస్తే కొన్నాళ్ళపాటు ఏ! విచారించినట్లుగా ఉంటుంది. ఇక ఇప్పటిలాటి వాళ్ళయితే చెప్పేదేముంది. నిత్యాగ్ని హోత్రమే, మరెప్పుడు చూస్తానిల్లు?"

"బాగుంది, తలవగానేకోతాతకి పెళ్ళా?"

* * *

"ఇలు కుదుర్చుకొని వచ్చేశాను."

"ఆఫీసుకు వెళ్ళలేదూ?"

"వెళ్ళకేం వెళ్ళానే, అయితే ఆఫీసులోనే ఇల్లు నిశ్చయంచేసేసెను. ఈ ఫస్టు తారీఖునే మారిపోవచ్చును."

"అయితే మీరు చూడకుండానే నిశ్చయం చేసేసేరన్నమాట—అబ్బ, అన్నిటికీ మీకిదే తొందర. నిన్న సాయంత్రం నేనేదో అంటే, తలవగానే తాతకి పెళ్ళా? అన్నారు. ఇప్పుడు వెళ్ళి మంచీ, చెడ్డా ముందూ వెనకా ఆలోచించకుండా ఏదో ఒకటి కుదుర్చుకొని వచ్చేసారు. ఇప్పుడు చేతిలో ఉన్నది ఇది విడిచిపెట్టాక ఇంతకంటె చిక్కయినది దొరికితే? అప్పుడు మళ్ళీ వెనక్కి తిరిగి రావడానికి కూడా వీలుండదుకదా! ఏమయినా ఇంత తొందరగా ఆలోచనలేకుండా చేయడం నాకేం నచ్చలేదు సుమండీ.—"

"నేను చెప్పేదిక్కడి చివరంటా విని తరవాత మాట్లాడితే, బాగుంటుంది. నిన్న నువ్వు ఇల్లుమార్పితేరాలంటే, పోనీ నువ్వింతలా అంటున్నావు. కాబట్టి, సరే నీ యిష్టమే కానీ అని కుదుర్చుకొనివస్తే, తీరా ఇప్పుడిల్లా అంటే, నా తరమా? ఎంత నియంతృత్వపద్ధతి అయినా ఇంత తుణే తుణే మారేట్లయితే ఎలాగ?"

"అదిగో నవ్వుతున్నారు. ఏదో నన్ను గమ్మత్తు చెయ్యడానికీ, నా చేత వద్దనిపించడానికీ ఇలా చమత్కారం చేస్తున్నారు. కానీండి, నేనుమాత్రం ఏమీ తీసిపోయేదిలేదు. కానీండి, మీ చిత్తం నచ్చినట్లు ఎటువంటి ఇరుగు పొరుగులు తటస్థించినా సరే, నాకేం అభ్యంతరంలేదు. ఫస్టు తారీకుదాకా అక్కరలేదు. రేపే, మారిపోదామన్నా నేను సిద్ధమే. అయ్యో మీరు మళ్ళా ఇప్పుడే ఆఫీసుకి వెళ్ళిపోతారు కాబోలు. ఉండండి, కాఫీనీళ్ళు కుంపటిమీద పడేసి వస్తాను."

"కాఫీ, వద్దులేగాని, మరి విను, ఇవాళ ఆఫీసుకి వెళ్ళగానే వచ్చింది ఉత్తరం, అయితే ఇవాళ కొంచెం పని ఎక్కువగా ఉండడంవల్ల, ఒంటిగంటకి లేద్దామనుకొన్నది. ఒంటిగంటన్నరయింది."

"అయితే ఇంతకీ ఉత్తరానికీ మనకి ఇల్లు కుదుర్చుకోడానికీ ఏమిటి సంబంధం?"

"అదే మరి వినమంటున్నాను. నరసింహంగారి దగ్గరనించే ఈ ఉత్తరం."...

నమస్కారములు. అప్పుడు మీ రున్న ఇంటిని విడిచిపెట్టినప్పటినుండీ, ఇప్పటికి మూడిళ్ళు తిరిగేము. ఎక్కడా మనస్సుకి కాస్త తృప్తిగా శాంతిగా లేదు. అసలు ఈ లేక పోవడమన్నది కేవలం ఇళ్ళవల్ల కాక, ఇరుగు పొరుగులవారితో మేము సరిగా కలియలేక పోవడంవల్లనే అనుకొంటాను.

ఏమయితేనేమి ప్రస్తుతం ఉన్న ఇంటిని కూడావిడిచిపెట్టదలచుకొన్నాము. మేము మీయింటిని విడిచిపెట్టినతరువాత, నేను మిమ్మలను సరిగా అర్థంచేసుకోలేక రాసిన ఉత్తరంమూలంగా మన నడుమకొంత అలజడి కలిగినా, అందువలన ముఖ్యంగా నాకు సంబంధించినంతమటుకు, సత్ఫలితం లేదనడానికి వీల్లేదు. కాక, యథార్థానికి మనం కలిసిఉన్న రోజులు ఎటువంటి సంఘర్షణలూ స్పర్థలూ లేకుండానే గడిచిపోయేయి. ఇటీవల కొన్ని నెలలుకూడా ఒక చోటమేము స్థిరంగాఉండలేకపోవడాన్ని చూస్తే, ఇంతకంటె మనం చాలా బాగా కలిసి ఉండేవారమని తేల్తున్నది.

ఇప్పుడునేను మాట్లాడిన ఇల్లు కొత్తపేటలో. ఇంటికి చుట్టూ పువ్వులమొక్కలూ అవీ వేసుకొందికి కావలసినంత స్థలం ఉంది. నీటికి కొళాయి ఉంది; ఎలక్ట్రిసిటీ ఉంది. నుయ్యికూడా వుంది. ఇల్లు కట్టిన పద్ధతికూడా ఇద్దరు అన్నదమ్ముల వాటాలు అన్నట్లుగా ఒకదానితో ఒకటి కలిసి వున్నప్పటికీ వేరేవేరే ద్వారాలూ అవీ ఉండి, చాలాబాగుంది. నాకు ఒక ముఖ్యస్నేహితుడి మధ్యవర్తిత్వం మూలాన ఇది లభ్యమయింది. అయిదారు సంవత్సరాలలోపున మనం కదలవలసిన అవసరం ఉండదు. అద్దెకూడా, అక్కడమనం ఉభయులం కలిసి యిచ్చే అద్దెకంటె ఎక్కువలేదు. అయితే అంత నేనుఒక్కణ్ణే ఇచ్చుకోలేను. కాబట్టి మీకంటె మాతో కలిసిమెలిసి వుండగలవారు మరొకరు దొరకరని విశ్వాసం వుండబట్టి ఇలా రాస్తున్నాను. మీరు మరోలా అంటారని ఊహించలేక పోతున్నాను. అయితే మీరు ఇన్ని సంవత్సరాలుగా వుంటూవున్న ఇంటిని మార్చడానికి యిష్టపడకపోతే నేను చెప్పలేను. కాని, మీరిప్పుడు వుంటున్న ఇంటికంటె కొన్నికొన్ని అదనపు సదుపాయాలు ఈ నేను చెప్పిన ఇంటిలో ఉన్నాయనక తప్పదు. ఒకటి ఎలక్ట్రిసిటీ, రెండు వేసవికాలంలో మనం చాలా బాధపడేవాళ్లం. ఈఇంటికి చక్కగా రెండు భాగాలుగా విడదీసిన డాబావుంది. ఇన్నిటికంటె ముఖ్యం చుట్టూ చాలా విశాలమయినస్థలం వుంది, నాలుగురకాల్లమొక్కలూ వేసుకొందికీ, కావాలంటే పెరట్లో ఒక సాల వేసుకొని, ఒక ఆవుని పెంచుకొందికి కూడా సావకాశం వుంటుంది. ఈ సందర్భంలో మీరు లోగడ కొన్నిమార్లువిసుగుకోవడం వినివున్నాను గనక ప్రత్యేకించి రాస్తున్నాను...నేనే స్వయంగా వచ్చి, మిమ్మల్ని తీసకొనివెళ్లి ఇల్లు చూపెట్టాలనుకొన్నాను. కాని, తప్పనిసరిగా ఊరికి వెళ్లవలసివుంది; అక్కడనుండి తిరిగివచ్చే వరకూ ఆలస్యం ఎందుకని, ఇక్కడ స్టేషనులో కూర్చొని రాస్తున్నాను. ఆ న వాలు క్రిందని రాసేను. ఈ సాయంత్రం మా శ్రీమతి మీయింటికి వస్తానంటున్నాది. ఇద్దరు గృహిణులూ కలిసివెళ్లి యిష్టపడివస్తే, మనకి మరి ఏఅడ్డంకీ వుండదనుకొంటాను. ఈ ఫస్టుతారీఖుకే మారిపోవచ్చును ...అవతల రయిలు వచ్చేసింది. కాకపోయినా మీరి రాయడానికొట్టే సంగతులు లేవు. మరీ సందర్భంలో తప్పక సహకరించగలరని ఆశిస్తున్నాను. నరసింహం.

"వినాపుకదూ, నిన్ను కొత్తపేట వెళ్ళడానికి సిద్ధంగా వుండమనడంకోసం వచ్చేను.

"అయ్యో అమాత్రానికి ఆఫీసునుంచి ఇంతదూరవచ్చారా? ఆవిడ ఎలాగూవస్తుందికదా?"

"అయితే మరి నీకుముందుగా చెప్పేదన్న పేరుండవద్దూ - మరి నాకు వేళయింది, వెళ్తున్నాను."

"ఇంతవచ్చి కాఫీయేనా తాగలేదు... ఒక్క పదినిమిషాలుండకూడదా."

"దార్లో తాగి వచ్చానులే—......

"అయితే కొత్తపేటలోనా? మీ ఆఫీసుకి ఇప్పటికంటె దూరంకాబోలు."

"అదే మంచిది. నా సైకిలుతీసి బాగు చేయించేస్తాను—ఇప్పుడిది దూరమని దూరంకాదు, కాకపోవడమూ కాదు—అక్కణ్ణించి అయితే సైకిలుమీదే వెళ్లిపోవచ్చును. ఇప్పటికంటె ఎక్కువశ్రమ ఉండదు.

"మీయిష్టమే"

"అక్కడికి నీకు మహాఇష్టంలేన్నట్టు నిన్న అంతతొందర్లో మార్చేసి తీరాలన్నావూ. ఇప్పుడిలా నిదానంగా కబుర్లు చెప్తున్నావు. ఈనాడు ఆఫీసుకి వెళ్లివచ్చేలోగా ఏమయినా రాశికి వచ్చారేమిటి?"

"రాశీ, అది మరి ఈ జన్మకేలేదులెండి కాని ముందే ఆ యింటిని గురించీ, మనం వాళ్ళూ హాయిగా కలిసిఉండడం గురించి ఎక్కువగా అనేసుకొంటే, తరువాత నీకొంచెము అసౌకర్యంగాఉన్నా ఎక్కువ బాధగా ఉంటుందేమోనని భయం..."

"అర్థం ఏమి, ముందుజాగ్రత్త, నీకోరిక నెరవేరిందికదా, మరి నన్ను వెళ్లనీ......



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No7, ThambuChetty St., G. T. Madras.